శ్రీః.

శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

శ్రీ భాగవతశిరోమణి తిరుకడయూరి కృష్ణదాసుగారిచే రచింపఁబడి

# రామదాసచరిత్రము.

ఇదియే శ్రీరామభక్తశిరోమణి కంచర్లగోపన్నగారి
జీవనచరితముగ నున్నది.

ఇహపరసద్గతిసాధనయం దాసక్తిగల శ్రీరామభక్తులగు
సదాస్తికమహాజనులకు సత్కాలక్షేపయోగ్యంబగునట్లు
ప్రాచీనానేక ప్రతులసాహాయ్యముతోఁ బండితులచేఁ
బరిష్కరింపంబడినది.



చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచేఁ

ప్రకటితము.

1936

క. శ్రీభద్రాచలరామ, ప్రాభవముం దెలియఁగోరు ప్రాజ్ఞుల కిది చి
ద్వైభవము నిచ్చి ప్రోచెదు, శోభనచరితంబు సద్యశోభరితం బౌ

# PREFACE.

I have great pleasure in announcing to the Telugu Public a new edition of Sri Rama Doss Charitram in a handy and well-executed form. The book is published under the auspices of the Bhadrachala Kalakshepa Sabah. In a previous publication on "Duty" the worth and significance of a life of Duty are brought out. But the best means of moral education is not merely enumerating moral precepts, but consists in studying the biographies of great and virtuous souls like Kabir and Rama Doss, in mentioning whose names, we seem to be lifted up into a moral atmosphere. With this object in view, this book is published.

My thanks are due to the old and enterprising firm of Messrs. V. Ramaswamy Sastrulu & Sons, for the neat execution of the book. In this connection, I deem it superfluous to speak about the valuable service this firm has been doing in the cause of Sanskrit and Telugu literatures for the past seventy years. It is a pity their silent work did not receive recognition in some quarters. A novelty of this edition is that in the frontispiece, there is a half-tone photo of Sree Rama Doss.

Presidency College,
MADRAS.
10—12—1911.

S. RADHAKRISHNAN, M.A., L.T.,
*Professor of Philosophy.*

# పీఠిక.

---

శ్రీరామచంద్రపరబ్రహ్మభక్తులగు లోకులకు విజ్ఞాపనము. ఈ పుస్తకమునందలి భక్తులకు గల్గుప్రయోజనంబులు మొదట కనుపరచి యుండు పౌరాణికకథాసంగ్రహము చేతను, శ్రీరామదాసుగారిచరిత్ర సంగ్రహము చేతను, పాఠకులకు సువ్యక్తంబు. మఱి భగవద్భజనపరులకు నత్యంతోల్లాసకరంబై యుండు యక్షగానకృతియగుటచే నిది సరస జనాదరణీయంబై యుండును. దైవభజనలో సంగీతమేగదా మనస్థైర్యము నిచ్చునట్టిది? కావున నీగ్రంథంబు రమణీయంబైయుండును. ఇక శ్రీరామభక్తియే ముఖ్యకర్తవ్యమను విషయంబును మాయొక్క "కర్తవ్య" (Duty) గ్రంథమాలికలోని శ్రీరామస్తవరాజంబున నీవఱకే మిక్కిలి చక్కగ నిరూపించియుండుటచే వాచకులందఱును తత్కర్తవ్యగ్రంథమాలిక నాలకించి ప్రోత్సాహకులగుదురుగాక. ప్రకృతమిట్టి శ్రీరామదాసచరిత్రమును రమణీయంబుగా మాభద్రాచలధర్మకాలక్షేపసభవారుద్దేశించినటుల నేము ద్రింపించి ప్రకటించుటకు ప్రోత్సాహకులైన శ్రీవావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి సహాయమును శ్రీవేంకటేశ్వరసహాయంబనియే భావించెదము. ౭౦ సంవత్సరములుగా సత్పుస్తకంబులను, అంతయేల మొట్టమొదట సవ్యాఖ్యాన శ్రీరామాయణమును, శ్రీభాగవతమును ఆంధ్రలోకంబునకు ప్రకటించి చూపిన వీరిసత్ప్రవర్తనంబును సంభావించెదము. ఇట్టివారికి మిక్కిలి కృతజ్ఞులము. మఱియు నీపుస్తకమున నీవఱకు ముద్రించినవాటికన్నను అధికంబుగా శ్రీరామదాసుగారి భావచిత్రము చేర్పఁబడియున్నది. కావున నందఱు దీని నంగీకరించి పఠనాదులచే మాప్రయత్నమునకు సఫలత నిచ్చునట్లు లోకులు సంభావింపం బడుచుందురు.

10-12-1911. }
చెన్నపురి. }

ఇట్లు,

సర్వేపల్లి రాధాకృష్ణయ్య, M. A., L. T.



శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః.

# భద్రాచల రామదాసచరిత్రము.



ఆనందభైరవిరాగము - ఆదితాళము.

* డోహరాచరణములు.



కరమగు శ్రీరామనామమును స్థిరమతిఁ దలఁచినజనులు
ప్రకటయశుఁడగు రామదాసువలెఁబరముఁగందు రానరులు
మక్కువతో సిరి నురమునఁ జేర్చిన మందరధరు సేవించి.

శ్రీ మ హా వి ష్ణు స్తు తి.

శా. శ్రీవైకుంఠపదంబుఁ గోరి మదిలో సేవింతు నెల్లప్పుడున్
శ్రీవత్సాంకుని నిష్కళంకుని మహాశేషాహిపర్యంకునిన్
దేవగ్రామణి నాశ్రితామరమణిన్ నిత్యాత్తరక్షామణిన్
భావాతీతుని భద్రశైలనిలయున్ భద్రప్రదున్ రామునిన్.

నాటరాగము - జంపెతాళము.

జయదశరథపుత్ర జయపుణ్యాచారిత్ర జయజలజదళనేత్ర జయచారుగాత్ర జ.
జయసత్యసంభాష జయసుగుణగణభూష జయభక్తజనపోష జయదైత్యశోష జ.
జయభానుకులచంద్ర జయకాంతియుతచంద్ర జయకీర్తినుతచంద్ర జయరామచంద్ర జ.
జయమనోరథకామ జయజలధరశ్యామ జయభద్రగిరిధామ జయసార్వభౌమ. జ.

### బ్రహ్మస్తుతి.

*వాక్కున వాణిని పరుసను నిల్పినవనజభవుని ప్రార్థించి

ఉ. ప్రాణులమేలు గీ ల్గొరసి ఫాలతలంబున వ్రాయు నాజగ
త్త్రాణుఁ గళాప్రవీణు శ్రితరక్షకు దుర్మదశిక్షకు న్మహా
వాణికిఁ బ్రాణనాథుఁ డగువానిఁ గుఱించి విరించి నెన్నెదన్
క్షోణిసురాసురప్రణుత కోవిదమోహను హంసవాహనున్.

### శివస్తుతి.

* అర్ధాంగంబున నంబికనుంచిన యంగజదమనుని యెంచి

ఉ. శాంకరి వామభాగమునఁ జంద్రుఁడు మౌళి నలంకరింప మీ
నాంకవిభూతి మేన్నెరయ నగ్గజపుప్పళితోఁ గడంగినన్
రంకెలువ్రేయు నబ్బసవరాయని నెక్కుడువాళిసేయు నా
శంకరు భక్తమానసవశంకరు నర్చనఁ దేల్తు నామదిన్.

### వినాయకస్తుతి.

* ప్రార్థనఁజేసి వినాయకమూర్తిని పరమాత్ముని మది నెంచి

క. వామను మోదుకహస్తున్, సామజముఖపద్ము బాలచంద్రకిరీటున్
చామరకర్ణగణేశున్, ద్వైమాతురు నేకదంతుఁ దలఁతున్ గొలుతున్

నాదనామక్రియ రాగము - ఏకతాళము.

సిద్ధివినాయక నమోనమో - ప్ర - సిద్ధపూజితపాద నమోనమో.
సింధుగంభీర తే నమోనమో - మేరు - కంధరధీర తే నమోనమో.
ఆదిదేవాయ తే నమోనమో - దే - వాదిదేవవినుత నమోనమో.
విఘ్నరాజాయ తే నమోనమో - ని - ర్విఘ్నకారక తే నమోనమో.

### ఆంజనేయస్తుతి.

* రామభక్తుఁ డగునంజనీసుతుని ప్రేమతోడఁ దలఁబోసి

చ. కరములచేత రామపదకంజదళంబులసేవ వాక్కుచే
నిరతము రామకీర్తనము నెమ్మి మనంబున రామతత్త్వత
త్పరత శిరంబుచే రఘునృపాలవరేణ్యునకు న్బ్రణామముల్
నిరతి నొనర్చువాయుసుతుని న్భజియింతు నభీష్టసిద్ధికిన్.

సురటరాగము - ఆదితాళము.

ఆంజనేయునిఁ దలఁతు శ్రీమదాంజనేయునిఁ దలఁతు.
లంకలో నున్నసీతాదేవిని శంకమాన్పినట్టి సంజీవరాయని
లంకిణిఁ బరిమార్చి రావణాసురుని లంకఁ గాల్చినట్టి లాంగూలఘనుని. ఆం.
నిండగు భానుమండలమ్మును పండని పట్టిన పరమ సాహసుని
మెండగు రావణుమూలబలంబులఁ బిండిసేసినట్టిభీమపరాక్రముని. ఆం.
దిట్టఁడై యక్షయకుమారుని చట్టలుబట్టి చీల్చినఘనుని
మట్టుబెట్టి యలరావణాసురునట్టిట్టుచేసిన యంజనీసుతుని నాంజనేయునిఁ దలఁతు.
* వాల్మీకిరుభవు లాదిద్యైన వరవర్ణితసుకవుల డాసి
క. ఎన్నుదు శ్రీవాల్మీకి, న్నన్నపఁ దిక్కన్న నెఱ్ఱనను బాణమయూ
రు న్నాచనసోముని భీ, మన్నను శ్రీనాథు రంగయను భాస్కరునిన్.
* ప్రహ్లాదాదులపాదపద్మములు పదియిరుమారులు మ్రొక్కి
శ్లో. ప్రహ్లాదనారదపరాశరపుణ్డరీక వ్యాసాంబరీషశుకశౌనకభీష్మదాల్భ్యాన్,
రుక్మాంగదార్జునవసిష్ఠబలీ న్విభీషణాదిపుణ్యానిమాన్ పరమభాగవతాన్ స్మరామి.
* యాహ్లాదముతో నాధునికులు నగునాంధ్రకవులఁ గొలిచి
పాషండులమద మరసి యణంచిన పరమగురునిఁ దగ వేఁడి
శేషశయానుని సేవకజనులను జేతు లెత్తి కొనియాడి.

వ. అని చింతింపం జేసి "సర్వం విష్ణుమయం జగ" త్తనియెడి యుపనిషద్వాక్యమహిమ కట్టెదుర నెదురుకొనంగడుఁ, "ఏకో విష్ణుర్మహద్భూత" మ్మను బలిమిపట్టువిడుపు లెఱింగింపఁగను, "నావిష్ణుః పృథివీపతి" యను సకలరక్షకత్వంబు దీపింపఁగను,"న దైవం కేశవాత్పర"మ్మను మంత్రాధిదేవత రామానుజమతంబు చూరవిడువఁగను, "ఓన్నమో నారాయణాయ"యను శ్రీమదష్టాక్షరి దలపించఁగను,సహస్రనామతుల్యంబును తారకబ్రహ్మంబును నగు శ్రీరామనామంబు జగదద్భుతంబై మరులు కొలుపఁగను, "న శూద్రా భగవద్భక్తా" యని శ్రీకృష్ణుండు ప్రేరేపింపఁగను, "యద్భావ్యం తద్భవతి" యను చిన్మయాకారంబు రూపింపఁగను, ప్రహ్లాద నారద ధ్రువవిభీషణాదుల కిచ్చినపదవులు యెప్పుడుం జెడవని బిరుదు తరువు సేయఁగను మత్పూర్వజన్మహారిసేవాపుణ్యమలయగంధవాహసుగంధంబు గంధిల్లుటం జేసి.

నాటరాగము - ఆదితాళము.

సేవేఽహం శ్రీరఘువీరం సేవేఽహం.

శ్రీరఘువీరం శ్రితజనాధారం అఘచయదూరం కౌస్తుభహారం సేవేఽహం.
పావనచరితం భవభయరహితం సేవకావన వరసింధుగంభీరం సేవేఽహం
అరిదరాభరణం ఆర్తిసంహరణం పురహరాదిదేవ పూజితచరణం సేవేఽహం.
వాసవవినుతం వైభవకలితం పోషితనారసింహ దాసప్రముదితం సేవేఽహం.

క. శ్రీరామ రామ యని నరు,లూరక వాక్రుచ్చినంత యుత్తములంటనా
కోరికతో రామకథా, సారముఁ జెప్పంగ జన్మసఫలము గాదే.

* రామదాసునిచరితముఁ జెప్పెద రాదు జన్మ మని పూని

క. శ్రీపర్వం బనుభవికి స,భాపర్వము పతికిఁ గర్ణపర్వము మునికిన్
గోపికిని శాంతిపర్వం, బేపున శ్రీరామచరిత మెల్లజగములన్.

చ. అమరుల మెచ్చు రాజవిజయంబు గృహీతశుభావహంబు పు
ణ్యములకుఁ బుట్టినిల్లు బలి నారద శౌనక ముఖ్యభక్త హృ
త్కమలదివాకరోదయము గాఢతరాంధవిదీయమాన మ
త్యమలము సంతతాద్భుతము నైనది రామచరిత్ర మెంతయున్.

ఉ. భూమిజఁగాని యన్యసతిఁ బొందఁడు కామిత మిచ్చుఁగాని తా
నేమియుఁ దెమ్మనండు సుర లెన్నెడి సత్యముకాని పల్కఁడు
ద్దామగరిష్ఠుఁడై యభయదానమెగాని తలంకఁ డెందు మా
రామునివంటిదేవుఁడు ధరం గలఁడే తలపోసి చూడఁగన్.

నాటరాగము - ఆదితాళము.

నమోఽస్తుతే రఘునాయకా నమోఽస్తుతే.

నమోఽస్తుతే రఘునాథపరాత్పర రమామనోహర రణజయశూర నమో.
పారావారవిహారగంభీర పాథోధిశయన పంకజలోచన నమో.
మందరగిరిధరమహితవిచార మానితకాసారమణిమయహారా నమో.
వారణదుఃఖనివారణశుభకరనారసింహదాసావనలోలానమోఽస్తుతే రఘునాయకా.

* సామజవరదుఁనిభక్తుల కెల్లను సమ్మద మగునటు లూని

మ. ధనమస్థైర్యము మేను బుద్బుదము చిత్తవ్యాధు లజ్ఞానలో
తనయుల్ పెట్టని సంకెలల్ హితులు నర్థస్నేహు లట్లౌట నె

వ్వని కెందుఁ సుఖమొందఁగల్గు హరిసేవాబుద్ధి నేతక్క నం
చును జెప్పఁ దొరకొంటి రామకథ ప్రాజ్ఞుల్మెచ్చఁగాఁ బ్రౌఢిమన్.

సభావందనము.

శ్లో. సభాకల్పతరుం వందే వేదశాఖోపజీవితమ్,
శాస్త్రపుష్పసమాయుక్తం విద్వద్భ్రమరశోభితమ్.

పంచపాది.

ఉ. సచ్చరితు ల్సమస్తగుణసంపదలం బొలుపొంది శాస్త్రము
ల్నిచ్చలు సాధుసంఘము లనేకవిధంబులఁ దెల్ప వింటుఁ బ
ల్కుచ్చట లొందుమీమదికి మోద మెలర్పఁగఁ జెప్పనేర్తునే
పచ్చనికోకవానిపయిపాటలు కీరము హెచ్చి పల్కఁగా
మెచ్చినరీతిఁగాఁగ నను మెచ్చఁదగుఁ దలపోసిచూడఁగన్.

కల్యాణి రాగము - చాపుతాళము.

దండమనుచు మ్రొక్కెదా యీసభకెల్ల నిండు భయభక్తులను దండ.
పుండరీకదళాక్షుభక్తులు మెండుగానిండుకొనియుండఁగ
దండధర కింకరులచే భయముండదని మీయండఁజేరి దండ.
భక్తవర్యులు భాగవతులు విరక్తచిత్తులు సక్తులగుటను
ముక్తికి సందేహ మేమని యుక్తిచే మిము రక్తిఁజేరి దండ.
వాసుదేవుని దాసదాసులు యీసభను వసించి యుండఁగ
దోసముల కిఁక యాసలేదని వేసరక బాసటనుజేరి దండమనుచు మ్రొక్కెదా.

సీ. పుణ్యమూర్తులు మహాత్ములు ప్రశాంతులు ఘనుల్ ధీనిధు ల్భక్తవిధేయమతులు
షడ్వర్గవిగళితషడ్గుణైశ్వర్యులు భగవత్కథాసుధాపానరతులు
భక్తాగ్రగణ్యులు భగవదాచార్య భాగవతార్యకార్య కైంకర్యధుర్య
ధైర్యశౌర్యులు సదా దానధర్మజ్ఞులు స్వామిసామీప్యులు సాధుమతులు
తే. మీకృపామృతదృష్టి నామీఁదఁ బర్వ, జనకుమంగల బాలభాషణలఁబోలె
నాదుమనమున రాముని నతులుసేసి, చెలఁగి చెప్పెద వినుఁడు భో సభికులార.

సీ. ఈసభాస్థలిలోన నీసజ్జనులమ్రోల హరికథ జేసెద హర్షమునను
భద్రాచలంబున భద్రయశుం డైనగోపన్న తహసీలు గొమరుమిగులఁ
జేయుచు సర్కారు శిస్తుపైకంబెల్ల శాహుల్ స్థలిలకు కైంకర్య మమరఁ
జేసి తానీషచేఁ జెప్పి చూపఁగరాని శిక్షలెల్లను బొంద శ్రీనివాసుఁ

తే. డార్తుఁడైనట్టిభక్తుని నాదరింప, బంటువేషము ధరియించి భాగవతుని
కరుణ రక్షించునట్టియీకథ వినంగ, నందరానట్టిసౌఖ్యంబు లందఁగలవు.

గీ. వక్తయైనవాని వర్ణింతు రెప్పుడు, వక్తగానివానివార్త లేదు
వక్తననఁగరాదు వక్తగాననరాదు, గానసభకు మ్రొక్కి కథయొనర్తు.

వ. అని సర్వమంగళపరంపరాభివృద్ధిగా నాయొనర్పంబూనిన రామచంద్రపదకమలయుగళారాధనతత్పరుం డగు శ్రీభద్రాచల రామదాస చరిత్రంబునకుఁ గథాప్రారంభం బెట్లనిన.

* ఏఁబదియాఱుదేశములందును నెన్నఁదగినగోల్కొండ

నాదనామక్రియ - ఏకతాళము.

ఎంతోవింతైయున్నది గోల్కొండపుర మెంతోవింతైయున్నది.
శ్రీనొసంగునీక్షితిశలమందున మానితగతిఁ బేర్కొనఁదగునప్పురి
తళతళ కాంతులఁ దగుగోపురముల ఫళఫళఫళ మనుప్రాకారంబుల
నిగనిగనిగ యనునెరెమంటపముల ధగధగధగ యనుధ్వజములకాంతుల
రమణీయం బగురపశశివీథులఁ గమనీయము లగుఘనసౌధంబులఁ
దరుచై యొప్పెడు ధనికులగృహముల మెరుఁగుదట్టముల మెరయుకుడ్యముల
ఘుమఘుమఘుమ యనుకుసుమగంధముల ధమధమధమ యనుఢక్కారవముల
ఝుణుఝుణు యనుజంత్రనాట్యముల ఘణఘణఘణ యనుఘంటారవముల
ఘనరత్నంబులు గలశైలంబులఁ గనకసైకతము గలిగినభూముల నెంతోవింతై.
అచ్చటిబ్రాహ్మణు లజసన్నిభులు అచ్చటిభూపతు లతిధర్మాత్ములు
అక్కడిబేహరు లలకుబేరులు అక్కడిశూద్రులు నిక్కపుధనికులు
బలరామునిగతి బలపరాక్రములు బలిబంధనుగతి బ్రబలునేర్పరులు
విమలోదకముల వెలసినబావులు కమలవ్రజములు గలిగినహ్రదములు
సురుచిరకర మగుసుందరవనములు పరిపరివిధముల ఫలవర్గంబులు
ప్రతిగృహంబులను రంగవల్లులు సతతము వీటను సంగీతంబును
రథములు హయములు రాజమార్గములు పథికులకింపగు పాకశాలలు
ముద మెప్పుడు మది నొదవఁజేయుచును విదితముగా ధర వెలయును గనుఁగొనఁ నెం.
ఇందునిభం బగుసుందరముఖములు కుందముకుళములఁ బోలురదనములు
కమలముకుళములఁ గరితలకుచములు సుమబాణంబులు సుదతులచూపులు
శ్రీపర్ణంబులు చెలికర్ణంబులు శ్రీపర్ణము లిడు చెలులగృహంబులు
ఘలుఘలుఘల్లనుగజ్జలరవళులు ఝులుఝులుఝల్లనుసరసులగుండెలు

ఝుంతకిటఝుంఝుంతరి యని బలు వింతవింతలుగ వెలయు నాట్యములు
అభిరామం బగునభినయములబలు అభిమతంబు లగుహావభావములు
రాత్రిపగ లెటుఁగ రాకవిభవములు నేత్రోత్సవమై నిరతము నిట్టులు
అమరపురమొకో యనఁగను మనుజులు నమరియుందురట నమరిహర్షములు ౧౦.

* నబాబు తానిషాతక్కుఁ జేరి యానగర మేలుచుండ
మక్కావగలుగు దివాను లాతనికి మాన్యులు బహుసజ్జనులు
అక్కన మాదన్నయు నని యిద్దఱు నన్నదమ్ము లతిప్రియులు.

క. అనఘుల శాస్త్రవిధిజ్ఞుల, ననురక్తులఁ బితృపితామహక్రమమున వ
చ్చినవిప్రులమంత్రులఁగా, నొనరించెనుగార్యసంప్రయోగముకొఱకున్.

* వీరలఁ గూడుక వైభవ మొప్పఁగ వీరభటులు గొలువఁగను
శూరుఁడు తానిష పాలించెను భువి సుజను లెల్లఁ బొగడఁగను
గోలకొండతోఁ జేరిన తుకిడీ లోక్కట్లలెక్కగల వందు
వెలయఁగ భద్రాచలమను తుకిడీ వేవిధముల మేలొందు.

క. ఇంటింట నన్నసత్రము, లింటింటం బరిణయంబు లింటింటఁ బ్రపా
మంటపములుపవనములిం,టింటఁబు రాణములగోష్ఠియింటింటనగున్.

క. ముకురములోఁ బ్రతిబింబము, ప్రకటితమేరుగిరిజాపుపగిది దెలిపెదఁ
సకలంబు నెఱఁగి యెవ్వా,రికి వశ మర్పణము ధురీణత నెన్నన్.

క. తప్పాడుటయునుమదిరయు,నిముప్పునులోభంబుఁగోపమునుదారిద్ర్యం
బెప్పుడు లేదఁట ప్రజలకు,నప్పట్టణ మెన్నఁదరమె యజునకు నైనన్.

* పాలుకు బారాలక్షలపైకము సర్కార్కి స్తికిఁ జెందు
మేలుగలిగి వర్తింతురు కాపులు మేలుగలిగిసిరులందు.

గీ. ప్రజలు నిత్యకల్యాణము లృచ్చతోర
ణముల నెలమూఁడు జల్లు దున్నకయె పండుఁ
గలియుగంబయ్యుఁ గృతయుగరీతి నప్పు
రమున నాల్గుపాదముల ధర్మంబు నడుప.

* ఈతుకిడీలోఁ జేరిన గ్రామము నెలకొండపల్లియయందు
ఖ్యాతిగ లింగనమంత్రి వసించెను కాపురముగ నందు.
లింగనమంత్రి వివాహంబయ్యెను మంగళవతిఁ గామాంబ

పొంగుచుఁ బతికనుసన్నలసేవఁ జెలంగుచుఁ జేయుచునుండెఁ
సంతానార్థము లింగనార్యుఁ డాసారసనేత్రునిఁ గొలిచెన్.

ద్వి ప ద.

జయజయసర్వేశ జయభవనాశ, జయజయలక్ష్మీశ జయదైత్యనాశ
జయజయసురరక్ష జయమానిపక్ష, జయజయరిపుశిక్ష జయజగద్రక్ష
కుక్షి నీజగముల కుదురుగా నిలిపి, రక్షించఁగలయట్టి రాజవు నీవె
ఇంద్రియంబులయందు నిరవుగా నుండి, యింద్రియంబులపోక కిష్టంబు నీవె
యరుమగాఁ దత్త్వంబులందుల నిలిచి, క్షర మక్షరములకు సంధియుం నీవె
పుట్టింప రక్షింపఁ బొడ వడఁగింప, గట్టిగా బ్రహ్మాండకర్తయుం నీవె
యిన్నిచిత్రంబుల నెఱుఁగనియటులఁ, బన్నినసూత్రంబు బ్రహ్మాదులైనఁ
దెలియంగ నేర్తురే దేవదేవేశ, వికసిల్లునీకీర్తి వినుతులు సేయ
నే నేరఁ బొగడంగ నీరజనాభ, జ్ఞానిని గాను నజ్ఞానిని నిన్ను
మలయుచు నేవేళ మదిలోన నుంచు; సలలితం బగుభక్తజనములయందు
వదలక వర్తింతు వైభవలీల, సదమలాచారంబు సాధింప వశమె
యటుగాన నే నెంచ నపరాధి నిపుడు, కటకటా నీమాయ గానఁగా నేర
రక్షించు రక్షించు రాజీవనయన, పక్షివాహన నీకుఁ బ్రణుతి యొనర్తు
దయఁజూడు మీఁక పుత్రదానంబుఁ జేసి, భయరహితుండనై భక్తిఁ గొల్చెదను.

వ. ఇవ్విధంబున బ్రార్థించిన నారాయణకృపావిశేషంబున.

* సంతోషంబుగ నాతనిగృహిణికి సరగ జూలు నిలిచెఁ
నవమాసంబులు నాతికి నిండెను నారాయణుకృపచేతఁ
సవరణగాఁ గనెఁ బురుషశిశువును సరససద్గుణోపేతుఁ
పుత్రోత్సవ మనుపోడిమిఁ జరిపెను బుణ్యమూర్తిలింగన్నా
నేత్రోత్సవ మాలింగన కనుచును నిఖిలజనులు తన్నెన్నా.
కామజనకునికరుణకుఁ బాత్రుఁడు కాఁగలఁ డనెడుప్రవాదఁ
నామకరణమును జేసె గోపన యన నార్యుల నానతిమీఁదఁ
ఉపనయనంబును నొనరఁగ నడిపెను యుక్తకాలమునను
యుపమ గలదు పుత్త్రున కని నేర్పిరి యురుశాస్త్రంబులను

గీ. శాస్త్రచింతన చేయుచో శాస్త్రవిదులు
బాలరామాయణంబు తాత్పర్య మొప్పఁ

దనకుఁ జెప్పిన రాముని ఘనమనీష
లెల్లఁ దలపోసి యిట్లని దల్లడిల్లె.

నీలాంబరిరాగము - త్రిపుటతాళము.

ఏలా పుట్టకపోతి నాఁడే రాములతోడ ఏలా.
మూలమైన బ్రహ్మమే తెంచి కౌసల్యాగర్భ గోళములోనుండి యవతరించి
శ్రీరాములనఁగ లీలజగములనువర్తించి బాలక్రీడలఁ పారాడెడు నెడ
లాలనసేయుచు జోలలుపాడుచు జోజోజోయనిజోకొట్టుదుఁగద
నోలనిలుపుకొని ముద్దుఁజూతుఁగద మేలుమేలనుచు మెచ్చుకుపతోడుత
వాలాయముగా వద్దఁ జేరుకొని మూలమిశండని మోదము నొందుదు నేలా.
తిన్నగా నడిచేటినాఁడే మా రామన్న చిన్నవాండ్రతో నాడేనాఁడే
తమ్ములతోనుసన్న సైగలుజేసేనాఁడే చిన్నన్నుకునే చిక్కుఁ దీతుఁగద
కన్నన్నుకునే కాళ్లొత్తుదుఁగద పొన్నన్నుకునే బువ్వఁబెడుదుఁగద
కన్నతండ్రిగదకాకుత్థ్సకులుం డెన్నఁడురాముని యెడబాయనుగద
యెన్ని నేర్చనో యన్న రాఘవులు యెన్నఁడు బుట్టెనో మొన్నకుమున్నే.
భూతేశు విలువిరిచినాఁడే జనకుని కూఁతుసీతాకల్యాణ మయ్యేనాఁడే
అనుజ జనసమేతుఁడై యూరేఁగేనాఁడే ఆతతమతి నేనారతిత్తుఁగద
జాతిగంధపడి జల్లుచుందుఁగద భ్రాంతిని బాటలు పాడుచుందుఁగద
నూతన సుమముల నొగిజల్లుదుఁగద జాతిపునుగుచేఁ జేతఁబెత్తుగద
పాతకహరు గోపాలబాలుని గనిభూతలమున నేత్రే తాయుగమున నేలా.

గీ. ఇవ్విధంబునఁదలఁచుచునిందిరేశు, పైనిఁగలిగిన బాళితో బాలుఁడయ్యె
సర్వశాస్త్రార్థసారవిస్తారమెల్ల, నేర్చి వైరాగ్యవంతుఁడై నెగడెనిట్లు.

వరాళిరాగము - రూపకము.

అయ్యయ్యో నేజెల్ల యీజీవునకు సుఖ మెయ్యెడలేదుగదా
జన్మాలు యెన్నెన్నో గలవుగదా రామయ్యా.
చయ్యనరఘుకులసార్వభౌమయే చందానఁ బ్రోఁచెదవో రామయ్య అయ్యయ్యో.
వనజనాభునిమాయఁ దెలియక నేవెట్టివగలఁబొందు చునుంటిఁగా కొన్నాళ్లు
మునుపు సేసిన పుణ్యపాపసంఘములచే మునిగి తేలుచునుంటిఁగా కొన్నాళ్లు
ఎనుబదినాల్గులక్షల యోనులందెల్ల వేసరక పుట్టితిఁగా కొన్నాళ్లు
అనయము నరకము లనుభవించి స్వర్గ మంతట జొచ్చితిఁగా ఓరామ అయ్యయ్యో.
ఆలంబనములేక నాకాశమందున నలసట నొందితిఁగా కొన్నాళ్లు

మేలు దెలియ్యలేక మంచులోపలఁజిక్కి మిణుఁకుచునుంటిఁగదా కొన్నాళ్లు
యీలాగుతాఁజొచ్చి మేఘమధ్యమందు నిడుములఁబడుచుంటిఁగా కొన్నాళ్లు
జాలినొంది సూర్యకిరణములోఁజొచ్చి చలనమునొందితిఁగా ఓరామ అయ్యయ్యో.
వర్షాములోఁజిక్కి వసుమతిమీఁదను వర్తింపుచుంటిఁగదా కొన్నాళ్ళు
వరుసనశేషసస్యగతమైన ధాన్యముల వరలివర్తించితిఁగా కొన్నాళ్ళు
పురుషుఁడారగించు నన్నముతో వానిపొట్టఁజేరియుంటిఁగా కొన్నాళ్ళు
వరనరుని రేతస్సువల్ల నారీగర్భనరకానఁబడియుంటిఁగా ఓరామ అయ్యయ్యో.
తిప్పచుఁ దిత్తిలోపల దినదినము ప్రవర్ధిల్లుచుంటిఁగదా కొన్నాళ్ళు
అప్పుడుమాతల్లి యుప్పుపులుసుదిన నంగలార్చుచుంటిఁగా కొన్నాళ్ళు
ఎప్పుడుయిందుండి బయలు వెళ్ళుదునని యెదురుజూచుచుంటిఁగా కొన్నాళ్ళు
చెప్పరానటువంటి ద్వారములోనుండి జననమునొందితిఁగా ఓరామ అయ్యయ్యో.
పొరలుచు దుర్గంధ పొత్తిళ్లలోఁదగిలి పొదలుచునుంటిఁగదా కొన్నాళ్ళు
పెరుగుచు బాల్యావస్థలఁ గొన్నిదినములు పరుగులాడుచు నుంటిగా కొన్నాళ్ళు
తరుణులతోఁ గూడి మదమత్సరములను తన్నెఱఁగనైతిఁగదా కొన్నాళ్ళు
తరువాత దారాపుత్రాది మోహములఁ దగిలివర్తించితిఁగా ఓరామ అయ్యయ్యో.
తలతెల్లనై దంతములూడి వణఁకుచుఁ దడబడుచుంటిఁగదా కొన్నాళ్ళు
తలుపుదగ్గరఁ జేరి బలిభిక్షములవారిఁ దగిలితిట్టుచునుంటిఁగా కొన్నాళ్ళు
పిలిచినరాని పెండ్లాముబిడ్డలచేత నిడుములఁబడుచుంటిఁగా కొన్నాళ్ళు
బసిమిదీరి కండ్లుపొరలు గప్పిపరులఁ బతిమాలుచుంటిఁగదా ఓరామ అయ్యయ్యో.
అంతట మృతిఁబొంది యలయుచు యమునిచే నాబాధలొందితిఁగా కొన్నాళ్ళు
వింతగా నీరీతి పుట్టుచుఁగిట్టుచు వేదనఁబడుచుంటిఁగా కొన్నాళ్ళు
కంతుజనక భద్రాచలపతి నిన్ను నే గనలేక తిరిగితిఁగా కొన్నాళ్ళు
వింతగనే రామదాసుఁడనైతిని యిఁకనెట్లు ప్రోచెదవో ఓరామ అయ్యయ్యో.

నేజెల్ల యీజీవునకు సుఖమెయ్యెడలేదుగదా రామయ్యా.

*ఈగతి జననీజనకులు పుత్రుని నీతిమంతునిఁగఁ జేసి
వేగమె శ్రీహరినిలయముఁ జెందిరి వేఱుజన్మములఁ బాసి.

యదుకులకాంభోజిరాగము - చాపుతాళము.

వైకుంఠముఁ జేరెను లింగనమంత్రి పరభార్యామణితోడను
వైకుంఠముఁ జేరవై భవోజ్వలుఁడగుచు నేకాలములకైనరాఁకపోకలులేని వైకుంఠ.
సారసాక్షునిభక్తునిఁ దనయునిగా కోరికాంచిరక్తిని
సారహీనమైన సంసారజలరాశి తీరముఁగడఁగాంచి మేరుధీరుఁడై వైకుంఠ.

* అంతట గోపన తల్లిదండ్రులకు నపరక్రియలను జేసి
సంతసమున నొకకన్యను తనసరి సాటివారిలోఁ దీసి.
* వివాహ మప్పుడు చేసికొనియెను విబుధవరుల సమ్మతిని
సువాసినీమణినిగూడి చరించెను సొంపుమీఱ నెమ్మదిని.
పుత్రుఁడొకఁడు పుట్టెను గోపన్నకుఁ బురుషోత్తముకృపచేతన్
మిత్రకులుని పేరిడి ముదమందెఁ బవిత్రమాయెఁ గులమనుచున్.
గీ. ఇట్లు పేరిడి పుత్రునిఁ దొట్లనుంచి, రామనామంబు పైప్రేమ రంజిలంగ
రామ యీరీతి వెలసితే రాయటంచు, సొక్కి రామునిగూర్చియు
[జోలఁబాడె.

ఆనందభైరవిరాగము - చాపుతాళము.

రామరామరామజోజో ఘన శ్యామలనిభ దేహ సౌందర్య జోజో రామ.
చిన్నారిముద్దులపట్టి వేగ మన్నించి మమ్మేలుమాయలజెట్టి రామ.
అప్పచ్చి యిదిగోర యప్పా మా తప్పులెంచబోక దరిఁజేర్చుమప్పా రామ.
పాచిబోయించెదఁద్రాగి మమ్ముఁ గాచిరక్షించర కైవల్యమొసఁగి రామ.
బువ్వబెట్టించెద నీకు మమ్ము రవ్వలఁబెట్టుచు రాపాడఁబోకు రామ.
కన్నులుమూయవదేరా మమ్ము గన్నతండ్రి విగదర కరుణించవేరా రామ.
* పటుతరముగ నిహలోకసుఖంబుల పైని వాంఛలుడుగన్
ఇటువలె భోగము లెల్లను బొందెను యిరువదేండ్లలో గాన్.

వ. ఇవ్విధంబున గోపన్న యిరువదియేడులకులోఁగా నిహలోకసుఖంబుల కాధారంబగు దారం బరిగ్రహించి రామనామాంకితుండగు నొక సుపుత్త్రుంగాంచి పిత్రార్జితంబగు ద్రవ్యంబుల దానధర్మంబులం జేయుచు గృహస్థధర్మంబునకుంగల యాచారంబుల బుధులచే నెఱుంగుచు నిట్లని మానసబోధఁ జేయుచున్నాఁడు.

సావేరిరాగము - ఆదితాళము.

శ్రీరాముల దివ్యనామస్మరణ జేయుచున్నఁ జాలు
ఘోరమైన తపములను కోరనేటికే మనస
తారక శ్రీరామనామధ్యానముఁ జేసినఁ జాలు
వేఱువేఱు దైవములను వెదుకనేటికే మనస శ్రీ.
భాగవతుల పాదజలము పైనజల్లుకున్నఁ జాలు

భాగీరథికిపొయ్యెననే భ్రాంతియేటికే మనస
భాగవతుల వాగమృతము పానము జేసిన జాలు
బాగుమీరినట్టి యమృతపాన మేటికే మనస శ్రీ.

పరులహింసచేయకున్నఁ బరమధర్మ మంతెచాలు
పరులను రక్షింతునని పల్కనేటికే మనస
దొరకొని పరులధనముఁ దోచకయుండినఁ జాలు
గుఱుతుగాను గోపురము గట్టనేటికే మనస శ్రీ.

పరగదీన జనులయందు పక్షముంచినదె జాలు
పరమాత్మునియందుఁ బ్రీతిఁ బెట్టనేటికే మనస
హరిదాసులకుఁ బూజలాచరించినను చాలు
హరినిబూజసేతు ననేయహమేదేటికే మనస శ్రీ.

జపతపానుష్ఠానములు సలిపిరి మూఢులకై బుధులు
జగదీశుని దివ్యనామ చిన్తన కోసరమై మనస
చపలము లేక యేవేళ జింతించే మహాత్ములకు
జపతపానుష్ఠానములు సేయనేటికే మనస శ్రీ

అతిథివచ్చి యాకలన నన్న మింతయిడినఁ జాలు
క్రతువు సేయవలయు ననేకాంక్ష లేటికే మనస
సతతము మాభద్రగిరిస్వామి రామదాసుఁడైన
నితరమతము లనియేటి వెతలదేటికే మనస శ్రీ

మ. నిజదారైకపరత్వము న్గరుణయు న్నిక్కంబునుం దాల్మియుఁ
సుజనాసంగము దేవపిత్రతిథి సంశుద్ధార్చనల్ హవ్యభు
గ్భజనంబుఁ సకలాశ్రమస్థులకు శక్యప్రక్రియంబ్రోవుఁ బం
కజగర్భుండు గృహస్థధర్మములుగాఁ గల్పించె నంచెన్నుచున్.

* గృహపతి ధర్మము నెరపుచు గోపన గృహమందున తానుండి
విహగవాహనుని దాసుం డొక్కఁడు పీరిగృహము దండన్
పంచబాణజనకుని శ్రుతిఁబాడుచు నంచిత మతితో నుండఁగ

క. ఇవ్విధంబున భగవద్గుణానుభవంబు సేయుచుండు దాసునిఁగ
గోపన్నగారు.

* వంచనలేనిమహాత్ముఁ డీతఁడని యెంచి చెంత నిలుచుండెన్.
గోపన ముఖవైలక్షణముల నతి గుఱుతిడి దాసుఁడు జూచెన్.

మ. శిరము విశాలమైనను ప్రసిద్ధిగ దాతయు భోగియౌనురం
బరయవిశాలమైన నభియాతుల నేర్చును జాలకుక్షి వి
స్తరమున గాంచు నందనులఁ దత్ప్రకరంబులఁ బాదయుగ్మముల్
విరివి దనర్చునేని ఘనవిత్తమున న్ధనికుం డనందగున్.
* ఓప ననకు నే నొక్కటిఁజెప్పెద నొద్దకు రమ్మని పిలిచెన్.

వ. గోపనం బిలిచి నీయందు శాంత్యాదిగుణంబు లున్నయవి నీకు నఖండయోగంబును శ్రీరామచంద్రానుగ్రహంబును గలుగు నే దెల్పు నది వినుమని యి ట్లనియె.

హిందూస్థాని కాపిరాగము - ఏకతాళము.

నహీంభరోసాయిసతనధనకా రామనామముఖబోలోరే నహీం.
జోరులడకేదవలతదునియా మాయామృగజలసపనారే నహీం.
పుతాయెచీజియాలేగుయొశిఖరా వైసాజమకాఘాసారే నహీం.
కహతకబీరసునోభైసాధు దేఖత కాలతమాషారే నహీం.

* చేతులుసూపిన గోపనవచ్చిన చింతలేక నగుచున్
మాతండ్రియని కరుణనిట్టులనె మరవక వినుమనుచున్.

బ్యాగ్‌రాగము - జులైతాళము.

జంకాఅజప్‌తడాకాబేతుం క్యాబజానేలడకాబే జంకా.
నాబీమరగయెదసబీమరగయె మరగయెశాస్త్రఅత్యాసీ
తెత్తిసకోటీ దేవతామరగయెఫడీ కాలకీఫాశా జంకా.
జపీతపీసన్యాసీమరగయె మరగయెభైరాగీ పీరమరే
పైగంబరమరగయె మరగయెజందాజోగీ జంకా.
బడేమీజాసి అకడేభైరె కరలీయేసబసాజా
మారజప్ జంజఫట్‌లేజావే జంకూతీతరబాజా జంకా.
తీనలోక పరఛత్రబిరాజే లూకంజబిహారీ
కహతకబీరా సునభైసాధు రహీకకోనబిచారీ జంకా.

వ. హేసాధుసత్తమా! ఈకీర్తనలోని తాత్పర్యం బేమనిన యమున్ని

యొక్క దెబ్బ యెవ్వరికిని తప్పదు. ఆస్తంబబ్రహ్మపర్యంతము యెనబది నాలుగులక్షల జీవరాసులును కాలునిపాశములఁ గట్టుబడియున్న వి గాన నటులఁగాక చావుం బుట్టువు లేనిపదవిం జెందఁగోరితివేని త్రిలోకారాధ్యుండును గజేంద్రవరదుండును నైన శ్రీరామమూర్తిని యితరవిచారంబులం బోఁదోలి భజియింపవలయునని ఫలీభూతార్థముగావున.

* ఎన్ని పనులు నీకుండినఁ దగ నన్నీ త్యజించితి విది మొదలు
పన్నుగ శ్రీరఘురామరామయని పల్కుము రేయింబవలు.

శ్లో. శ్రీరామరామరామేతి రమే రామే మనోరమే,
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే.

హిందూస్థాని కాపిరాగము - చాపుతాళము.

హరిబోలాహరిబోలాహరిబోలాభాయీ హరినామబోలెవాహకరామదురాయీహ
హరికేభజనపతసబకామకరనా సంసారసాగరపారవుతరనా హరి.
సబనామలేతు సబిరినాలాగే హరినామలేతుకవరినలాగె హరి.
కహతకబీర సునోభాయిసాధు సబఘటఆత్మారామగోవిందు హరి.

* ఈగతిఁ బలుకుచునుంటివేని నిన్నేమంటదు భవరుజలు
వగవక గురుదక్షిణ నిప్పించుము వరదుఁడొసఁగు నిధులు.

కందార్థము - రాగము - శంకరాభరణము.

తనకున్నధనము గురునకు, వినయంబున ధారఁబోసి వేడ్కగురునిచే
ననువైన బోధవడసిన, ఘనమతిమంతునకు * సాటిగలరా యీభువినీ
లోకులు మ్రొక్కవలదా తాము వినీ, తను నితరు లేమన్నఁ దాననకయేమాట
వినకపరిపూర్ణతఁదగువానికి, సాటిగలరా యీభువినీ, లోకులుమెచ్చవలదాతాము వినీ.

వ. ఇవ్విధంబునఁ బలికిన.

*ఆమాటలువిని యానందంబున నటుల నేమికోరెదరు
సామాన్యము గాకుండినఁ దెచ్చెద స్వామి మీకు నజరు.
అనిన నవ్వి యాగోపనగారికి నాతఁ డిట్టులనెను
ఘనమతి నన్నుకబీరని చెప్పుదు రనయము భువిలోను.

కందార్థము.

నాబుద్ధికి సరిపడ్డది, నీబుద్ధికాని యెన్ని నేర్పులఁ గనినక

ఛీబద్ధుల యీబుద్ధులు, నాబుద్ధికి మెప్పురావు * నాతండ్రి వినర్రా
శబాసు నిన్నేతండ్రిగ నెరా, యీబుద్ధి మానకు మేబుద్ధి బూనకు
మేబుద్ధిఁబూనిన నీబుద్ధిచెడిపోవు, నాతండ్రివినరా శబాసు నిన్నేతండ్రిగనెరా.
*భిక్షునకేటికి నేపదార్థములు నక్షయపాత్రమె యుండఁగ
వక్షస్థలమున సిరినిధరించిన వాఁడు తోడుగానుండఁగ
మిమ్మడిగిన గురుదక్షిణఁజెప్పెద మేలని యిచ్చినఁజాలు
సమ్మతిరాముని మరువనటంచని మమ్మనిపిన పదివేలు.
అని తెల్పిన గోపన్న లేచి యావనజాక్షుని దాసునకుఁ
మనమలరఁగ సాష్టాంగవందనము మనసు చలింపక చేసెన్.
చేసి కబీరునిశిరమున జేయిడియిట్లనె గోపనగారు
వేసటనైనను రాము నేమర వివేక మొసఁగినారు.

వ. అని గురుసాన్నిధ్యంబున మానసబోధఁ జేయుచున్నారు.

పంతువరాళిరాగము - ఆదితాళము.

రామనామముఁబల్కవే పాపుజిహ్వా రామనామముఁబల్కవే.
రామనామమునీవుప్రేమతోఁబల్కితేను స్వామియెల్లప్పటికిఁగామితార్థములిచ్చు రామ.
మతిలేనివారెల్లను సీతాపతిని సతతముదలఁచితేను హితవుగవారి
పూర్వకృతము లెల్లనుమాన్చి యతులితసాంబ్రాజ్యానంద మొందఁజేయు రామ.
సారాసుందరాకారునీ వేసరకెపుడు కోరిభజియింపుచుండునీ
భూరికృతకల్మష వారములన్నియు చేరఁదియ్యకకొట్టి పారఁదోలెడిరఘు రామ.
దాసులనెల్లఁబ్రోచు భద్రగిరినివాసుఁడై జగములేలుచు
దోషములెల్లఁబాపి వాసిగధరలో రామదాసహృదయనివాసుఁడైన శ్రీసీతా రామ.

కందార్థములు.

ధారుణిఁ గొంతచరించివి,చారించితిగాని యీవిచారము నేనా
వ్వారలు జెప్పఁగవినలే, దారయ మీచేతవింటి * నయ్యా గురుమూర్తీ
తరమానుతిఁజేయ మీకీర్తీ, సారసనేత్రపురారి నీరజ బృందారక ముఖులైన
నేరరు మిముఁదెలియ, నయ్యా గురుమూర్తీ తరమానుతిఁ జేయ మీకీర్తీ.

వ. అని యాచార్యునిం గొనియాడి తానుపదేశంబుఁజెందిన రామ
మంత్రంబును యిట్లని కొనియాడుచున్నారు.

శ్లో. దశరథసుతమన్త్రం దైత్యసంహారమన్త్రం
విబుధవినుతమన్త్రం విశ్వవిఖ్యాతమన్త్రం,

మునిగణనుతమన్త్రం ముక్తిమార్గైకమన్త్రం
రఘుపతినిజమన్త్రం రామరామేతిమన్త్రమ్.

శంకరాభరణరాగము - అటతాళము.

మంత్రములకుమూల మంత్రమైనది శ్రీరామమంత్రము యీ
తంత్రములనియేటి దైత్యసంహారము రామమంత్రము మంత్ర.
రాణించుసిరులిచ్చు రఘుకులతిలకము రామమంత్రము
మంచి నాణెమైనదివ్యనవరత్నఖచితమే రామమంత్రము మంత్ర.
గ్రహభూతములకు నిగ్రహభూతమైయుండు రామమంత్రము
దురితగ్రహములనన్నిటిని దహనముఁజేయించు రామమంత్రము మంత్ర.
ఏణీలోచనశంభురాణిపఠించిన రామమంత్రము నా
ప్రాణపదంబైనభవ్యనిధానము రామమంత్రము మంత్ర.
వాసిగభద్రాచలేశుఁడైన శ్రీరామమంత్రము రామ
దాసునిరక్షించె తారకనామము రామమంత్రము మంత్ర.

వ. ఇవ్విధంబున రామమంత్రముప్రభావంబుఁ గొనియాడి తనమనంబున నిట్లని వితర్కించుచున్నారు.

ధన్యాసిరాగము - ఆదితాళము.

తారకమంత్రము కోరినదొరికెను ధన్యుఁడనైతినివోరన్న
మీరినకాలుని దూతలపాలిటి మృత్యువయని నమ్మకయున్న తా.
మచ్చికతో యితరాంతరంబుల మాయలఁబోఁ బడఁబోకన్న
హెచ్చుగ నూటయెనిమిదితిరుపతు లెలమి తిరుగఁబనిలేదన్న
ముచ్చటగా నాపుణ్యనదులలో మునుఁగుట పనియేమిటికన్న
వచ్చెడి పర్వపుదినములలో సుడివడిబడుటయు మానకయున్న తా.
ఎన్నిజన్మముల నెంచిచూచినను యేకోనారాయణుఁడన్న
అన్నిరూపులై యున్న పరాత్మునం డా మహాత్మునికథవిన్న
యెన్నిజన్మములఁ జేసినపాపము లీజన్మముతో విడునన్న
అన్నిటి కిది కడసారిజన్మమిది సత్యము యిఁక పుట్టుటసున్న తా.
నిర్మలా అంతర్లక్ష్యభావము నిత్యానందముతోనున్నఁ
గర్మంబులువిడి మోక్షసద్గతిని కన్నులనే జూచుచునున్న
ధర్మముతప్పక భద్రాద్రీశుని తలపులలో మిత్రతనున్న
మర్మముఁ దెలిసినరామదాసు నిజమందిరమున కేఁగుచునున్న తా.

శ్లో. ఇక్ష్వాకువంశార్ణవజాతరత్నం సీతాంగనాయావనభాగ్యరత్నమ్,
వైకుంఠరత్నం మమ భాగ్యరత్నం శ్రీరామరత్నం శిరసా నమామి.

నవరోజురాగము - ఆదితాళము.

భజరే శ్రీరామం హే మానస భజరే రఘురామం భ.
భజ రఘురామం ఖండనభీమం రజనిచరౌఘవిరామం రామం భ.
వనరుహనయనం కనదహిశయనం మనసిజకోటిసమానం మానం భ.
తారకనామం దశరథరామం చారుభద్రాద్రిసంచారం ధీరం భ.
సీతారామం చిన్మయధామం శ్రీతులసీదళ శ్రీకరధామం భ.
శ్యామలగాత్రం సత్యచరిత్రం రామదాసహృద్రాజీవమిత్రం భ.

శ్లో. సకలసుకృతరత్నం సత్యవాక్యార్థరత్నం
శమదమగుణరత్నం శాశ్వతానందరత్నమ్,
ప్రణవనిలయరత్నం ప్రస్ఫుటజ్యోతిరత్నం
పరమపదవిరత్నం పాతు మాం రామరత్నమ్.

కాంభోజిరాగము - ఆదితాళము.

దొరికెఁగా భద్రాచలనిలయుఁడు దొరికెఁగా
దొరికెఁగా నరగరుడోరగులకుఁ బరమతారకమైన భక్తచింతామణి దొరి.
కోరినదాసులఁగూరిమిచేత నవారిగఁ బ్రోఁచుచుమీరినపరమణి దొరి.
వ్యక్తముసెఱిఁగిన భక్తజనులనాసక్తిని బ్రోఁచే భక్తచింతామణి దొరి.
ఇందునియందము మందముసేసెడి యందముగలమాయింద్రనీలమణి దొరి.
చేరువయౌభద్రాచలమందున మీఱటి సీతతోడ మెరయుచున్నమణి దొరి.
ఆసనుపరరామదాసుకేలి కృపభాసురముగ పరపద మొసఁగినమణి దొరి.

వ. ఇవ్విధంబున నానందంబుననుండు సమయంబునఁ గబీరుదాసుగారు.
* ఆతఁడుచేసిన నిశ్చల భక్తికి నానందంబును జెందెన్
ఈతఁడె రాముని నిజభక్తుం డని యింపుఁగ సంతస మందెన్.
గృహమునకేఁగఁగ నెలవొసంగె నిటు కృతకృత్యునిఁగాఁజేసి
విహాయసోపమం బగు పదమందున విహరింపుచు లేచి.
రామరామ శ్రీరామరామ యని రంజిలి పాడుచుఁదాను

యమునారాగము - ఆదితాళము.

నారాయణ నారాయణ నారాయణ భగవన్నారాయణ నారాయణ.

సజ్జన్ కేసజ్జన్మిలేతో చందన్మేకర్పూర్
దుర్జన్ కేదుర్జన్మిలేతో భంగ్ మేదుత్తూర్ శ్రీమన్నా.
ఖుద్దేసోగద్దా మిల్యాతో హుడహుడమార్యాలాత్
సాధూసే సాధూమిల్యాతో కరలేదోదోభాత్ శ్రీమన్నా.
అజగరనకరేచాకరీ పంఛీనకరేకాం ఫత్తరమ్యానే
మేండుకబైఠే హుసాకు దాతారం శ్రీమన్నా.
బమ్మన్ హువాతో క్యా హునా బేగలె మేడాలేసూత్
రామనామకేమర్మ నజానే కలీకాలకాభూత్ శ్రీమన్నా.
సాహేబుకాంగర దూరహైబేజై సేలంబికజూర్
చడాసోసాఖే ప్రేమరేసకుగిర్యానోచికనాచూర్
రామనామకహాతోపహైబె కృష్ణనామకాబోలె
సాధుసంతకీ సబాబైఠెమూరఖ ఖాలే శోలే శ్రీమన్నా.
కబీరకబీర క్యాకహూరేశోధో ఆపశరీర్
పంచమయింద్రియబస్కరేతో ఆపే ఆపరిబీర్ శ్రీమన్నా.

* సామగానలోలా యని సొక్కుచు సరఁగ కబీరుఁడు సనెను.
కబీరునాజ్ఞను దాఁటక గోపన కమలాక్షునిఁ బాడుచును

మోహనరాగము - చాపుతాళము.

వందే రఘురామా శుభనామాశుభనామ తులసీదళదామాభిరామా శ్రీరామా వందే.
కనకమణిమయహారా సుకుమారా సుకుమారపఙ్క్తిరథమహిపకుమారా
సువిహారా అరిశూరా భూధరధీరా కల్మషదూరా పాలితవారణకారణ
రావణమదహరణ రఘువీరా రఘువీర నీరదాభవిమలశరీరా నిర్వికారా వందే.
వందితానిమేషా సత్యభాషా సత్యభాష సీతావదనపంకజపోషా బుధతోషా
దళితదోష సజ్జనపోష మానుషవేష సంగరభీషణ భూషదూషణ శోషణ
నిజతోషా రత్నపోషా రత్నపోషసురాంభోజ పుంజప్రత్యూషసమ్మానాసా
కుంతలజితనీలా భక్తపాలా భక్తపాలసురద్వేష పటలవిఫాలా నరశీలా
కనకచేలా కీలకపాలా మానుషలీలా తానవబాలక రావకసేవక సురపాలా
భూపాలా భూపాలకౌస్తుభ వనమాలవిశాల శుకపాలా వందే.
ధరణిసత్కళత్రా సుచరిత్రా సుచరిత్ర మునిస్తోత్ర హృదయాబ్జమిత్రా
సత్పవిత్రా త్రిశరజైత్రా నీరజనేత్ర వారిజగాత్ర విపులశాత్రవభైరవ
కైరవపదమిత్ర అజపవిత్రా అజపవిత్ర విభీషణవరభృత్యజైత్రా అమరత్రా వందే.
భూసురకల్పవృక్ష సత్కటాక్ష సత్కటాక్షవిరాధ మదేభహర్యక్షా
మృదుపక్ష పంకరుహాక్షా నిజరూపాక్ష శత్రువిపక్షా సువర్ణేక్షణవీక్షణ

శిక్షణదాక్షిణ్యరామదాసా భద్రాద్రీశా అహోరామదాసా భద్రాద్రీశా.

వ. ఇట్లు రామచంద్రునిం గూర్చి పాడుచు.

* సబాంధవుండై యాక్షణమందున సన్నాహముతోను
మన ముప్పొంగఁగ రామునిబింబం బరుదుగాను నిర్మించి
ఘనమతి లక్ష్మణు దక్షిణంబునను కాంచనాంగు వ్రాయించి.
వామభాగమున సీతాదేవిని వైభవముగఁ జిత్రించి
రామానుజులను డాపలిప్రక్కను రంగుమీరఁ జిలికించి.
వాయుజ సుగ్రీవాంగదముఖ్యుల వరుసఁగాను వ్రాయించి
పాయకవిమలగుణాఢ్యు విభీషణు పార్శ్వమందుఁ బొసఁగించి.
సప్తర్షుల కుశపీఠంబుల పై సద్వైఖరి వ్రాయించి
తప్తసువర్ణజలంబులచేతను దనరమెఱుఁగు వేయించి
వేదపాఠకుల విప్రోత్తములను వేదవిదుల రావించి
సాధుఁ డగుచు శ్రీరామచంద్రునకు సంప్రోక్షణఁ గావించి.
గోపన సేసెను బూజ రాములకుఁ గోరిక లూరఁగభక్తిఁ
తాపముదీరఁగ ధ్యానము మొదలుగ నాపదోద్ధరణు రక్తిన్.

ధన్యాసిరాగము - ఆదితాళము.

రామరామశ్రీరామారామా రామాయనరాదా మనసా
కామితఫలదుం డగు శ్రీసీతాకాంతునిఁ గనరాదా మనసా
సలలితముగ రఘువరునకు సింహాసనమీయఁగరాదా మనసా
నలినభవాభవపరివేష్టితు ధ్యానము సేయఁగరాదా మనసా
బలుఁడౌ రాముని రమ్మనియావాహన మొనర్పరాదా మనసా
వెలయఁగఁబాద్యము శ్రీభద్రాచల విభునకీయరాదా మనసా రామ.
ఆదిత్యార్చితుఁడగురామునికిని నర్ఘ్యంబీయఁగరాదా మనసా
వేదవేద్యునకు నాచమనంబును వేగనీయగరాదా మనసా
నాదసురూపునకర్థి మెయిని స్నానము సేయఁగరాదా మనసా
పాదార్చనభూవిభునకద్భుత వస్త్రములీయరాదా మనసా రామ.
భూతనయాధిపునకునీ వుపవీతంబీయఁగరాదా మనసా
• ఖ్యాతిఁగదశరథసుతునకు మేల్ శ్రీగంధంబీయఁగరాదా మనసా
కేతకిసుమములుజాజులునర్పణ సేయుదమనరాదా మనసా
శ్రీతులసీదళములుగొని యాశ్రితపోషునకీరాదా మనసా

కపిలఘృతంబున్న ధూపదీపములు గావింపఁగరాదా మనసా
నృపసత్తమునకు దీపారాధన లిపుడేయియ్యఁగరాదా మనసా
తపసులపాలిటివానికి నైవేద్యము సేయఁగరాదా మనసా
కృపణవిరోధికిఁ దాంబూలంబుల నిపుడేయీరాదా మనసా రామ॥
నృత్తగీతవాద్యమ్ములచే సంతృప్తిచేయరాదా మనసా
చిత్తజజనకుని మత్తతలేకను హత్తియుండరాదా మనసా
మొత్తనిశయ్యాయం మేలుదిండ్లును మెప్పఁగనీరాదా మనసా
ఎత్తరినైనను మరువక శ్రీహరి భక్తి సలుపరాదా మనసా
రాముఁడు కొలువైయుండెడివేళఁ బరాకుచెప్పరాదా మనసా
రాముని నామము నేమరకెప్పుడు వేమరుదలఁచఁగరాదా మనసా
రాము రఘుగ్రామణి నాశ్రితహృత్కాముఁదలఁచరాదా మనసా
శ్రీమద్భద్రాచలధామా శ్రీ రామాయనరాదా మనసా

* షోడశోపచారంబులు దశరథసూనున కలవడఁ జేసెఁ
బీడని భక్తిని విప్రవర్యులకు విస్తళ్లమరఁగ వేసెన్.
చిత్రాన్నంబులు శాకసూపములు చెలువొప్పఁగ వడ్డించెఁ
చిత్రవిచిత్రం బగుభక్ష్యంబుల శేషవిధుల నమరించెన్.
ఆపోశనమిడె నార్యులకెల్లను నంచితమతి నతిభక్తిఁ
కోపింపక భుజియింపుఁడు మీరని కూర్చెను చేతుల రక్తిన్.
గంధపుష్పతాంబూలంబులఁ గైకొనుఁ డనుచును యిచ్చెఁ
బంధవిముక్తునిఁ జేయుఁడు మ్రొక్కెద బరమమైన మోక్షేచ్ఛన్.
ఇటుల బ్రాహ్మణులఁ దృప్తులఁజేయఁగఁ బటురయంబునను వారు
వటబీజము గతి వర్ధిల నాశీర్వాద మొసఁగినారు.
రామకోటి వ్రాయుటకారంభముఁ బ్రేమతోడఁ జేసెఁ
రామరామ శ్రీరామరామయని రామనామములు వ్రాసెన్

సుగంధివృత్తము.

రామరామరామ రామరామరామ యంచు శ్రీ
రామరామరామ రామరామరామ యంచు శ్రీ
రామరామరామ రామరామరామ యంచు శ్రీ
రామకోటి వ్రాసినంత రాదె మోక్షమెదురుగన్.

వ. ఇట్లు నిశ్చయమనస్కుండయి రామకోటి వ్రాసి[illegible]నను దయజూడుమా యని వేఁడుచున్నారు.

కల్యాణిరాగము - రూపకతాళము.

రామాదయఁజూడవే భద్రాచల ధామ ననుఁబ్రోవవే
రామాదయఁజూచిరక్షించిమము నేలు రామారణరంగభీమజగదభి   రామా.
రాజీవదళలోచనా భక్తపరాధీన భవమోచనా
రాజరాజకులరాజరాజార్చిత రాజితవైభవరాజలలామా   రామా.
తాటకసంహరణా మేటి కోటి రాక్షసభయహరణా
నీటుతో శ్రీరామ కోటి వ్రాసితినీకు సాటిలేరనిసారెసారెకు వేఁడి   రామా.
దిక్కునీవనినమ్మి నీపాదముల మక్కువఁ గొని మ్రొక్కితీ
చిక్కులుపెట్టకు చిన్న భద్రాద్రిలో గ్రక్కునవెలసినచక్కనిసీతా   రామా.

కల్యాణిరాగము - చాపుతాళము.

సఫలమాయెజన్మము యేమందుభవము సఫలమైనమర్మము
సఫలమాయెజన్మశతములకైననీ సుఫలముఁ గందు నేసులభమార్గమున   స.
సుఖదుఃఖములు బాసెను నెమ్మనము సుముఖమైవెలుఁగొందును
అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుం డఖిలాత్ముఁడనితోఁచియహము దూరమగుట   స.
రామకోటివ్రాసితి నేనిప్పుడు కామాదులెడఁబాసితి
స్వామినాపాలికిరాముఁడనుచుదోఁచి యేమార్గమునవృత్తియేకమగుటఁజేసి   స.
కడసారిజన్మమని యిఁకజన్మముల తోసు నేనొల్లననీ
యెడపకరాముల విడువకతలఁచుచుఁ బుడమినిఁగాలముఁబుచ్చఁగనుటచే   సఫల.

గీ. తా దృఢజ్ఞానమున మదిఁ దృప్తిఁ బొంది
పుండరీకాక్షుఁ బావనుఁ బుణ్యచరితుఁ
గామజనకుఁ గృపాలోలుఁ గలుషహరణుఁ
బ్రత్యహంబును దలఁచుచుఁ బ్రజ్ఞ గలిగి.

వ. ఇట్లని సంకీర్తనముఁ జేయుచున్నారు.

హిందుస్తానికాపిరాగము - చాపుతాళము.

హరిహరిరామ నన్నరమరఁజూడకు సరతమునీనామస్మరణయేమరనీకు
దశరథనందన దశముఖమర్దన పశుపతిరంజన పాపవిమోచన   హరి.
మణిమయభూషణ మంజులభాషణ రణజయభీషణ రఘుకులపోషణ   హరి.
పతితపావననామ భద్రశైలధామ సతతముశ్రీరామ దాసుఁడఁనేలుమా   హరి.

* ఇటువలెనుండఁగ షాణ్మాసములకు నీతని కీర్తిని వినుచుఁ
బటుగతి నొకబ్రాహ్మణుఁ డేతెంచెను భాగవతుఁడ ననుచు.
వచ్చిన వారిని మచ్చికచేఁ జనువిచ్చి రమ్మటంచు
హెచ్చినభక్తి నమస్కరించె మనలచ్చిమగం డనుచు.
ఎచ్చటనుండెడివారలు మీదగు ముచ్చటఁ దెల్పుం డనియెన్
సచ్చరితుఁడ విను మచ్చికఁ దెల్పెదనిచ్చగల్గి వినుమనియెన్.

భైరవిరాగము - ఆదితాళము.

వినుమా నాదుసవిస్తారమెల్లను విస్తరింపఁజేతు
ఘనమగు భద్రనగమున నివసింతు ననయము రామభజన సేయుచుందును విను.
దేవరవారి ప్రభావముదశదిశ లావరింపఁగమిమ్మరసెడిభాగ్యము
యేవేళకుఁగల్గఁ బోవుననుచుంటిని నీవేళమిముగంటి నిఁకధన్యుఁడనంటి విను.
ఉత్సవముల నయ నోత్సవకరముచై త్రోత్సవమగుటరా మోత్సవములుమీ
రుత్సుకులై సేయఁ దుత్సహించుభక్త వత్సలుఁడటుగాన వచ్చితెలెఁగింప విను.
కామితార్థఫల ధామునిఁదారక నామునిజానకీరామునిభద్రగిరి
ధామునిజగదభి రామునినిరతము నిజము భజింప గామితార్థములిచ్చు వినుమా.

* అని యిటు దెల్పినభూసురుఁగనుఁగొని యాంక్షణమున గోపన్నా
కనకాంబరునకుఁ గల్యాణోత్సవ కార్యము సేయఁగ నెన్నా.

వ. ఇటులఁ జేయం దలంచి యిట్లని కీర్తనము సేయుచున్నారు.

రేగుప్తిరాగము - రూపకతాళము.

వందే విష్ణుం దేవ మశేషస్థితిహేతుం త్వామధ్యాత్మ జ్ఞానిభి రంతర్హృదిభావ్యమ్
హేయాహేయద్వంద్వవిహీనంపరమేకంసత్తామాత్రంసర్వహృదిస్థందృశిరూపమ్ వందే.
ప్రాణాపానౌనిశ్చయబుద్ధ్వా హృదిరుద్ధ్వాభిత్త్వాసర్వం సంశయబన్ధంవిషయౌఘాన్
పశ్యంతీశంయంగతమోహాయతయస్తం వందేరామం రత్నకిరీటం రవిభాసమ్ వందే
మాయాతీతంమాధవమాద్యంజగదీశం నిత్యానందం మోహవినాశం మునివంద్యం
యోగిధ్యేయంయోగవిధానం పరిపూర్ణంవందేరామం రంజితలోకంరమణీయమ్ వందే.
భావాభావప్రత్యయహీనంభవముఖ్యైర్యోగాసక్తైరర్చితపాదామ్బుజయుగ్మం
నిత్యంశుద్ధం బుద్ధమనన్తం ప్రణవాఖ్యం వందేరామం వీరమశేషాసురదానమ్ వందే.
త్వంమేనాథో నాథితకార్యాఖిలకారీమాన్యాతీతో మాధవరూపోఽఖిలధారీ
భక్త్యాగమ్యోభావితరూపో భవహారీయోగాభ్యాసైర్భావితచేతస్సహభావీ వందే.

త్వామాద్యంతం లోకతతీనాం పరమీశం లోకాతీతం లౌకికమానానధిగమ్యం
భక్తిశ్రద్ధాభావసమేతైర్భజనీయం వందే రామం సున్దరమిందీ వరనీలమ్ వందే.
కోవాజ్ఞాతుంత్వామతిమానం గతమానం మానాసక్తోమాధవశక్తోమునిమాద్యమ్
బృన్దారణ్యేనన్దితబృన్దారకబృన్దం వన్దేరామంభవముఖవన్ద్యంసుఖకన్దమ్ వందే.
నానాశాస్త్రైర్వేదకదమ్బైః ప్రతిపాద్యం నిత్యానన్దం నిర్విష యజ్ఞానమనాదిం
మత్సేవార్థం మానుషభావం ప్రతిపన్నం వన్దేరామం మరకతవర్ణం మధురేశమ్ వందే

వ. ఇవ్విధంబున రామహృదయంబు పారాయణంబు సేయుచు
* చైత్రశుద్ధనవమిని శ్రీరాముల జననదినంబనియెంచి
చిత్రభూషణముల నలంకారము చిత్రమలరఁ జేయించి.
పదియును నెనిమిది పురాణములను పారాయణములు సేసి
సదమలభక్తిని సర్వాత్మకునకు సర్వాలంకృతిఁ జేసి.
తొమ్మిది దినములు నెమ్మదిలో సంతోషంబునఁ దేలుచును
సమ్మతిరాముల ప్రీతిఁగ బ్రాహ్మణసంతర్పణ సేయుచును.

క. ధరణిసురు లెందఱేగిన, పరిపరిభక్ష్యాన్నముల నపారంబుగ వే
సరకను రామార్పణమని, పరమదయాళుండు పెట్టుఁ బరమ ప్రీతిన్.

క. ఒక దినమున సంతర్పణ, సకలాత్ముని ప్రీతిగాఁగ సలుపు నపుడు గో
పకవిసుపుత్త్రుఁడుపడియెను,తుకతుక నుడి కెడుయవాగు తొట్టినునుకు [చున్

వ. ఆసమయంబున.

శా. ఆపుణ్యాత్మునిధర్మపత్ని త్రిజగద్వ్యామోహనాకారరే
ఖాపూర్ణత్వతనొప్పి సద్గుణములన్గామాక్షినింబోలి శ్రీ
ప్రాపైవర్తిలఁ బ్రాణనాథుని రమాభర్తంగ భావించి సం
తాపం బొందఁగనీక నాథుమదికి న్ధన్యాత్మయై వర్తిలున్.

వ. ఆసాధ్వీరత్నంబు.

క. పరమగుణి గానమరణం,బరసిన బ్రాహ్మణులు గుదుపరని యతిధృతిచే
మరణము జెందినపుత్త్రుని, మఱుఁగునఁబడవై చిపిదపమగనికిఁ దెలిపెన్.

వ. ఇవ్విధంబున పుత్త్రుండు మృతినొందెనని తనసతి యెఱింగింప విని పుత్త్రశోకంబున నొడలెఱుంగక మూర్ఛిల్లి మరలం దెప్పిరి యాకళేబరంబుఁ గాంచి యిట్లని విలపించుచున్నారు.

నాదనామక్రియరాగము - ఏకతాళము.

ఎంతపనిఁ జేసితివిరామా ని న్నేమనందును సార్వభౌమా
పంతమా నామీఁదఁ బరమపావననామ సంతోష ముడిపితివి సకలసద్గుణధామా ఎంత.
నిన్నె దైవంబనుచు నమ్మి రామ తిన్నఁగాదుఃఖములఁజిమ్మి
కన్నదినమని నిన్ను నెమ్మి సేవింపఁగా నన్నిట్లునట్టేట ముంచు టెఱుఁగకపోతి ఎంత.
అన్నన్న మాటాడవేరా నీ కన్నులను ననుఁ జూడ వేరా
చిన్నెలన్నిఁ రూఁ దరిగియున్న యీచిన్నన్న గ్రన్ననను జూడుమాయన్న యోరామన్న.
భద్రాద్రివాసుఁడే మనుచు నిరుపద్రవంబుగనుండుననుచు
భద్రనుతకరుణాసముద్ర యో శ్రీరామ భద్ర నిన్నే మదిని భద్రముగనమ్మితి ఎంత.

వ. ఇవ్విధంబునం బొలునింగూర్చి విలపించి భగవద్భక్తుండగుట వివేకదృష్టిచే ధైర్యం బవలంబించి(భగవద్భక్తులకు రామచంద్రభూపాలుండు రాజగుటం జేసి రామ రాజ్యంబున నొక విప్రుని పుత్త్రుండు పంచత్వంబునొందిన బ్రాహ్మణుం డాపుత్త్రశవంబు నెత్తికొని రామ చంద్రప్రభు నాస్థానమంటపంబున కేడురవైచి రామభద్రా పుత్త్రమరణ శోకాతురుని మొర నాలింపుమని మొరలిడిన వాని మొరనాలించి పుత్త్రవంతునిం జేసెనని పురాణంబుల విందు నది నిజంబైన నేను రామ దాసుండ నగుట నాపుత్త్రు నేల బ్రదికింపడని దుఃఖంబుమాని పరమానం దంబున) తనపుత్త్రకళేబరంబు నొకభుజంబుపై వైచికొని తంబురశ్రుతి మేళనంబుఁ గావింప కాళ్లగజ్జెలుకట్టుక తన మందిరంబునఁ బట్టాభిషేకోత్సవపఠంబు ముంగలనిలువంబడి యిట్లని నృత్యంబు సలుపుచుఁ గీర్తనము సేయుచున్నారు.

కల్యాణిరాగము - చాపుతాళము.

కోదండరామ కోదండరామ కోదండరామ కోట్యర్క ధామ. కో.
నీదండనాకు నీవెందుఁబోకు వాదేల నీకు వద్దుపరాకు. కో.
శ్రీరామ మమ్ముఁ జేపట్టుకొమ్ము ఆఁదుకొరమ్ము ఆరోగ్యమిమ్ము. కో.
జయరఘువీర జగదేకశూర భయదనివార భక్తమందార. కో.
రమణీయభూష మంజులభాష రణజయఘోష రమణీయవేష. కో.
ఏలరావయ్య యేమంటినయ్య పాలించవయ్య ప్రార్థిఁగనవయ్య కో.
తల్లివి నీవె తండ్రివి నీవె దాతయు నీవె దైవము నీవె. కో.
అద్భుతకుండ లామలగండ సద్భుజదండ సమరప్రచండ. కో.

సరసిజనేత్ర సౌందర్యగాత్ర పరమపవిత్ర భవ్యచరిత్ర. కో.
ఏబుద్ధివీఁడు యెఱుఁగనివాఁడు పాపఁడువీఁడు బడలియున్నాఁడు.
పాపనులేపి ప్రజలనుగల్పి యాపదఁబాపి యటుప్రీతిఁజూపి.
నమ్మినచిన్న నాఁడెందరున్న మమ్ములఁగన్న మాయన్నవన్న కో.
ఎవరుమీతోటి రారుమీపాటి యొవరుమీసాటి రాజులమేటి.
దశరథబాల దాసానుపాల దశముఖకాల ధరణీశపాలా.
మారుతభీమ మాల్యాభిరామ కల్యాణనామ కారుణ్యధామ.
మంజులభాష మణిమయభూష కుంజరపోష కువలయవేష. కో.
పుట్టించనీవె పోషించనీవె ఫలమియ్యనీవె భాగ్యము నీవె.
శరణన్న చోట క్షమసేయుమాట బిరుదునీదొట యొఱ్ఁగున్నమాట
రావుమువీని లక్షింతుఁగాని సేవఁజేసిన సుతుఁడగును గాని
మురళీవిలోల మునిజనపాల తులసీవనమాల తుంబురులోల. కో.
రావణభంగ రమణీయాపాంగ పావనలింగ పాదాబ్జభృంగ.
మందారహార మన్మథాకార మందరోద్ధార మౌక్తికహార.
దశరథపుత్ర ధన్యచరిత్ర పశుపతిమిత్ర భాసురగాత్ర.
వేదాంతవేద్య విశ్రుతవంద్య భూదేవహృద్య పూజితగద్య. కో.
రాజీవనేత్ర రమణీయగాత్ర సీతాకళత్ర సింధుపవిత్ర.
నీవాఁడనేను నిను నమ్మినాను నేనింతగాను నీకు మ్రొక్కేను.
సీతాసహాయ సురమునిగేయ భూతాగ్నిధేయ పుణ్యావిధేయ.
సత్యస్వరూప సంపూర్ణచాప నిత్యప్రతాప నిర్మలరూప. కో.
ధీరోద్ధార దీనమందార సారవిచార సత్యప్రచార.
ఆపదుద్ధార అగణితశూర పాపవిదూర భక్తమందార.
నీపేరివాఁడు నినునమ్మినాఁడు నీబంటువీఁడు నీదయఁజూడు.
చేపట్టుకొమ్ము సేవకుమమ్ము కాపాడరమ్ము కామితమిమ్ము.
మృత్యుసంహార భృత్యార్తిహార ప్రత్యాధార ప్రణుతార్తిహార.
మందరోద్ధార మణిమయహార సుందరాకార సుజనవిహార.
వీక్షింపవయ్య వేఁడెదనయ్య రక్షింపవయ్య రావేలనయ్య.
వందనమయ్య వాదేలనయ్య దంధనజేయఁ దగదుమీకయ్య. కో.
పుండరీకాక్ష పూతనశిక్ష పాండవపక్ష భువనైకదక్ష. కో.

నిరుపమగాత్ర నీరజనేత్ర పురుహూతమిత్ర పుణ్యచారిత్ర. కో.
ముసు విప్రసుతుని మనిచినగతిని మనునాసుతుని మన్నించిమదిని.
లాలితహాస లక్ష్మీవిలాస పాలితదాస భద్రాద్రివాస.
భద్రాద్రివాస భవ్యవిలాస క్షుద్రవినాశ నుతరామదాస. కోదండ.

వ. ఇవ్విధంబున భద్రాద్రినిలయునిం బేర్కొని స్తుతిసేయుచు నృత్యంబు సలుప రామానుగ్రహంబున భుజంబుపైనున్న బాలకుండు నిద్రించి మేల్కొనినతెఱంగునఁ బునర్జీవితుండైనం జూచి రామదాసుగారు పరమానందంబున మఱల రామునింగూర్చి యిట్లని స్తుతిసేయుచున్నారు.

అఠాణరాగము - రూపకతాళము.

ఎంతో మహానుభావుఁడవు నీవు ఎంతో చక్కని దేవుఁడవు
వింతలుజేసితివీలోకమందు సంతతభద్రాద్రిస్వామి రామచంద్రా ఎం.
తొలివేల్పుజాంబవంతునిఁ జేసినావు మలివేల్పుఁబవనజుఁగాఁజేసినావు
వెలయసూర్యు సుగ్రీవుగఁ జేసినావు అలసర్వసురులఁగోఁతులజేసినావు ఎం.
కారణశ్రీసీతగఁజేసినావు గరిమశేషుని లక్ష్మణుఁజేసినావు
యారెండుభరతశత్రుఘ్నులఁజేసినావు నారాయణనీవునరుఁడైనావు ఎం.
రాతికిబ్రాణమురప్పించినావు నాతియొంగిలికానందించినావు
కోఁతిమూఁకలసెల్లఁగొలిపించినావు నీటిపైకొండలనిలిపించినావు ఎం.
లంకపైదండెత్తిలగ్గెత్తినావు రావణకుంభకర్ణులఁ ద్రుంచినావు
పంకజాక్షిసీతనుబాలించినావు లంకేశుదివ్యపుష్పక మెక్కినావు ఎం.
పరగనయోధ్యకుఁబరతెంచినావు పట్టాభిషిక్తుఁడవై పాలించినావు
వరభద్రగిరియందు వసియించినావు ధరరామదాసునిదయనేలినావు ఎం.

వ అని రామునియందచంచలభక్తి కలిగి.

*ద్రవ్యమంతటికి దానధర్మములఁ దారి జూపె గోపన్నా
అవ్యయాత్ముఁడగు శ్రీరాముల పదమందఁదలఁచి బుధులెన్నా.
పట్టువదలి తన ధనమంతయువ్రయపఱచి నిశ్చలుండై
కట్టువస్త్రములతో నిలఁబడియెను కమలాపతిదాసుండై.
వ. ఇటుల హరికి దాసుండై యేమనుచున్నారు.

నాదనామక్రియరాగము - చాపుతాళము.

శ్రీరామనామాం మరువాం మరువాం సిద్ధముయమునికి వెరువాంవెరువాం శ్రీ.
గోవిందునే వేడుకగొలుతాం గొలుతాం దేవునిగుణములు దలుతాందలుతాం శ్రీ.
విష్ణుకథలుచెవులవిందాంవిందాం వేఱుకథలుచెవులమాన్దాం మాన్దాం శ్రీ.
రామదాసుమాకుసారాం సారాం కామదాసులుమాకుదూరాందూరాం శ్రీ.
నారాయణుని మేమునమ్మేంనమ్మేం నరులనుయిఁక మేమునమ్మాంనమ్మాం శ్రీ.
మాధవనామముమరువాంమరువాం మఱి యమబాధకు వెరువాంవెరువాం శ్రీ.
అవనిజపతి సేవమానాంమానాం మఱియొకజోలంటెమానాంమానాం శ్రీ.
భద్రగిరీశునికందాంకందాం భద్రముతో మనముందాంముందాం శ్రీ.

* జీవనమునకిఁక నేవిధి యని తనుఁజేరి పత్ని వేఁడ
కావలసిన యది రాముఁడొసంగును కలఁగనేల నేగోల.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

తక్కువేమిమనకు రాముండొక్కఁడుండువఱకు.
పక్కతోడుగా భగవంతుఁడుమను చక్రధారియై చెంతనుండఁగ త.
ముచ్చుసోమకునిమును ద్రుంచినయా మత్స్యమూర్తిమనకక్షమునుండఁగ త.
సురులకొఱకుమందరగిరి మోసిన కూర్మవతారునికృపగలిగుండఁగ త.
దురాత్మహిరణ్యాక్షుఁద్రుంచినయట్టివరాహమూర్తిమనవాఁడైయుండఁగ త.
హిరణ్యకశిపునినిరుచెక్కలుగాఁ బరచినసరహరిపక్కనుండఁగ త.
భూమిస్వర్గమును పొందుగగొలిచిన వామనుఁడును మనవాఁడై యుండఁగ త.
ధరలోక్షత్రియులనుదండించిన పరశురాముఁడుమనపాలిటుండఁగ త.
దశగ్రీవునిమునుదండించినయా దశరథరామునిదయగలిగుండఁగ త.
ఇలలోయదుకులమందుదయించిన బలరాముఁడు మనబలిమైయుండఁగ త.
దుష్టకంసునిఁ ద్రుంచినట్టి శ్రీకృష్ణుఁడు మనపైకృపగలిగుండఁగ త.
కలియుగాంత్యమునఁగలిగెడుదైవము కలికిమూర్తిమముఁగాచియుండఁగా త.
నారాయణదాసులఁగాచెడిశ్రీమన్నారాయణుకెరనమ్మియుండఁగాఁదక్కువేమి.

గీ. ఏలయిూలాగు వెతగుందెదేలతాంగి, గోలపలుకులుపలుకుటలేలవినవె
చాలమనపాలగరుణింపఁజాలువాఁడు, పాలకుండగురామభూపాలకుండు

అఠాణారాగము - చాపుతాళము.

శ్రీరాములమది సేవించికొలిచిన చెడుగులుగలదఁటవే
పారమార్థికులఁబరమదయాళుఁడు పరిపరివిధములఁబాలించు తెలుఁగవె శ్రీ.

అలకుచేలుఁడు ధ్రువుఁ డంబరీషుఁడు మొదలైనవారివిన వే
జలజాక్షుపదసేవ సలిపిసద్గతిగాంచి విలలో వారియాపదలలోమున మే పాటి శ్రీ.
మించిదాయలచేఁ బంచపాండవులు పడినపాటులువిన మే
సంచుఁ దెలిసికృష్ణునంచితమతిఁగొల్చి త్రుంచిశత్రులజయించిమించలేదే
స్థిరముగ మనము శ్రీహరికిసమర్పించి పరలుచున్నవినవే
తిరమతులనిభద్రగిరి రామభద్రుఁడు పరములుదయ చేసిచిరకృపఁజూడఁడే శ్రీ

* అనియిటుబల్కెడుజీవితేశ్వరుని యతి నియతికిమెచ్చి
అనయంబీతని నమ్మిసేవఁ జేసినఁబొందదె లచ్చి.
అనునిశ్చయమునఁ దనపురుషున కా యమ్మనేసె నాసక్తి
బెనఁగొన నీప్సితమెఱిఁగి సేవలు మనమలరఁగ సద్భక్తి.
దారిద్ర్యంబున ధవునిందింపక దగఁగొలిచిన దీయింతి
మారుమాటఁ దనమగనికిఁ బలుకదు మగువల మేల్బంతి.
పెనిమిటివచ్చిన పేరాసనునా పెన్నిధానమని చెలఁగుచు
మును చేసిన నాపుణ్యఫలంబని మగని మదిని మెలఁగున్.

సీ. ప్రాణేశుఁ డారగింపక భుజియింపదు భర్త నిద్రింపక బండుకోదు
నాథుండు మేలుకొనకముష్ను మేల్కొను కైసేయ కెన్నఁడుఁ గవయదధిపు
ధవుఁడు ప్రోషితుఁడైన తరివాడియుండదు పలికి నెప్పుడుమాఱుబలుక వెరచుఁ
బురుషునీగికినల్పమునకు సంతోషించు మొగమెత్తనేరదు మగనియెదురఁ
జెరగుమాసినమూనాన్నల్లిసిగ్గుతోడ, పతివిహీనకనమార్గంబుఁ బరిహరించి
సవిత్రుఁడుదయింపనాల్నుఁటజలకమాడి, చూడదెవ్వారిపురుషునిఁజూచికాని.

*మనమున పతియేరాముల నెడిభావన లేమిని లేమి
ధనధాన్యంబులు సకలభోగములు దండిగఁ గలిగిననేమి.
అనిపురజను లాయమ్మగుణంబుల కాత్మలోన మెచ్చఁగను
వినయంబునఁ దనపురుషునిఁ గూడుక విభవంబులఁ గోరకను.
తనభార్యామణిగుణముల కలరెను తత్త్వనిష్ఠుఁడగుచుఁ
బింఛమాడునకుఁ గృతులొసంగెదను ప్రీతిపూర్వముగను.

యమునారాగము - చాపుతాళము.

దీనదయాళో దీనదయాళో దీనదయాపరదేవదయాళో దీ
కనకాంబరఘనశ్యామదయాళో సనకాదిమునియోగివినుతదయాళో దీ

శరధిబంధనరామచంద్రదయాళో పరదామరబృందానందదయాళో
నారదమునిదేవనాథదయాళో సారసాక్షరఘునాథదయాళో దీ.
దశరథసుతలోకాధారదయాళో పశుపతిచాపత్రుటితదయాళో
ఆగమకల్పిత అమితదయాళో భోగిశయనపరమపురుషదయాళో దీ.
వరదభద్రాద్రినివాసదయాళో పాలితశ్రీరామదాసదయాళో దీనదయాళో.

†ఉ. ఖండనభీముఁ డార్త జనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణకో
దండకళాప్రచండ భుజతాండవమూర్తికి రామమూర్తికిన్
రెండవసాటిదేవుఁ డిఁక లేఁ డనుచు న్గడకట్టి భేరికా
డాండడడాండడాండనినదంబు లజాండము నిండమత్తవే
దండము నెక్కి చాటెదను దాశరథీ కరుణాపయోనిధీ.

వ. ఇట్లత్యంత దరిద్రస్థితినుండియు హరిభక్తి సలుపుచుండ.
*కన్నవార లాఘనుని లేమిఁ గని కన్నుల నీరిడుచుండఁగన్
వన్నెఁదరిగియును మన్ననతో రామన్నను గొలుచుచునుండెన్.

సేనిరాగము - ఏకతాళము.

దీనులవేడజాలని ఓరామయ్యానే దీనుల వేడజాలనీ
మానమువిడిచికసుమాలపుపొట్టకొఱకు దీనులవేడజాలనీ. దీ.
దీనవృత్తినియాసఁ దీరకదినదినము మానవులవెంబడించితీ
ఓరామయ్యానే మానవులవెంబడించితీ. దీ.
ఏనుఁగునెక్కిదిడ్డి లోనదూరినట్లులవమాన మునకోర్వఁజాలితీ
ఓరామయ్యయవ మానము లకోర్వఁజాలితీ. దీ.
సతతముభద్రాచల స్వామినీపదము లేనమ్మియితరులజోలిపిడితీ
ఓరామయ్యానే నితరులజోలిపిడితీ. దీ.

వ. ఇవ్విధంబున నాభాగవత కులాలంకారుం డత్యంత దరిద్రస్థితి నుండియును రామా యీ యుదరపూరణనిమిత్తముగా దీనులం జేరి దోసిలియొగ్గి యాచించి జీవింపఁజాల నీమాయ నెఱుంగ నెవ్వరు సమర్థు లని యాభద్రగిరినిలయునిఁ గూర్చి కృపఁజేయుమని వేఁడుచున్నారు.

కల్యాణిరాగము - చాపుతాళము.

ఇన్ని గల్గిమీరూరకున్ననే నెవరివాఁడనౌదు.
అక్షయమియ్యఁగఁదలఁచితే శ్రీమహాలక్ష్మి దేవిలేదా

† ఈమొదలగుపద్యముల యర్థాదులు మాచే ముద్రితమైన దాశరథిశతకములోఁ జూచికొనునది.

రక్షించఁగదయగలిగితె భూమియు రత్నగర్భగాదా. ఇన్ని.
పక్షపాతమెడలించితె చేతులోఁబరుసవేదిలేదా
ఈక్షణమునదయగలిగితె సంచిత ధనమున్నదికాదా. ఇన్ని.
కనుగొనినిన్నేతుకకృపఁజూచితె కల్పతరువులేదా
మనవాఁడని నెనరుంచితె చింతామణియున్నదికాదా. ఇన్ని.
వెనఁబడు వెతఁదీర్చనుశరణాగత బిరుదునీదికాదా
వనజభవాండము లేలుదొరలు దేవరవారలెకాదా. ఇన్ని.
కరిప్రహ్లాదవిభీషణాదులను గాచితివనివింటి
హరసురబ్రహ్మాదులకంటెను నిన్నధికుఁడవనియంటి. ఇన్ని.
సిరినాయకనీమఱుఁగుజొచ్చితిని చేపట్టుమటంటి
కరుణతోభద్రాచలరామదాసుని కావుమయనియంటి. ఇన్ని.

వ. ఇటుల రామునింగూర్చి నుతిసేయుచు.

* ఇటువలె నొకయేఁడిడుములబొందఁగఁదటుకుననొకతలఁపొదవెఁ
ఎటకేనియుఁ జని రామోత్సవమున కేర్చితెత్తుధనమొదవన్.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

ఏతీరునను దయఁజూచెదవో యినవంశోత్తమరామా
నాతరమా భవసాగరమీఁదను నళినదళేక్షణరామా ఏ.
శ్రీరఘునందనసీతారమణా శ్రితజనపోషకరామా
కారుణ్యాలయ భక్తవరదననుఁ గన్నదికానుపురామా ఏ.
మురిపెముతో నాస్వామివినీవని ముందుగఁ దెల్పితిరామా
మరువకయిఁక నభిమానముంచునీ మరుఁగుఁజొచ్చితినిరామా ఏ.
క్రూరకర్మములు నేరకచేసితి నేరములెంచకురామా
దారిద్ర్యముపరిహారముసేయవె దైవశిఖామణిరామా ఏ.
గురుఁడవునామదిదైవమునీవని యురుశాస్త్రంబులురామా
మొరలిడిఁదెల్పగ తెలియఁగక తిరిగే మూఢుఁడనైతినిరామా ఏ.
తాండవమున నఖిలాండకోటి బ్రహ్మాండనాయకారామా
బంధనముననీ నామముఁదలఁచితె బ్రహ్మానందమురామా ఏ.
వాసవకమలభవామరవందిత వారధిబంధనరామా
భాసురవరసద్గుణములవెలసిన భద్రాద్రీశ్వరరామా ఏ.
వాసవనుతరామదాసపోషకవందనమయోధ్యరామా
దాసార్చితమాకభయ మొసంగవె దైవశిఖామణిరామా ఏ.

*అనుతలఁపున గోల్కొండకు నరిగెను వనజాక్షునిఁ బాడుచును

వ. ఇటుల గోల్కొండకుఁ బోవునపుడు మనంబు చింతంగూరినరామదాసుగారు జ్ఞానసబోధఁ జేయుచున్నారు.

†ఉ. ఎక్కడియర్థచింతనము లెక్కడి సంగ్రహణైకసాధనం
బెక్కడిరక్షణక్షమత లెక్కడ హమ్ము మతాభిమానముల్
కక్కసు మింతయేల నొకకార్యముఁ దెల్పెద నిత్యసౌఖ్యముం
జక్కగణించెదేని మనసా హరిపాదము లాశ్రయింపుమా.

ధన్యాసిరాగము - చాపుతాళము.

శ్రీరాములనమ్మి సేవించువారికి-జింతలు పనియేటికేముమ్మాటికి చిం.
తారకనామకీర్తనఁజేయువారికి-వేలుమంత్రము లేటికే ఓమనస వే.
మత్తవృత్తినిరసించినవారికి-మరునిబాధ లేటికే ఓమనసా మ.
తత్త్వస్వరూపముఁదెలిసినవారికిఁ-దాపత్రయము లేటికేఓమనసాతా.
పన్నగశయనునికృపగల్గువారికి-పాపసంఘము లేటికే ఓమనసా పాప.
మన్నించుభద్రాద్రిరామదాసుఁడనైతి-మర్మ మెఱుఁగ లేవటె ఓమన.

వ. ఈప్రకారంబున ఓమనసా రాములనమ్మి సేవించిన తరువాత చింతాసాగరంబున మునుఁగ నేలయని మనమున విచారంబు దోఁచినపుడెల్ల రామరామ యని రామునిఁ దలంచుచు దుఃఖంబులంబడక.

*చనిచూచిరిగోల్కొండలష్కరున చయ్యనమంత్రులగృహము.
కనుఁగొనియిట్లనిపల్కెనుగోపన కావలివారలతోను
చనివేగ మెగోపన్న వచ్చెననుజాడఁదెల్పుఁడ నెను.
అనినలోపలికి జవానేఁగి కనుగొనియెను మంత్రులను
మనమలరఁగ రాజాంగవిషయముల మంతనముల నుండఁగను.
మచ్చికతోడను దౌవారికుఁగని మంత్రు లిట్టులనిరి
వచ్చిన కార్యంబచ్చుగఁదెల్పటఁ జెచ్చెరఁజనుమనిరి.

వ. అనిన దౌవారికులు గోపన్న యను నొకవిప్రుండు మనవాకిట నిలిచి మీతోఁ జెప్పుచున్న వాక్యంబులు వినుమని యిట్లనుచున్నారు.

గీ. నేలకొండపల్లె నివసించియుండుట, కరుణగలుగుతల్లి కామమయగు
నమరఁదండ్రి లింగనార్యుఁడటందురు, నాదు పేరు గోపనయనియండ్రు.

† దీని తాత్పర్యము మాఘానసబోధయందుఁ గనఁదగు.

క. మామలు మంత్రులునాకు, న్నే మచ్చికఁ జూడఁగోరియిటవచ్చితిమా
మామల కెఱిఁగింపుండని, వేమరు మము వేడనిటకు వెసవచ్చితనన్.

* తెప్పున లేచియు నెదురుగవచ్చిరి యప్పుసుతునిఁజూడ
అప్పుడపరిమిత సంతోషంబునఁ గప్పినమోహముతోడ.
వందనములుఁజేసిన తమయిల్లు నవార్యమైన కృపతోడఁ
సుందరాంగరమ్మనియక్కున నరుదందఁ జేర్చి వగతోడఁ
అప్పునుదలఁచుకకొంత చింతిలిచు నక్కనమాదనగారు
కప్పురగంధీ కామాంబాయని కన్నులనీరిడినారు.

మ. ధనధాన్యంబులు సర్వసంపదలు నిత్యంబై రమాలోలుఁ డి
చ్చినభోగింపక సర్వము న్విడిచి సంశీలాత్మవయ్యు న్మముఁ
న్ఘనదుఃఖంబున నుంచి నీవరిగితే కామమ్మ యేమమ్మ నీ
తనయుం జూడవు మమ్ముఁ బ్రోవ విదియే ధర్మంబుగా నెంచితో
జనయిత్రీసమతోడుబాసితిఁ గదే సంపూర్ణచంద్రాననా.

వ. అని దుఃఖించు సమయంబున.

గీ. జ్ఞానవైరాగ్యవిజ్ఞానమానయుతులు
నైనశాస్త్రజ్ఞులాగమాంతాదిసూక్తి
యుక్తియుక్తానుభవముగ నొప్పునటుల
నిట్లు చింతిల్లుమంత్రుల కిట్టు లనిరి.

ఉ. దేహము వాయుసంచలనదీపిక పుత్రకళత్రమిత్రసం
దోహము స్వప్నకాలమున దోఁచెడి సందడి రాజ్యభోగస
న్నాహము జంత్రపుంబ్రతిమయై తగుసంపద యింద్రజాల మీ
యైహికసౌఖ్యమేమి సుఖమంచుఁ దలంపుదు రయ్య ధీవరుల్.

క. దేహము తాఁ గానని నిజ, మూహింపఁగ నేర్చినట్టియుత్తమునకుఁద
ద్దేహమునకైన బాంధవ, దేహంబులు మిథ్యలనుచుఁ దెలియంబడదే.

వ. కావున.

* గతజలంబులకు సేతువుఁగట్టుటగాదె యిటులచింతిలుట
సతమా భౌతికదేహము లనిశాస్త్రజ్ఞులు దెలుపఁగ నచట.
నిలువక నల్లునితోడుకపోయిరి నిలయము లోనికివేగఁ
చెలు వమరఁగఁ గూర్చుండఁబెట్టి నీస్థితిగతు లేమనఁగన్.

గోపనపల్కెను మామ్మలతో నాగురుఁడుండెడుదనుకన్
రాపు లేక జరిగెను నీకమీఁదను రాములెగతి గనుకన్.

నవరోజురాగము - అటతాళము.

భజరేమానసరామం భజ భజరే జగదభిరామం భజరే.
కరభృతశరకోదండం కరితుండాయతభుజదండం భజరే.
దాశరథేనరసింహం భజ దాశరథేగజసింహం భజరే.
కౌసల్యాబహుభాగ్యం మైథిల్యాలోచనయోగ్యం భజరే.
అవనతజలజభవేంద్రం అగణితగుణగణసాంద్రం భజరే.
మాయామానవదేహం మునిమానసరుచికరగేహం భజరే.
రూపమదనశతకోటిం నతభూపమదనశతకోటిం భజరే.
శ్యామలధరశ్యామం భజ సాంబశివాకృతికామం భజరే.
భద్రాచలాధినివాసం పరిపాలిత శ్రీరామదాసం భజరే.

* నీమాజామార్దెచ్చితోడిగిరి నీరజాక్షుదాసునకు
శ్యామలాంగుగుణగణనసేయుట విశాలబుద్ధి మనకు.

రామనామమేజీవనము అన్యమేమిరామకృపావనమూ
రామనామసుధామధురము మది నేమరకభుజియించుమాకిఁక రామ.
శ్రీలమేలుభయానకమూ రఘువీరులీలలెపానకమూ
పాలుమీఁగడజాఋతేనెయు పాలకన్నాను మేలిమైనది రామ.
ఈరసములెల్లనీరసము రఘువీరుకథలెల్లఁబాయసము
సారెమాకుచేకూడెనాఁకలి దీఱెఁదృష్ణచల్లారెనాభళి రామ.
ఘోరభవసింధుతారకము హృదయారివర్గనివారకమూ
సారమాఘనసారకదళీ ఫలోరుసౌఖ్యమపారసారము రామ.
సుందరశ్రీరాజములు రఘునందనాంఘ్రిసరోజములు
చెంది బ్రహ్మానందభావము నందిము క్తినిఁబొందఁజేసిన రామ.
భాసమానశుభాకరము నిజదాసలోకవశీకరము
భూసుతాహితుఁడై భద్రాచల వాసుఁడైరామదాసునేలిన రామ.

* అని తలపోయుచు నేమి యెఱుఁగకనారదుండె మైమరచి
ఘనబ్బలయుతులాశిబికను మోవగ కడుపడిగానరచి.
కన్నులుమూయుచుఁ దెరుచుచునుండెను కాకుస్థునిమదిఁ జేర్చి
తిన్నగఁగతిపయదినములకరిగి దేవదేవగిరిఁగూర్చి.

గోపనగనుగొనెభద్రశైలమునుగూఢజత్రుసదనమును
పాపముదొలఁగుచు పార్థరక్షకుని పరమభక్తిఁ గనుగొనను.

శహానారాగము - త్రిపుటతాళము.

పార్థసారథినిన్నుఁ బ్రస్తుతించినగాని పలుకవు యిదియేమి
వ్యర్థునిఁజేయసమర్థులుండిరిగాని పృథ్విలోపలనన్నుఁ బ్రోఁచువారెవ్వరు  పార్థ.
చిరకాలమునన్నుఁ జిక్కులుబెట్టక చింతలుయెడఁబాపవే
పరమభక్తులునిన్ను వేఁడితె పాపములవిడనాడివేగమె
కరుణతోడుతఁగాచినావని కాంతచేసెనుగావుమంటిని  పార్థ.
పాండవమధ్యము ప్రాణముగాఁచి యాభండనమొనరింపుచు
దండిగామొనలెల్లఁదునిమి యఖండవిక్రమశాలివయ్యా
దండధరసుతునకునురాజ్యము మెండుగానొసఁగితివియని నే  పార్థ.
శేషశయననన్ను దోషరహితుఁజేసి పాశమువిడనాడవె
ఆశలెల్లను వ్యర్థములు నే జేసి మీపదకంజములకును
దోసిలొగ్గి తివేగనను మీదాసులలోఁబడఁద్రోయుమిఁకశ్రీ  పార్థ.
పామరుఁడనినన్ను బాధపెట్టక ప్రేమతోడుతఁబ్రోవవే
కామితార్థములెల్లనొసఁగియుం నేమరకనుబ్రోవఁదలఁచితే
సామినీపదయుగముమవిడువను కామితార్థఫలప్రదాయక  పార్థ.
వేదశాస్త్రములురాని పేదజనుని నను మోదములోఁగావవే
ఆదరంబునభద్రగిరి శ్రీరామదాసునిఁగావుమనినీ
పాదపద్మములకును మ్రొక్కెతిఁ బలితపావన హేదయానిధే  పార్థ.

వ. అని తనసేవకులం గాంచి యిట్లనియె.

* ఈగౌతమిలో స్నానము సేయుఁడిపుడెతాపములడఁగు
ఆగిరివాసునిసేవింపుఁడుమీదుఃఖము లెల్లనుడుగు.

వరాళిరాగము - ఆదితాళము.

అదిగో భద్రాద్రిగౌతమి యిదిగో చూడండి  అది.
ముదమున సీతాముదితలక్ష్మణులు కదసికొలువఁగారఘుపతియుండెడి  అది.
చారుస్వర్ణప్రాకారగోపుర ద్వారములను సుందరమైయుండెడి  అది.
అనుపమానమై యతిసుందరమై తనరుచక్రమున ధగధగమెరసెడి  అది.
కలియుగమందునఁ గలవైకుంఠము నలరుచున్న యదినయముగమ్రొక్కుఁడి  అది.
పొన్నలపొగడల పూపొదరిండ్లను చెన్నుమీరఁగను శృంగారంబగు  అది.

శ్రీకరముగనిలరామదాసునిఁ బ్రాకటముగఁ బ్రోచెప్రభువునివాఘము. అది.

* అని తనసేవకజనముల నందఱ నాగౌతమిలోముంచి
వనరుహనయనునిఁ జూచు వేడుకను వరపురి కేతెంచి.

కల్యాణిరాగము - ఏకతాళము.

ఎంతోభాగ్యయున్నది భద్రాచల మెంతోభాగ్యయున్నది
ఎంతోభాగ్యయున్న దింతింతయనరాదు వంతు కెక్కినభగవంతునిపురవీథు లెంతో.

సంతోషమునబలవంతులాదేటి వింతలువేయంశామంతులుఁవరబుద్ధి
మంతులుచంగున గంతులువెలలేని దంతులుపురమున
వింతలునరులు శ్రీమంతులు నవరత్నకాంతులమెలఁగఁగ సెంతో.

మేలుచేసిమమ్మేలుజానకిరాములు చేతులుముత్యములుఁ
పోసెడితలంబ్రాలు సేసెడివైష్ణవులు వచ్చెడిపుణ్యస్త్రీలు తెచ్చెడినివ్వాళీలు
యిచ్చేటికానుకలు మచ్చికచకోరాలు మంచివికయ్యారాలుఁ నిత్యముధూపములు
రచ్చలతోవీథులు హెచ్చుగసురటీలువరాలు మోరీలు దోరాలు సరాలతో యెంతో.

లేళ్ళకుందేటివేటకాళ్ళు చేతులజూమదాళ్ళు రానుకోమాళ్ళు
బొందులశిఖముల్లిజిలుఁగురుమాళ్ళు యీఁటెలుపదిమూళ్ళు
మాటలుఁముద్దునూళ్ళు గీటిరిగొనగోళ్ళు చెవులకుముత్యపుజోళ్లు
నేరేళ్ళు మారేళ్ళు పనసలు నారికేళ్ళతో యెంతో.

స్థిరమా శ్రీహరియిచ్చు పరమా పమ్మినశేఖరమా యీవైకుంఠపురమా
అన్నులసుందరమా యజ్ఞాలమందిరమా మార్గంబులనాగరికమా
జనులసుందరమా తీరులుయింద్రపురమా అశ్వాలసంగరమా ఆడిగేది దుస్తరమా
గాలిగోపురమామాడఁగఁజోద్యకరమా ముత్యాలతోరణమా యిండ్లిండ్లసంబరమా
రామునిమనోహరమా అందమా సుందరమా మందరమా భద్రాచల మెంతో.

పంతువరాళిరాగము - చాపుతాళము.

పతిరేవ గతిరధునా శ్రీసీతాపతిరేవ గతిరధునా
అతులితరతియుత మతిశతధృతనుత శతతారకీర్తిలాలితహారసీతా పతి.
సుమహితమణిమకుటో నిటలతట కమనీయనీలాలకో
స్మోహనచారు కమలదళలోచనో మార్తికోత్తిమభూషణకర్ణో
ఘుమఘుమ ఘుమఘుమఘుమఘుమఘుమితశ్రీయామోద
స్వామగానజనితోత్సవసహితశ్రీరఘు పతి.

ప్రణతాదరణశీలో స్నుహాసో క్షణసుందరో నమో
కంకణకణ కణకణఝణనినదో కింకిణికిణ కిణకిణరవచాపోజయాం భేరి
ధణధణధాణాం ధణధణఘనతరగుణం కారవిఘోషో అయోధ్యా పతి.
సకలాగమవిహారో రుచిరభద్ర నగనిలయో రాఘవో
హారరుచి విగళితదీప్తిమిహిరో రామదాస దృగమితశుభాకారః పీతాంబర
ధగధగధగధగధగితప్రకాశో జగదానందశ్శరణం భజేరఘుపతి రేవ గతి రఘునా.
* దైవము మానుషరూపమటంచని దగ శ్రుతి బలుకుచునుండఁగ.
ధీవరులగు మిముఁగనవచ్చితి సీతేశునాజ్ఞ మీాదండఁగ.
ఆపై కాఁగలదదియేమో నరహరిచిత్తమదేమో
నాపై ప్రీతిని చేరఁదీతుఁను నాకల ఫలమేమో.
అని యిటుపల్కిన గోపన వచనము లాలకించినవినుము
తనయా మేమొకకలఁగంటి మదేమనినను దెల్పెదము.

పంతువరాళిరాగము - చాపుతాళము.

కలఁగంటి వినుమన్నా నేనొక్క కలఁగంటివినుమన్నా
కలఁగంటి నేనిన్నఁ గలస్థితులేమన్నఁ జెలువుగవినుమన్న చెప్పెదగోపన్న కల.
ఇద్దరువిప్రులుముద్దుగురియుచు నెదురుగనిలుచున్నా
ఒద్దికతో నాపెద్దలఁగని మేమిద్దరునిలుచున్నా గోపన్నా కల.
వినుమనిచెప్పిరి వేవిధముల నావిధమంతవినుమన్నా
వినయంబున మీామేనయల్లుఁడీవేళ వచ్చునన్నారోయన్నా కల.
మచ్చికతోడుతవచ్చిన యాతని మెచ్చిబ్రోవుఁడన్నా
ముచ్చటపడియిటువచ్చినయాతని ముదమందఁజేయుఁడన్నారోయన్నా కల.
తనరఁగాను భద్రాద్రితాలూకా తహసీలొసఁగుచున్నా
వినయంబున శ్రీవరునిఁదలంపుఁడు వీడుబంధమనిరన్నా గోపన్నా కల.

గీ. నిన్న నీగతి కలగని నేఁడుదయము, నందుచారులఁబిలిచి నిన్నరసివేగ
వచ్చినప్పుడెలోనికిఁబంపుఁడనుచుఁ, జెప్పిపంపఁగనింతలోఁ జేరుటరుదు
*మంచిది యావల నన్ని సంగతులు మాటాడుదమనిరి
మించినదేమియు లేదీవు భుజించను లెమ్మనిరి.
విజయుఁడు సదివిన గీతాశాస్త్రము విధియుక్తముగాఁ జదివెఁ
భుజియించెను గోవిందనామమును భజియింపుచుబాగన్.

కాపిరాగము - చాపుతాళము.

దశరథరామగోవింద మమ్ము దయజూడు పాహిముకుందా
దశముఖసంహారిధరణిజపతిరామ శశిధరపూజితశంఖచక్రధర దశ.
మీపాదములెగతిమాకు మమ్మేలుకోస్వామిపరాకు
మాపాలఁగలిగిన శ్రీపతియీప్రొద్దు కాపాడిరక్షించుకనకాంబరధర దశ.
నారాయణవాసుదేవ నిన్నే నమ్మితిమహానుభావా
గరుడగమనహరిగజరాజరక్షక పరమపురుషభక్తపాపసంహరణా దశ.
పరమతారక నామమంత్రమూ రామ దాసులకెల్లస్వతంత్రము
ఇరవుగఁగృప నేలుమిపుడుభద్రాద్రిని స్థిరమునవెలకొన్నసీతామనోహర దశ.

వ. ఇవ్విధంబున హరికీర్తనంబు నేయుచు భోజనంబు నేసిన తరువాత.
* సీమాజామాల్ దొడిగిరిమంత్రులు సీటు మీరఁగాను
సోమాననలగుసుదతులు వీడెము సొరిదినివ్వగాను.
వెడలిరిదర్బారుకుఁబోవుటకై విభవోజ్జ్వలులగుచు
వడిగాదంతపు మేనాలెక్కక రాజఠీవిఁగొనుచు.
తానిష కొలువుండెడు కచ్చేరికిఁ ద్వరితముగా విచ్చేసి
వినయముదోపనబాబునుగనుగొని వేగసలాములు చేసి.
దస్త్రముదెమ్మని యర్జీ లెల్లను తానిషచూడఁగఁదీసి
దస్త్రఖానునొక టొకటిగనివ్వఁగ తాముసునామణిఁ జేసి.
రాజకార్యముల నన్నియుఁదగుగతి రయము మీఱముగియించి
రాజేంద్రులవలెఁ బాలీసానుక నారలుండుటను జూచి.
తానిషమంత్రులఁగనుగొనియెను కృపతనమదియుప్పొంగఁగ
పూనికమీరఁదగు యీదినచర్యను పొసఁగఁదెల్పుఁడనఁగన్.

గౌళిపంతురాగము - చాపుతాళము.

దినచర్య సెలిఁగింతును యేలినవారి ఘనసమ్ముఖములోను.
దినచర్య సెలిఁగింతు దేవేంద్రవిభవా యనయముసంతోషమున కేమికొదవా దిన.
నేడుదయంబును అన్నయును నేను వేడుకనుండఁగను
ప్రేమతోడఁ జూడఁదలఁచిమమ్మును సంతోషము తోడగోపనవచ్చెను
వాఁడుమావాడాయెజాడఁదెలియఁగనుతోడఁబుట్టువుగన్న వాడని తెలిసెను దిన.

చింత చేఁగనుగొనుచు మేమాతని సంతోషమునఁ దేలుచు
నేఁడుమా కెంతటిదినమనుచు గోపన్నా వింత లేమననగుచు
వింత లేమినన్ను సంతరించి బ్రోవ వంతు మీకగును నే నెంత చెప్పుదు ననెను దిన.
ఈవార్త లెఱిఁగించి మీముందట బ్రోవఁగ మనసుంచి
యెప్పటికిని జీవనమిప్పించి గోపన్నను మీ సేవకునిఁగ నెంచి
వేవిధముల మీకు వినికిఁ జేయఁదలఁచి వే వచ్చితిమి యెరస్తలుమని మీకు దినచర్య.

* అనవిని తానిష హర్కారులఁ గని యానందముతోడక్
కనుగొనవలె మేమాతని మీరీఘుడియను చెప్పనుఁడుక్
వ. వారు మంత్రుల గృహంబునకుం జని గోపన్నం గాంచి యిట్లనిరి.
* అయ్యా మీకే పిలుచుకరమ్మనె నానందముతో నావుజీ
వెయ్యారులు వస్తవియవితీస్కాని చయ్యనవ్వారికి జావుజీ.
వ. అనిన.

* హర్కారులవెంబడిబడి గోపన హజారమునుఁ జొరరాఁగా
సర్కార్ నడవడులెల్లను దెల్పిరి హర్కారలు బాగా.
ఘారాచౌకీముందరవదలెను పాదరక్షలను వేగా
తారాజునుకనుగొనకటుమున్నే దాఁచెను ఛత్రము బాగా.
చూచెఁ దానిషను సింహాసనమునఁ జూడక్కల కింపాదవక్
దాచెనుచుంగులు చుట్టికక్షమునఁదనవినయము దెలియక్.
చూపురలో మండి వేసుక సుభగ చరితుఁడపుడు
ఏపునడుగుసలాములఁ జేయుచు నీగతిభూసురుఁడు.
భయభక్తులతో రత్నాంచితమగు పాదుషతక్తును జూచి
రయమొప్పతివాసీముద్దిపిరై మతువలెనిలిచి.
యుండఁగఁ జనియామండలేంద్రుఁడో యురగశయనభక్తా
దండియైనజీవనమునిత్తు మాయండనిలువుము వక్తా.
అని తన మంత్రుల నానందముతోఁ గనియిట్లనె గోపనను
మనమలరఁగ తహసీలు చేయుమను మంచినడతతోను.
ముద్రనివాసీలందుకపొమ్మను భద్రాచలమునకు
ఛిద్రముసేయక పైకముంపమను భద్రముగా మనకు.

వ. అని తానీష మంత్రులతోడ.

* అనిన భాగ్యమని యానందంబున హరినారాయణ యనుచు
వినయంబున సెలవంది వెడలె దను మనిచె రాముఁ డనుచు

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

రామ కృష్ణ గోవింద నారాయణ శ్రీరామ కృష్ణ గోవింద నారాయణా.
రామకృష్ణాయని ప్రేమతోఁబిలిచితె మోహమైనఁజూపవేమి నారాయణా రామ.
అండజవాహన పుండరీకాక్షునీ దండఁజేరినానయ్యా నారాయణా రామ.
మాధవవిష్ణు మధుసూదన శ్రీధర శేషశయన శ్రీమన్నారాయణా రామ.
వాసుదేవ ముకుంద వనమాలి చక్రధర నారసింహాచ్యుత నారాయణా రామ.
పతితుఁడననిమిమ్ముఁ బతిమాలుకొన్న సీతాపతినన్నుఁగావవేమినారాయణా రామ.
రామదాసునిఁబ్రోపఁ బ్రేమతోభద్రశైలధాముఁడవై శ్రీమన్నారాయణా రామ.

తోడిరాగము - ఆదితాళము.

నమ్మినాసీతా రమణుని నమ్మవలెనయ్యా నమ్మినాసీతారమణునినమ్మవలె
రావణునితమ్ముఁడైన విభీషణునిధన్యునిఁజేసిన విచక్షణుని నమ్మి.
స్వాములెందరైనఁగలరు రామునికి సరిరారు
పామరులైనవారు ఆమహిమఁదెలియలేరు నమ్మి.
రామనామమె సుధారసము రామచారిత్రమె పాయసము
ప్రేమవలనిదెమానసము రామచంద్రులదె భరవసము నమ్మి.
రామదాసుఁడననుకొందు రమ్యభద్రాద్రీశుఁడందు
ప్రేమవదలకనేయుందు రామనిను నేనమ్మియుందు నమ్మి.

వ. ఇవ్విధంబున రామునికృపాకటాక్షంబు నభివర్ణింపుచు.

* పారాచౌకీదాఁటిరాగనొక బంటుదెచ్చెపాదుకలు
శ్రీరాములకృప నిర్హేతుకమనఁ జేరిరి వేగమె భటులు

పున్నాగవరాళిరాగము - అటతాళము.

రామప్రభో నీదయా నామీఁదనురాదేమదయా శ్రీరామా.
పామరుఁడనుజడుఁడను దామసుటను నేమవర్జితంబగు నరపశువను
నీమహత్త్వమెన్న నెంతవాఁడను రామరామయని దలఁతునిరంజన రామ.

పరుల వేఁడనంటిని నీ పదయుగములె నమ్మి యుంటిని న
న్నరమర సేయవద్దంటిని శ్రీహరిహరియని వేఁడుకొంటిని
మొరలిడినంతనె కరివరు నేలిన దొరవనినమ్మితి నిరసించఁదగదుర
మందరగిరిధర త్రిభువనసుందర యిందిరాసుందరీమనోహర రామ.
ఏల నాపైకోపము మున్నేమి సేసితినో పాపము
నీలవర్ణ నీరూపము నిరతము కన్నులఁ జూపుము
మేలొనరించెడి శ్రీలోలుఁడవని చాలనమ్మియుంటి జాలము సేయక
యేలుకొనుము గానలోలసురరిపు జాలకాల కరుణాలవాలహరి రామ.
ఈసమయమున ననుఁ గావర జగదీశ జనకసుత్రామర
చేసితఘమునను గావర నేను జేసెద ననునీ సేవర
ఆశించిన శ్రీరామదాసు నిటు మోసము సేసినదోసం బెవరిదొ
వాసవార్చితాంఘ్రిజలజయుగ కైలాసవాసభవ్యభద్రగిరిహరి రామప్రభో నీదయా

వ. ఇట్లు రాముని స్తుతియింపుచుండ.

* అందల వెుక్కటిపూజరు చేసిరి హరిదాసున కాక్షణమె
పొందఁ జేసెనా పుణ్యాత్మునిసిరి పురుషోత్తముఁ డీక్షణమె.
పగలు దివిటి రుచులొలయఁగఁ బట్టిరి భక్తవరుని సన్నిధిని
భగవంతుఁడు హరిభక్తుని మనమునఁ బాదుకొనెను నెమ్మదిని.

వ అప్పుడు యిట్లని స్తుతిఁ జేయఁ దొడంగె.

తోడిరాగము - ఆదితాళము.

రామా దైవశిఖామణి సురరాజమహోజ్జ్వలభూమణి
తామరసాక్షసుధీమణి భవ్యతారక భక్తచింతామణి రామ.
నాఁడేమిము వేఁడుకొంటిఁగా శరణాగతబిరుదానివింటిఁగా
వేడుకై మిముఁ బొగడఁగంటిఁగా నన్ను దిగవిడనాడవద్దంటిఁగా రామ.
చింత సేయఁగ నేమి లేదుగా ముందుఁ జేసినగతి దప్పఁబోదుగా
యింతకు మిక్కిలి రాదుగా నేనితరులఁ గొలిచేది లేదుగా రామ.
తమ్ముఁడు నీవాక్కటంటాను రామదాసుని రక్షించుకుంటాను
సమ్మతినుండు మాయింటాను భద్రాచలవాస నీబంటుబంటాను రామ.

* తుడుములు వాచుచుఁ బాకలూఁదిరి తూటుగట్టనాకసము
బడుగులకైనను భాగ్యమిచ్చు హరిసేవయనుదినము.

జంఝూటిరాగము - చాపుతాళము.

నరహరినినమ్మక నరులనునమ్మితే నరజన్మమీడేరునా
చెరుకులుండఁగ వెట్టి చెరుకును నమలితె జిహ్వాపురుచిపుట్టునా మనసా నరహరిని.
కాళులుండఁగ మోకాళ్ళతోనడిచితె కాశికిఁబోవచ్చునా
నీరులుండఁగ నుమినీళ్ళనుమ్రింగితే నింపుదాహముతీరునా మనసా నరహరిని.
కొమ్మయుండఁగ కొయ్యబొమ్మతోఁగలిసితే కోరికకొనసాగునా
అమ్మయుండఁగబెద్దమ్మనుగోరితె యర్థముచేకూడునా మనసా నరహరిని.
అన్నముండఁగ నన్నభిన్నములినినంత నాఁకలివెతతీరునా
కన్నెలుండఁగ చిత్రకన్నెలఁగలసితె కామవేధ తీరునా మనసా నరహరిని.
క్షుద్రబాధలచే నుపద్రవపడువేళ నిద్రకంటికివచ్చునా
భద్రగిరీశుని భక్తిలేనినరుఁడు పరముఁ గనఁగ నేర్చునా మనసా నరహరిని.

* చక్రీ పాగా తెచ్చిరి వేగమె చక్రధరునిభక్తునకు
నక్రగుణము లెడఁబాసి నిలుచునే శక్రపదవి మనకు.
భద్రములొసఁగెడు భద్రాద్రీశుని భక్తితోడ సేవించి
రుద్రవినుతుఁగని యష్టోత్తరముల రూఢిమీర నర్చించి.

వ. ఇవ్విధంబున రామచంద్రునిఁ బూజించి యాభక్తుండు యితఁడే నాభక్తార్తిభంజనుం డని స్తుతిచేయుచున్నాఁడు.

శంకరాభరణరాగము - ఆదితాళము.

ఇతఁడేనాయిహలోకముఁగల పతితుల నెల్లను పాలనసేయువాఁ డితఁడేన.
పరిపూర్ణకరుణచేఁ బ్రహ్లాదుఁగాచిన నరసింహుఁడైనట్టి నళినదళేక్షణుఁ డితఁడేన.
అలవైకుంఠమునందావల్లభినిఁజూచి బలుఁడైనరావణునిఁ బరిమార్చినవాఁ డితఁడేన.
అలనాఁడుద్రౌపది కక్షయవలువలు వలనొప్పనొసఁగిన వైకుంఠవాసుఁ డితఁడేన.
ఏవేళమునివరులితర చింతలుమాని కేవలమతమన పాలనసేయువాఁ డితఁడేన.
పాయనిదయతో నాపన్నులఁబ్రోచినరామదాసునేలు రామచంద్రప్రభుఁ డితఁడేన.

వ. ఇవ్విధంబున స్తుతియించి భద్రాచలంబు డిగ్గి

* తాలూకా కచ్చేరిచావడికిఁ దగువేడుక విచ్చేసెన్
చాల్గా రాజసమొప్పఁగఁ బూర్వ విచారణకర్తను గాంచెన్.
అప్పుడె చార్జిని యప్పగించి యతఁ డానందముతో నరిగెన్
తెప్పున దాసుఁడు కొలువుదీరి తానొప్పఁగఁ గాఁపులకనియెన్.

* సాల్మాఖరులో సర్కార్ పైకము చయ్యనఁదీసుకరండి
హాలాయము శ్రీరాములఁగొలుచుచు వర్తిల్లినమేలండి.

ధన్యాసిరాగము - ఆదితాళము.

పావన రామనామ సుధారసపానముఁ జేసేదెన్నటికో
సేవించియు శ్రీహరిపాదంబులఁ జిత్తమ్మునుంచేదెన్నటికో పా.
దాసులనందఱఁజూచి సంతసించి దాసోఽహమ్మను టెన్నటికో
భూసుతకునుసతి ప్రాణపదంబగు పురుషోత్తముఁ గనుటెన్నటికో పా.
చంచలగుణములు మానియుండి నిశ్చలమతి నుండేదెన్నటికో
పంచతత్త్వములు తారకనామముఁ బఠియించుట మన కెన్నటికో పా
ఇనవంశాంబుధిచంద్రుఁడు కృపనిష్టార్థములొసఁగుట యెన్నటికో
కనకచేలుఁ గరుణాలవాలునిఁ గన్నులఁజూచే దెన్నటికో పా.
వంచనలేకను భద్రాద్రీశుని వర్ణనజేయుట యెన్నటికో
అంచితముగ రామదాసుఁడనుకొని యానందించుటయెన్నటికో
* అనికాఁపులఁ దనపుత్త్రులరీతిని నధికప్రీతిఁ బ్రోఁచుచును
కనకాంబరధరు సేవఁజేయుచును ఘనులెన్నఁగఁ మెలఁగుచును.
చల్లఁదనంబున తహశీల్జేసెను సాధులెల్ల మెచ్చఁగను
ఉల్లముగోపన కాఁపులెల్లతనయాడిగములఁ గోరఁగను.
గోపనప్రతిదిన మాత్మారాముని కుతుకంబునఁ గొలుచుచును

యమునారాగము - ఆదితాళము.

రామ రామ రామ సీతా రామ మాం పాహి.

అనయము నీపదవనజములను మదిఘనముగ నమ్మితిననఘునిఁ జేయవె
ధరగోవర్ధన ధరణీధరమందరధర అరిదర ధర మురహారి శ్రీ.
అనుదినమును నినుమనమునఁగొలిచినకనికరముననను గరుణింపుము
హరిహరియనికరి పరిపరివిధముల మొరలిడఁగాచిన కరుణాసాగర.
రాజరాజకుల రాజరాజనుత రాజరాజ మహారాజ జానకీ
రామభద్రగిరి ధామపాపహర రామదాసుఁడనుప్రేమతోఁ బ్రోవవె.

వ. ఈప్రకారంబున భగవన్నామస్మరణ సేయుచు.

*రాపు జేయకను రైతులచే ధన రాశిఁగొనుచుఁ బ్రీతిగను
సాలాఖరులోఁ బైకమంతయును సార్వభౌమునికిఁ బనుపా.
మేలాగోపన గుణియనితానిషమించి బుద్ధినూహింపా.
ఈగతి బహువాయనములు జరిపెను యోగయుతుం డగుచు
భాగవతుఁడు పూజించె బ్రాహ్మణుల బ్రహ్మనిష్ఠుఁ డగుచు.

క. చలిపందిళ్లను సత్రం,బులు వెట్టించెను దటాకములు దేవగృహం
బులుకల్పించెనుబంధుజ,నులకుసుగతియగుననివినుతినివొందిన్నృపా.

క. లోకమునఁ గలుగుభూసుర, లోకమునకు నెల్లగోవులుబసిండియునా
నాకల్పంబుల బంధుల, కై కోటివిధముల నిచ్చె నతులితభక్తిన్.

వ. ఈరీతిని దానధర్మంబులం జేయుచు.

*పతిత పావనునిఁ బరమదయాళుని భద్రశైలవాసుఁ
గతియని నెమ్మది సతతము నిల్పి యఖండభక్తిఁ జేసెన్.

ముఖారిరాగము - ఏకతాళము.

పాలయ మాం జయరామా జయ పాలితసీతారామా.
కమలావల్లభరామా కబంధసంహారరామా కరుణా సాగరరామా జయ
పాలితసీతారామా కమలావల్లభ కమనీయాననకంబుగ్రీవా కార్ముకపాణీ
కరిరాజప్రియ కౌస్తుభవక్షా కౌస్తుభభూషణకంజాతనేత్ర కాళింగశిక్షా
కంసవినాశన కరుణాంతరంగా కనకాంబరధర కస్తూరితిలకా
కందర్పజనకా కందర్పసుందర రామరామరామచంద్రా జయ పా.
దశరథనందనరామా దైత్యవినాశనరామా శరనిధిబంధనరామా జయ
రాజితసద్గుణధామా అఖండరూపా అమితపరాక్రమ అపరిచ్ఛిన్నా
అంతర్యామి అనాథబంధో ఆశ్రితరక్షకా అంగుళిగిరిధర ఆలోలహారా
అంగదపోషణ అనేకరూపా అరవిందాక్షా అప్రమేయా
అక్రూరవరదా అంబరీషవరదా అయోధ్యావాసా అమితసేవితా
అజ్ఞాననాశన రామరామరామచంద్రా పా.
సీతాహృదయవిహారా కల్పితమానవదూరా పరమానందవిహారా జయ
పాలితభద్రవిహారా సాధుపోషణా సజ్జనసులభా సామగానప్రియ
సహస్రబాహూ సనకసవంద్యా సదానందా సార్వభౌమా
నిత్యానందా నిర్మలచిత్తా నిర్వికారా నిగమగోచరా నీరజనాభా

నిష్ప్రపంచా నిత్యమహోత్సవ నిజదాసప్రియ వీరరామా వితరణగుణ రమ
భద్రాచలపతి పతితపావనా పాండవపక్షవిరామరామరామచంద్రా పా.
*ఉదరపోషణముఁ జేయించఁడె పురుషోత్తముపని యది కాదా
సదమలభక్తిని రాముని్ఁగొల్చుట సారస్యముగాదా.

కల్యాణిరాగము - చాపుతాళము.

రామభజన సేయుండీ ఓజనులార రక్షకుఁడితఁడేసుఁడీ.
రామారామయి చేటిపాపము యేమదృష్టమొ మీరు రామ
నామమనియెడి మధురవాక్యము ప్రేమతోఁగ్రోలకున్నారు రామ.
నీరుబుగ్గలుతనువులు ఈభువిలో నిక్కము లభ్రమలు సారములేని
సంసారములీపదవులేరి నీవారెల్లలేరీ భువిలోనకారుకవిసిన మెరపులీ
సంసారపదవులుమాయజాలపుగారడంబులు యెండమావులగానక నెయున్నారు మీరు.
ఆలుబిడ్డలఁబొందు కూరిమిఁ బెంచ మేలిమిలేదందు గాలాలువేసుకవ్రేలువానిరీతి
వ్రేలాడుచుందురువెఱ్ఱులై భువిలోనకాలకింకరులడఁచిపట్టుక కాలుసన్నిధికేఁగుచుండఁగ
నాలుకప్పుడుభజన సేయఁగఁజాలునో చాలదో మీరు రామ.
కాశికేఁబో నేలా మీరు కావళ్లు దేనేలా మూసినబూరుగ వేసాలువేసుక
నాసకుఁదిరిగిన కాసైనరాదిఁక ఆసలెల్లనిరాసఁజేసి వికాసమందినరామదాసుల
దాసు నేనీసభద్రగిరి ధామేశుఁగొలిచినఁగలదు మోక్షము రామ.

గీ. రాతిలోఁ గప్ప కాహారమాతతముగ, నిడెదుదేవుండు మర్త్యులకేల మాను
బ్రతికినన్నాళ్లునన్నంబుపట్టెడిదక, 'నాయురన్నం ప్రయచ్ఛతి' యనఁగవినరె.

వ. ఓజనులారా భుక్తమునకై విచారింపంబనిలేదుగావున.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

నారాయణయనరాదా మీ నాలుకపై ముల్లునాటియున్నదా నా.
పనిలేనిసుద్దులునూఱు అట్టెపలుమాఱు వాదించి పలుకుచున్నారు
మనమునవెత లెల్లఁదీరు మీ జననములీడేరు జనులార నేడు నా.
ఆలుబిడ్డలపొందుఁ బాసి మీరడవిలోపలఁబండుటాకులుమేసి
జాలిచెందుటపట్టిగాసి మీరు సంసారముననుండి సమబుద్ధిఁజేసి నా.
కలుషవారిధికినినావ హరినిఁ గనుగొని సేవింపఘనమైనత్రోవ
చెలువముగనుహరి సేవ యిచ్చు తలకక నామకీర్తన సేయఁబరువా నా.
కామక్రోధములుచాలించి మీరు కర్మబంధము లెల్లఁగడముట్టఁద్రుంచి
శ్రీమంతులై భక్తిఁ గాంచిమీరు శ్రీభద్రగిరిరామదాసులై మించి నా.

* శాశ్వతపదవినిఁ జెందఁగోరుటకు సన్నాహులు కారాదా.
విశ్వేశ్వరుఁడే విభుఁడనియెంచుచు విహరించుట చేఁదా.

ధన్యాసిరాగము - ఆదితాళము.

శ్రీరామనామమె జిహ్వకుస్థిరమై యున్నది శ్రీరాములకరుణలక్ష్మీకరమైయున్నది
ఘోరమైనపాతకములఁగొట్టెనన్నాది మమ్ముఁజేరకుండ నాపదలనుచెండెనన్నాది శ్రీ
దారితెలియనియమదూతలను తరిమేనన్నాది.

శ్రీమన్నారాయణుని దాసులకునదురై యున్నాది శ్రీ.
మాయావాదులతోఁ బొందుమానుమన్నాది యీకాయమస్థిరమని తలపోయుమన్నాది
పాయకగురురాయనిబోధఁ బాయకన్నాది మేయెడఁజూచినఁ దక్కెడబాయకన్నాది.
మదక్రోధలోభావాంకారములమానుమన్నదిముదముతోఁ బరస్త్రీలబొందు మోసమన్నాది
వదలనిదుర్విషయ వాంఛవిడువుమన్నాది నామదిలోహరిభజనసంపత్కరమైయున్నాది
కోపమనియేటిప్రకృతిని గొట్టుమన్నాది యిపుడుప్రాపునీవేయనినదారిఁజూపేనన్నది.
యేపుమీరనొరులదోస మెన్నకన్నాది యీపాపబంధముల జుట్టుబడవద్దన్నాది శ్రీ.
భక్తిభావనఁ దెలిసిమీరుబ్రతుకుఁడన్నాది పరమ భక్తుల సేవఁజేయుఁడుఁబ్రబలుమన్నాది
ముక్తిమార్గములకిది యీయయన్నాది విరక్తిగ భద్రాచలరాముదాసుఁడన్నాది శ్రీ.
* కావునమీరలు నామాటలువిని కమలాపతిపదసేవా
సావధానమతిఁ జేయుఁడు సద్గతిఁ జనుటకదియె పెనుత్రోవా.

రాగము అఠాణ - ఏకతాళము.

భజనసేయరాదా రామునిమీరు భజనసేయరాదా
భజనసేయరాదా పరమదయాళుని యజభవవినుతుని యఖిలాధారుని భజన.
కాకుత్స్థతిలకునిఁ గామితఫలదుని రాకేందువదనుని రణజయశూరుని
పాకారివినుతునిఁ బాపవిదూరుని శ్రీకౌస్తుభధరుని శ్రీరామచంద్రుని భజన.
సంగీతలోలుని సత్యసంశీలుని శృంగారగాత్రుని సింధుగంభీరుని
అంగజజనకుని నఖిలాంతర్యామిని బంగారుతండ్రిని భక్తవత్సలుని భజన.
సురుచిరగాత్రుని సరసిజనేత్రునిఁ ఖరుహుతమిత్రునిఁ బుణ్యచారిత్రుని
ధరణీకళత్రుని దశరథపుత్రుని పరమపవిత్రుని భద్రాద్రివాసుని భజన.
* అనవిని యుద్యోగస్థులు సేసిరి యామహాత్ముపదములకు
వినయంబున సాష్టాంగనతులు శ్రీవనజాసనభక్తునకు.

వ. ఈప్రకార మారామదాసునకు దండములు సమర్పించి యుద్యోగస్థు లిట్లనిరి.

*ఓమహాత్మ మీయండఁ జేరితిమి మామకదోషము లడఁగెఁ
కామమోహములఁ గట్టువడిన మముఁగావవలయు వేగముగన్.
అనివారలు నదిమొదలుగ నాతని హరిమారుగ నెంచి
ఘనమతులై గురుభావనఁ గొలిచిరి కనవలె మేలని మించి
సర్కారు పనులను సరగునఁజేతురు సాయంకాలమువఱకు
అర్కకులుని పదభజనము సలుపుదురఁట యుదయమువఱకు.

శ్లో. ఇదం శరీరం శతసన్ధిజర్ఝరం, పతత్యవశ్యం పరిణామదుర్లభమ్,
కిమౌషధం పృచ్ఛసి మూఢదుర్మతే,నిరామయం రామకథామృతంపిబ

చ. కడుశతసంధిజర్ఝరితగాత్ర మనిత్యము నాయు వల్ప మె
య్యెడఁజెడిపోవునో తెలియ దందుకు దివ్యమహౌషధంబు నే
ర్పడియె నిరామయంబయిన రామకథామృత మెల్లకాలముఁ
జెడక విమూఢతం బడక శ్రీఘ్రతఁ గ్రోలుచునుండు చిత్తమా.

వ. ఇట్లని మనోనియమంబుఁజేసి సంకీర్తనముఁ జేయుచున్నారు.

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

రామరామరామ శ్రీరఘురామరామ.
నరహరిదేవజనార్దనకేశవ నారాయణకనకాంబరధారి రామ.
రవికులాభరణ రవిసుతసఖ్యారాక్షస సంహార రాజసేవితా రామ.
పన్నగశయనా పతితపావనా కన్నతండ్రియోకరుణాసాగర రామ.
కంతుజనక త్రిపురాంతకనరహరి సీతానాయక శ్రీరఘునాయక రామ.
సుందర శ్రీధరమందరోద్ధరా మకుటభూషణా మృద్భక్షకహరి రామ.
నందనందనానందముకుంద బృందావన గోవిందవిహారీ రామ.
వామనమాధవ వైకుంఠాధిప దేవదేవ దేవారివిదారీ రామ.
పంకజలోచన పరమదయాళూ శంకరనతనుత సర్వేశ్వరహరి రామ.
పుండరీక వరదాండజవాహన చండనిశాచర ఖండనధారీ రామ.
అంబరీషవరదాంబుజలోచన అంబుధిబంధన అమితపరాక్రమ రామ.
భానుకులేశా భయవినాశా భాసురహాసా భద్రగిరీశా రామ.

వ ఇవ్విధంబున

* ఎక్కడఁజూచిన భజనకూటములు నిండి రేశురూపములు
పిక్కటిల్లుచును భగవద్భక్తులు ప్రీతిఁ బాడురావములు.
రామసూత్రములు కరమునఁబూనుక రాజిల్లెదుభూసురులు
ప్రేమమీరశ్రీరామ రామయని ప్రేమఁబలుకుయాచకులు.
ఈరీతినిహరిభజనసలుపుదురు యీయాజాతనిలేక
సారసాక్షియని సంతోషింతురు సంసృతిదారినిఁబోక.
రామదాసు దనకాఁపులఁజూచుచు రంజిల్లుచు మదిఁదలఁచెఁ
ఈమతిమంతులసాహాయ్యంబున రామకార్య మగుననుచున్.
ఒక్కదినంబునఁ దనగృహంబునకు నొనరఁగఁగాఁపులఁ బిలిచి
వెక్కసపడకనువినుఁడు దెల్పెదను వేఱుగఁ దలఁపకవలచి.

శ్లో. హరిర్హరతి పాపాని దుష్టచిత్తైరపి స్మృతః,
అనిచ్ఛయాఽపి సంస్పృష్టో దహత్యేవ హి పావకః.
జీర్ణోద్ధారఫలం విష్ణో రాలయస్య పితామహః,
అశక్తఏవస్యాదన్యే వక్తుం శక్తుస్సురానరాః.
విష్ణోరారాధనాత్పుణ్యం స్మరణా త్పాపనాశనమ్,
భవేజ్జీర్ణాలయోద్ధారాత్కోఽపాఽస్తి ఫలమీరితమ్.

వ. ఈప్రకారము బ్రహ్మాండపురాణములలోఁ జెప్పియున్నది గనుక
* ఎన్ని దినంబులు బ్రతికిన మరణము సున్నయగుటలేదు
పన్నగ శ్రీహరిపదములఁ గొలిచిన గ్రన్నన నటుగాదు.

నాదనామక్రియరాగము - ఏకతాళము.

రాముఁడేగలఁడు మనపాల శ్రీరాముఁడేగలఁడు.
రాముఁడార్తివిరాముఁడాహవభీముఁడానందధాముఁడైన శ్రీ రాముఁ.
నల్లనిరూపు దాసులనేలు చల్లనిచూపు
యుల్లమునరంజిల్లు కృపవెదఁజల్లుచు విలసిల్లుసీతా రాముఁ.
తమ్ముఁడునుదాను విల్లమ్ముఁదాల్చిదయతోను
గ్రమ్మియిరుపార్శ్వమ్ములనుజేరి నెమ్మినీకు భయమ్ములేదు రాముఁ.
మీరుచిఱునవ్వు జిగిమడిపీడి జాఱుసిగపువ్వు
సొరుగులుకుబంగారుతమ్ములఁ గేరుపదముల దారిననుఁజేరు రాముఁ.

కంటు సేయకను రామదాసు జంటఁబాయకను
వెంటనంటియే వేళఁ గృపతోఁగంటిని రెప్పగాచుగతిగఁ బ్రోచు. రాముఁ.

* చేయఁదలఁచితిని రామునికోవెల జీర్ణోద్ధారణమిప్పుడు
బాయకమీరలు ప్రక్కబలముగాఁ బ్రబలుఁడు కార్యముసేయన్.
అన విని కాఁపులు హర్షమునొందుచు హరిభక్తున కిట్లనిరి
మనవివినుఁడు మీమర్జీ చొప్పున మనఁగఁదలఁతు మనిరి.

గీ. మీరె దైవము దాతయై మేలుగలుగ, సర్వసంపదలొసఁగి సంసృతికిఁ బాపి
యవ్యయంబైన పదమునకరుగుమార్గ, మమరఁజూపితిరిఁకబాసె నవఘులెల్ల.

వ. అనిన.

* ఆమాటలువిని యానందంబున నప్పుడె శిల్పులఁ బిలిచెక
కామాటులఁ గొని కడువేగంబునఁ గార్యముఁ బ్రారంభించెన్.
కాఁపులందఱును కష్టముసేసిరి కాసులు కూలికిఁగొనక
నేపునధనములరాశి వోసి మన కేమికొదవలని కడక.

వ. ఈతీరున నాబాలగోపాలముగా భద్రాద్రితాలూకాతోఁ జేరిన చుట్టుప్రక్కలనుండు సమస్తగ్రామములలోఁ గాపులందఱును రామదాసుగారు భక్తులని కొందఱును, మనతాలుకాఅమల్దారుని యాజ్ఞయని కొందఱును, మనచేతనైనంత శరీరప్రయాసపడుదమని కొందఱును, కూలికిఁ బైకముఁ బుచ్చుకోక కార్యములు కాఁపులు చేయం జేయించి రామభద్రాలయం బత్యంత రమణీయంబుగ నొప్పునటులఁ జేసె నెట్లనిన.

కల్యాణిరాగము - ఆదితాళము.

కైంకర్యము చేసెను రామదాసు కైంకర్యము చేసెను.
కైంకర్యముఁజేసె కాకుత్స్థకులునకు సంకటహరణాసర్వాత్మయని మ్రొక్కి
శ్రీకరమగు రాజితమణి శాలల ప్రాకారంబుల బహుమణిపంక్తుల
మంజుళతరమగుమణిమంటపముల కంజరాగమణి కలితాంగణముల
చారుచక్రకాంచనకూటంబుల నాకాశంబునునంటెడు తేరుల
గోపురమెరసెడిగోపురవితతుల దీపించువికర్దికల బెడంగుల
తళుకుగులుకుపగడపుగంబంబుల కలవదంబులను గలకలువదముల
రంగగుముత్యపురంగవల్లికల శృంగారములగు చిత్రపాళికల
మకరతోరణ సమాజంబులమణి ముకురతోరణసమూహంబులఁగడు

ఘుగఘుగవలచెడుకర్పూరపుమ్రముల అగరుధూపముల సాలపట్టముల
మెరసెడిరీతిని మేలిమిగాఁగను కైంకర్యము.

ధారాళములగు ద్వారబంధముల చారురత్నకాంచన శిఖరంబుల
గమగమమనియెడు గంధవాసనల ఘుమఘుమయనుపలు కుంకుమరసముల
ఘణఘణఘణయను గంటలతలుపుల ధణధణయనెడు మృదంగవాద్యముల
మినమినమ్మెరసెడి మేలిమిగ్గోడల కనకమయంబగు గరుడధ్వజముల
రామరామయను రామశుకంబుల వేమరుపొగడెడు విబుధగణంబుల
పొసఁగ మ్రోయు తుంబురుగానంబుల సొసరియాడు భక్తులనృత్యంబుల
వైనతేయముఖ వాహనచయముల భూనిశంఖభుంభుంనాదంబుల
మెరసెడిరీతిని మేలిమిగాఁగను. కైంకర్యము.

వెల్లగొడుగులను వింజామరముల మల్లెమొల్లల మంచివాసనల
పిల్లనగ్రోవి గభీరస్వరముల ఝుల్లరిఢక్కాజయనాదంబుల
పల్లవపాణుల పాటలనాటల సల్లలితోత్పలచయపరిమళముల
వనమాలాసంకలితోరస్థముల ఘనతులసీవనగణగంధంబుల
రామభజనసంరావోత్కరముల రామతీర్థసారసములతావుల
రామస్మరణల రవమధురంబుల రామభద్రవిగ్రహదర్శనముల
హనుమద్గజవాహనములఘనముల అనుపమశృంగారానందంబుల
రమణభద్రగిరి రామాలయమ త్యమలానందంబై ధరలోపల
మెరసెడిరీతిని మేలిమిగాఁగను కైంకర్యము.

వ. ఇవ్విధంబున గోపన్నగారు కైంకర్యంబులం జేయుచుండ నుద్యోగస్థులందఱు.

* నౌకరీలతనియాజ్ఞనిలచిరిదె నారాయణపదమనుచు
ఆకరుణానిధిభక్తికలరుచును పాదాశరథేయనుచు.

పున్నాగవరాళిరాగము - ఆదితాళము.

జానకీరమణా కల్యాణగుణ సజ్జనావననిపుణా
ఓనమాలువ్రాయఁగనే నీ నామమేలోఁచు జానకీ.
ఎందుఁజూచిననీదు అందమేకానవచ్చె జానకీ.
ముద్దుమోమునుజూచి మునులెల్ల మోహించిరి జానకీ.
దుష్టులు నిన్నుఁజూడ దృష్టితాఁకినగాని జానకీ.
ఎన్నిజన్మాలెత్తిన నిన్నేభజించనివె జానకీ.
ముక్తినేనొల్లనీదు భక్తిమాత్రముచాలు జానకీ.

రాతినాతిగాఁజేసినీ తిరువడియెగాదా జానకీ.
నారదాదిమునులు వరమందిరిగనుక జానకీ.
సత్యస్వరూపమునఁ బ్రత్యక్షమైనావు. జానకీ.

వ. అప్పుడు రామదాసుగారు తనచేనున్న పైకంబును నౌకరీల ద్రవ్యంబును కాఁపులయిండ్లనున్న ధనంబునంతయు రామార్పణంబు చేయించి గోపురప్రాకారమంటపాదులు కట్టించి.

* సంప్రోక్షణకై ద్రవ్యము లేమికి సంతాపంబును జెంది
సంప్రార్థనఁ జేసెను శ్రీరాముని చయ్యనఁ దనమదిగుంది.

పున్నాగవరాళిరాగము - అటతాళము.

రామాదయయుంచవే నీనెనరున స్వామినను బెంచవే
రామరవికుల సోమశంకర భీమవినుతసుత్రామసీతా రా.
కోరిమిము వేడితి ఈపనికేమి భారమనుచుఁ జేరితి
యేరిమమ్మికగావ నెవ్వరు లేరునన్నిక వేఱు సేయకు రా.
నిన్నే నెరనమ్మితి ఈపనులెల్ల మున్నే వినుపించితి
సన్నుతించగనేర నాపన్నదనుకృపజూడు వేగమే రా.
వేడుకలుమీఱఁగా నీకన్నులఁ జూడుసిరి జేరఁగా
తోడునీడై గావుమా నీయీడుదైవము లేదుమాకిక రా.
ఈసమయమందునా భద్రాచల వాసపనులయందునా
మోసపుచ్చకకావు రామదాసుఁడనునన్ను విడజేయకు రా.

గీ. అనుచుఁదలఁచఁగ నాతనియంతరంగ, మందు రాముఁడు నెలకొని కుందుబాపి
వడిగసర్కారుపైకము వ్రయము సేయ, బుద్ధిపుట్టించె నంతనాపుణ్యమూర్తి.

* రామరామతానీష ద్రవ్యమీరాత్రి నిలువయార్లక్షల్
భీమవినుతనీకై వ్రయపరిచిన స్వామిచెందునే శిక్షల్.
అనియూహించి ఖజానాపైకంబాక్షణమునఁ దెప్పించి
తనపైకమువలె ఖర్చుచేసితనతలఁపుకొనలు సాగించి.
భద్రశైలమున యాగశాలలను బహువేద్కలను గట్టించి
సద్రూపునకై సంప్రోక్షణమును సమ్యగ్విధిఁ గావించి.
కలశోద్వాహనఁజేసి రామునకుఁ గల్యాణంబును జేసి
బలివిధానముఁలు బ్రాహ్మణపూజలు బలువైఖరిఁ జేసి.

వ. భద్రాద్రి రాములసేవించిన నాజన్మము సఫలమాయెనని సంకీర్తనము సేయుచున్నారు.

బేగడరాగము - త్రిపుటతాళము.

నాజన్మ సఫలమైనది నేఁటికి నాజన్మ సఫలమైనది.
నేఁజేయుపుణ్యమ్ము నేఁటికిఫలించె శ్రీజానకీరమణవినుతభూజదశరథరాజనందన నా.
విమలమావిరజతో సమమైవిలసిల్లుగౌతమితీర్థమున స్నానములుఁగావించిరమణీయమగు
సోపానములుఁగడచిగోపురము వెడలిదివ్యపదకమలములుకన్నులఁగన్నయప్పుడె నా.
సమధికచైత్రమాసమునందు శుద్ధనవమిపునర్వసుకర్కటమభిజిత్తునాక్రమముననుకల్యాణ
మంటపముననువేంచేసిసీతారమణినతివిభవముసకల్యాణమవధరించఁగఁగనుఁగొంటి నా.
ఒకవంక వేదపాఠకులుపారాయణముసేయ ఒకవంకఘనవైణికులుపాడ ఒకవంక
భూమినాయకులుకొలువుసేయవకుళసుమములువివినిర్జరనికరములుగురియింపఁగాఁగని.
శుభకరమైసూర్యనిభమైనరథమెక్కి విభవమొప్పఁగజగదభిరాముఁడై నభమునను
దేవదుందుభులు మొరయసీతావిభుఁడవైవిహరించిదాసులకభిమతంబులొసంగఁగాఁగని.
రవికులోత్తంసదానవదర్పభంజన భవహరభద్రగిరిరామా పవనతనయ
సౌమిత్రివినుత గాధేయ సవనపోషకనీదుసకలోత్సవముఁగని ప్రసాదమొందితి నా.

వ. అని మఱియు నేమనుచున్నారు.

శంకరాభరణరాగము - చాపుతాళము.

కంటినేఁడూ మారాములఁ గనుఁగొంటినేఁడూ
కంటినేఁడుభక్తగణముల పాలిమాపంటభద్రగిరినంటియున్నవాని కంటి.
చెలువొప్పుచున్నట్టిసీతాసమేతుని కొలువుఁదీరినమన కోదండరాముని కంటి.
కస్తూరితిలకము ఘననీలగాత్రము కరుణారసముగురియుఁకన్దోయిగలవాని కంటి.
హారుమంజీముత్యాలసరములు మెఱయఁగ మురిపెంపుచిరునవ్వుమోముఁగల్గినవాని కంటి.
ఘల్లుఘల్లనిపైఁడిగజ్జలందెలు మ్రోయ తళుకుబెళుకుపాదతలముగల్గినవాని కంటి.
కఱకుబంగరుచేలకాంతిజగముగప్పశరచాపములు కేలధరియించుస్వామిని కంటి.
ధరలోనశ్రీరామదాసునిరక్షించు పరమపురుషుఁడైనభద్రగిరీశుని. కంటి.

వ. నాజన్మము సఫలమాయెనని పరమానందంబున.

* బ్రహ్మోత్సవమును బ్రహ్మార్పణమని భాగవతుఁడు చేయించె౯
బ్రహ్మజనకుపద మొందెను యీగోపన్న యనుచుఁ బ్రజలెంచన్.
ఈగతి భద్రాచలమున గోపన యోగభోగములనుండ౯
త్యాగభోగములసిరులఁజెలఁగు మాదన్న గారు గోల్కొండన్.

* తాలూకాబాకీల జాపితా తానడిగెను లేఖరుల
జాలముసేయక లెక్కలుదెచ్చిరి చాలునట్టి వైఖరుల
తనికీసేసితయారుచేసిరి త్వరితముతో లెక్కలను
వినికిచేసిరా లెక్కపక్కలను వివరవివరముగను
కడపటఁజెప్పిరిగడగడవడఁకుచుఁ గార్యస్థులుయిన్నిఁటిలో
తడవార్లకులు భద్రాచలమున తానిషవినిశనురెటులో.
అనవినివారలు నతివ్యథఁగుందుచు నలభద్రాచలమునకు
ఘనమతులనునిద్దరినిఁబంపె నాఘనభక్తునికడకు.

వ. ఇవ్విధంబున మంత్రులచే నంపఁబడిన నీతిమంతులు భద్రాచలంబునకుఁ జని గోపన్నను గాంచి రాజకార్యం బెఱింగించిన నారామదాసుండు శ్రీరాములందలంచి యిట్లనుచున్నాఁడు.

సౌరాష్ట్రరాగము - చాపుతాళము.

రామచంద్రాన న్నేలేవో రక్షించేవో నేనెఱుఁగ నీచిత్తము నాభాగ్యము నిన్నేనమ్మితి
భరతునివలెను నేనుపాదుకలు పూజింపనేర కోరిలక్ష్మణునివలెఁ గొల్వఁగనేర.
ఓర్పుతోగుహునివలె నోడనడుపఁగానేర నేర్పుతో నావాలివలె నిన్నెఱుఁగఁగనేర.
అంగదునివలెనేను అడపముబట్టనేర సంగరమున సుగ్రీవునివలె సాధింపనేర.
గాలిపక్షివలెనేను తాలిమిఁగ మోవనేర బలిమితో హనుమంతునివలెఁ బాటుపడనేర.
లీలతో శబరివలె లాలించి విందిడనేర మేలిమిగసీతవలె మెప్పింపనేర.
గజరాజువలెనేను గట్టిగ మొఱఁబెట్టనేర విజయునిసతివలె వినుతింపనేర.
గురిగాజాంబవంతువలెఁ గోరిభజియింపనేర చేరివిభీషణునివలె శరణనేర.
వరగజటాయువువలెఁ బ్రాణములేనీయనేర తిరముగనహల్యవలెఁ గీర్తింపనేర.
నేను రామదాసువలెఁ బూనిమిముభజింపనేర దీనునిరక్షించుభద్రాచలరామధీరా. రామ.

వ. అని మఱియును.

దర్బారురాగము - చాపుతాళము.

వచ్చేవోరావో మాయింటికి వచ్చేవో
వచ్చేవోరావోవాసుదేవనేఁడు అక్షయముగనన్నాదరించఁగవేగ వ.
పాపిష్ఠినైతీ రామనీ పాదమునమ్మితీ
మాపాలిదైవమని మరువకెల్లప్పుడు దాపుదండకుఁజేరితిశాపాదుమనివేగ వ.
కరుణించరాదా రామనిన్నే శరణమ్మలేదా
గరుడగమనగౌతమసతినహల్యను నరరూపుజేసిన చరణములకుమ్రొక్కె వ.

మ్రొక్కెనురారా యేలగనన్ను దిక్కు గావేరా
చక్కనిభద్రాచలరామదాసుఁడ నక్కరతోడ నన్నాదరించవేగవచ్చేవోరావో.

చ. వాలినితాటకిన్‌దునిమి యాగముఁ గాచి యహల్యఁ బ్రోచి సీ
తాలలనన్ వరించి రణదర్పితు రావణకుంభకర్ణము
ఖ్యాళి వధించి రాజ్యము నయంబుగ నేలిన రామచంద్రభూ
పాలుఁడు రంగశాయి మనపాలగలండు విచార మేటికిన్.

వ. అని మారుత్తరం బిచ్చుకున్న నానీతిమంతులు తిరిగి గోల్కొండకు వచ్చి మంత్రులతో నిట్లనిరి.

క. కనుఁగొంటిమిగోపన్నను, ఘనమానసులార యతనికార్యములెల్లన్
జనుగానివినుతిసేయఁగ, ననుమానముమానివినుఁడుయాతనినడకల్.

యమునారాగము - ఆదితాళము.

ఏమనిచెప్పుదుము మనగోపననడతలెల్ల యేమనిచెప్పుదుము.
కామితఫలదుఁడౌ రఘురాములేతనదొరయఁట     యేమని.
మాపులోఁగాపులకూడుక మద్దెళతాళములుమ్రోయ
సాపరాధులనైనఁ బ్రోచె స్వామిఁబాడుట మనకుఘనమనె     నేమని.
నిత్యపదవిచ్చేవాఁడే నిజముగఁ బ్రభుఁడనుచురాజ
కృత్యముల విడనాడ నీగతినందఱబోధించె     నేమని.
వాసిగభద్రాద్రియందు గాసిబాసి సీతాపతికి
దాసుఁడైయున్నాఁడు రామదాసులకుభయమెందు లేదనె     నేమని.

వ. ఇట్లు చెప్పిన వారివాక్యంబుల విని.

* గోలగొనుచు దుఃఖింపుచునుండఁగ గోలకొండతానీషా
తాలూకార్షుత్తీలఁదెమ్మనెను తడలేనిమనీషా.
ఏతాలూకాలెక్కలఁజూచిన నెవరుబాకిలేదనిరి
హేతువెఱుంగము భద్రాచలమున నిలవార్లతులె యనిరి
ఏలరాదుభద్రాచలపైకం బెవరెఱుఁగుదు రావిధము
మేల్కుచెందఁగాఁదలఁచినవారలు మెఱసి చెప్పినను ఘనము.
అనవినికొందరు హర్షముఁజెంది మహానుభావ వినుమనిరి
వినినంతయు మేమెఱుక చేతుమని వేగముందునిలఁబడిరి.

### మంగళకౌశికరాగము - చాపుతాళము.

తానీషవినుఁడుమామనవీ గోపనచెంది యట్టిదుర్మార్గపదవీ తా.
కాఁపులవశగతులఁ జేసివహోదా దాపునవారి చేఁబైకముదీసి
తనప్రాపు రాముఁడనుచుడాసి బాగ సాపడుచున్నాఁడు భయమెల్లఁబాసి తా.
ప్రత్యహంబునువారియింట నిత్యసత్యుఁడౌ రామునిగూర్చినృత్యమంట
మనభృత్యులెల్లను వారిజంటఁ జేరి మృత్యుపదముఁబాసీ మెలఁగుదుమంట తా.
విప్రులకునిత్యాన్నదానం తన స్వప్రయోజనమెల్ల నౌకర్లధీనం
దినమునుప్రభాతంబులగానం రామ వప్రగోపురములు కనకనిధానం తా.
సర్కారుపైకమచుదినము వాదర్కకులునికోరకుఁ జేసేటిప్రయము వేగ
హర్కారులఁబంపిగనుము వారు మర్కటప్రాయులై మరచినవిధము తా.
బొక్కసములుపాడుజేసి వారు మక్కువ రాముకోవెలఁ జక్కఁజేసి మీ
దిక్కున భయమెల్లఁబాసి నా చక్కనిదౌరరాములనె పూజసేసి తా.

* అనవినితానిష యతికోపంబున హర్కారులఁబిలిచి
పనివినిమీరలు భద్రాచలమునకుఁ బరువడితోనడిచి
పట్టుకచట్టలుముట్టడివేసుక పటుతరముగఁదెండి
యిట్టట్టనిననుపట్టువదలకను మట్టుబెట్టుచును రండి.

వ. అని తానీష యాజ్ఞయొసంగిన.

* కత్తికఠారులునీఁటెలు మొదలగు కలహాసాధనముల
బత్తిసాయుధములతో నడిచిరి బలిసిహుటాహుటుల.
కారుబారుకచ్చేరిఁజొచ్చిరి కటతటమదరఁగమీరి
దూరుచుగద్దింపుచును బల్కిరి ద్రోహులగుచుఁ జేరి.
క్యారేగోషనదేఖోబల్లుకుమావురె గోల్కొండా
జారెతానీషాబులాతెనికి చూద్రేహుకుంలండా.

### యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

ఆవ్ మియా బేగిబేగిచెల్ చెల్ చెల్ చెల్ చెల్ చెల్ మియా
క్యాఫర్ వానహి పుతోపుతోఆమారెపాచ్చాకడకుబేగి అ.
యేవారాని యెరుగవుమమ్ము రావోయివేగమె పాచ్చాకడకు
కావారమునకండలుబెంచి తీవరోత్తరావుబేగి అ.

నీవేయీసీమకధికారై నెగడినమాకేమిభయము
పైవారిపుత్త్రరవుజూచి పైణమైవేగమెలేచి ఆ.
తానీషా కయిగమనక తారుమారుఖర్చులు సేసి
బోనునఁజిక్కినపులిబోలె చిక్కితివైశ్యవాసు ఆ.
దిండుతివాసివేసుక దుండగీనిపనులుసేసి
ఖండితముగ్గాలేలెమ్మంటె బండతనముఁజేసేవేల ఆ.
లెక్కపక్కలుతీసుకనీ నిక్కలెల్లగట్టిపెట్టి
గుక్కమిక్కనకుండానడువు గ్రుద్దియెముకలు విరువకమునుపే ఆ.
జేర్బందు చేతపట్టుదుము నిర్బంధముగానరికట్టుదుము
దుర్బుద్ధులుమానఁగొట్టుదుము దర్బారు చేరనెట్టుదుము ఆ.
చింతలుమానిభద్రాద్రిశిఖరినుండు శ్రీరాములకు
నంత్యరంగభక్తుఁడవని యాచించితిమిగాకయిందాఁక ఆవ్ మియా.

* అనుచునుచట్టలబట్టుక లేపినహర్కారుల ముష్కరము
గనుఁగొనిరామానీకృపఁ జెందినఁగల్గునె దుష్కరము.

వరాళిరాగము - ఆదితాళము.

రామనీదయరాదుగా పతితపావన నామమే నీబిరుదుగా
సామజవరదనిన్నె యేమనిదూరుదు యేమదృష్టమొకాని యెంతోవేఁడినరావు రామ.
ఈవులడుగఁజాలఁగా మీ శ్రీపాదసేవే పదివేలుగా
భావజజనకమీ భావముఁదెలిసియు నీవేదైవమనుచు నేనమ్మియున్నాను రామ.
నీకేమరులుకొంటిఁగా నేనితరులను లోనుగాకయుంటిఁగా
ఆఁకొన్నవాఁడనై అనవలసియుంటిఁగాని నీకేదయరాకుంటె నేనేమిసేయువాఁడా.
ప్రేమనిబ్బరముఁయోఁగా భద్రాచల ధామయిదేమొమాయఁగా
భూమిజనాయక నాస్వామినీవనుచు కామించిసేవించే రామదాసునిబ్రోవ రామ.

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

గరుడగమన రారా నను నీ కరుణ నేలుకోరా
పరమపురుష యేవెఱపులేక నీమఱుఁగుఁజొచ్చితిని నరమరసేయకు గరుడ.
పిలువగానెరమ్మా అభయము తెలువఁగానెయిమ్మా
కలిమిబలిమినాకిలలోనీవని కలవరించితిని నలువనుగన్నయ్య గరుడ.
పాలకడలిశయన దశరథబాలజలజనయన
పాలముంచుననునీళ్లముంచు నీపాలఁబడితినిఁక జాలముసేయకు గరుడ.

ఏలరావుస్వామి నను నిపు డేలుకోవదేమీ
యేలువాఁడవనిచాలనమ్మితిని యేలరావుకరుణాలవాలహరి గరుడ.
ఇంతపంతమేల భద్రగిరీశ వరకృపాల
చింతలణఁచికంచర్ల రామదాసాంతరంగపతివై రక్షించుమి గరుడగమనరారా.

బేగడరాగము - చాపుతాళము.

ఏమిగొెఱుఁగనివాఁడనురా రామ యేతీరునకడతేర్చెదొరామ
తాపత్రయములందుఁ దగిలితిరా రామ పాపములెంతెంతో చేసితిరామ యే.
సంసారము యమరూపమురా రామ సదయుఁడననుకడతేర్చరరామ యే.
మానసగర్వవిదారణ రామ భానుకోటి సద్భాసురరామ యే.
అమితపరాక్రమవిక్రమరామ ఆపన్నచింతామణియోరామ యే.
నిన్నుఁబొగడ నేను నేరనురారామ నన్ను బ్రోవవె శ్రీరవికులసోమ యే.
నీవు భద్రాచల నిలయుఁడవై రామ కావవెనన్ను శ్రీజానకీరామ యే.

కాంభోజిరాగము - ఏకతాళము.

రక్షించురక్షించురక్షించురక్షించు రామచంద్రా
నన్ను శిక్షింపవచ్చిరి శీఘ్రముకృపఁజూడు రామచంద్రా ర.
రాజకార్యమే మొరచ్చుకువచ్చెను రామచంద్రా
నిన్ను రాజరాజవన రాఫుఁజేసెదవేల రామచంద్రా ర.
కలకాలమునిన్ను కాంక్షించివేఁడితి రామచంద్రా
యే ఫలముగాననైతి పాలించిబ్రోవవె రామచంద్రా ర.
ధర్మాత్ముఁడవని తలపోసితినయ్య రామచంద్రా
యింతనిర్మోహివగుట నే నెఱుఁగలేనైతిని రామచంద్రా ర.
పార్థివముఖ్యా పౌరుషయుత శ్రీరామచంద్రా
నిన్ను ప్రార్థించివేఁడెద పక్షముంచఁగదయ్య రామచంద్రా ర.
కరుణమాలిభటులుకఠినోక్తులాడఁగా రామచంద్రా
నీకరుణాకటాక్షము కానరాధాయెను రామచంద్రా ర.
ప్రేమభద్రశైలధాముఁడవైనీవు రామచంద్రా
శ్రీరామదాసునివేగ రక్షింపరావయ్య రామచంద్రా రక్షించు.

* అని స్తుతియింపుచువారలఁగూడుక నరుగుచుండ భూసురుఁడు
మనమునశోకించుచుఁ బురజనులందఱు మాఁగతియేమనుఁడు.

వ. అహో పరమభక్తాగ్రగణ్యా బహుదినంబులనుండి మీయాజ్ఞాబద్ధులమై మాయొక్క బహుజన్మసంచిత పాపకర్మంబులఁ బోనడఁచి మాకిహపరసుఖంబె లొసఁగ మీరేకర్తలని తమహజారంబు గాచియుండు మీబిడ్డలమైనమమ్ముఁ బాసిచనఁదలంచితి రిఁక మీఁద మేమేలాగున మెలఁగుదుమేదిగతి యెందుజొత్తుమిఁక మమ్మరసి కాపాడువారెవ్వరుస్వామీ యని యాతీలూకాలోనిజనులందఱు హాహాకారంబున నరుగుదెంచి యాభాగవతోత్తముని పాదపద్మంబులకు దీర్ఘదండంబులు సమర్పించి యార్తినొందు భాగవతులంజూచి రామదాసుగారు చింతాక్రాంతులై.

అసావేరిరాగము - చాపుతాళము.

విడిచిపోయెదనయ్యా భద్రాచలము కడతేర్చునగమయ్యా
పుడమిలో నేనంతపుణ్యము బడయఁజాలకపోతినకటా — విడిచి.
మీరలెల్లయిఁకను మనరాములఁ గూరిమితోడుతను
హారమాపతియనిభజింపుచు సహరహముపూజనముసల్పుఁడు — విడిచి.
జలజాక్షుపదసేవా దురితాంబుధి దొలఁగఁదీయ నావా
పలువిచారములేలయిఁకమీ రలదయాపరమూర్తిదలఁపుఁడు — విడిచి.
సత్యచారిత్రులకు మనరాములకు నిత్యనివేదనకుఁ
బ్రత్యహము మీకలకొలందిని నిత్యముగజరిపించుచుండుఁడు — విడిచి.
ఇలు వేలుపైయుండును కోరినట్టి కలుములొసఁగుచుండును
అలపదముజెందమదిఁగోరినకలుషహరణుని సేవఁజేయుఁడు — విడిచి.
ఈగతిజేసినను మీకుముక్తి వేగమె చేకూఱును
బాగుగాభద్రాచలేశుని పాలనిలకడఁజెందియుండుఁడు — విడిచి.

*ఈవిధినాడినవారలునిల్చిరి యిదెఘనమగుపథమనుచు
భోగిశయనభూపుత్రీరమణా భూసురుఁగావవెయనుచు.

శంకరాభరణరాగము - ఆదితాళము.

రామరారాసీతారామరారా రామరారానిన్నుఁజాల రాజులుపిల్వవచ్చిరి
క్షేమమొసఁగభద్రశైల ధాముఁడై వెలసినతండ్రి — రామ.
మానియోగముఁగాచి శిలను మగువఁజేసిజనకునింట
శివునివిల్లువిఱిచి సీత నెలమిపరిణయించిన — రామ.
తపసివేషముధరించి తండ్రికోఱకువనమునకేఁగి
తపనసుతునిఁగాచియు దధిదాఁటిరావణునిఁద్రుంచిన — రామ.

లంకవిభీషణునకొసఁగి లలనఁగూడియయోధ్యకు
శంకలేక నేలుచున్న జయతుభద్రాచలనివాసా రామ.

వ. ఇవ్విధంబున భగవద్భక్తులగు పురజనంబులు రామచంద్రా నీ దాసునిఁబ్రోవ వేగరమ్మని స్వామినింగూర్చి ధ్యానంబు సేయుచుండ.

అసావేరిరాగము - ద్విపద.

అంతటరామదాసాత్మలోపలను, చింతించిరామునిజేర్చిచిత్తమున
నిందిరాహృదయారవింద ప్రకాశ, కందర్పశతకోటి కలితలావణ్య
సింధుగంభీర నిర్మలచిత్తసార, బంధురతరకీర్తిభక్తమందార
కంజాతదళనేత్ర కౌస్తుభాభరణ, రంజితలోకపాలకరామరామ
నిన్నునమ్మినవాఁడ నెమ్మదిలోన, నన్నెట్లు బ్రోచెదో నాగేంద్రతల్ప.

ముఖారిరాగము - ఆదితాళము.

నన్నెట్లురక్షించేవోగా నానేరములనెన్ని తేమేరలేదుగా. నన్నె.
నన్నెట్లురక్షించేవొయెన్ని విధములనైన పన్నగశయననీబంటుబంటనురామ నన్నె.
ఇపుడిపుడే మోకాని యింతనాఁటనుండివిను అపరాధముసేసితి నామదిలోనఁ
గపటమె తలపోసితి నే మిక్కిలి విపరీతములుసేసితి కోదండరామ నన్నె.
ఇట్టివాఁడననుచుఁ జేపట్టుగఁబట్టినావు పట్టివిడువఁబోకుమీ యెంతోలేదనక
నట్టేపరాకుసేయకుమీ కృపయుంచిమీరు పట్టునఁగావఁజూడుమీకోదండరామ న.
శరదిందువదనభద్రాచలరామదాస వరదుఁడవైనందుకు దయఁగల్గితె
పరదైవములుమాకెందుకుఁ బతితపావనబిరుదువహించెదెందుకుకోదండరామ నన్నె.

సురటిరాగము - ఆదితాళము.

రామయేమయ్యా భద్రాచల ధామవినవయ్యా
రామసద్గుణస్తోమ రాజలలామ కలుషవిరామ మాంపాహి రామ.
సంతతము మిమ్ము భజింతుము చింతలెడఁజేయుము
అంతరంగమునందు నాపయిపంతమేటికి వింతచేయకు రామ.
చారుతరమైనా మీకీర్తన సేయనె కోరినా
పూనిమీకృప కేనుపాత్రుఁడ గానరక్షింపు దీనమందార రామ.
మానసమునందు మీపాదము మానకయయుందు
మీరిభద్రాద్రిఁజేరినన్నునీ వారివలెనేలుకోరశ్రీవిజయ రామ.

వ. అహో భద్రాద్రీశ్వరా యెన్ని విధంబులఁ బిలిచినఁ బలుకవు. నేను నిరుపాధికుఁడను గాన రక్షింపుమనుచున్నారు

కల్యాణిరాగము - ఆదితాళము.

నిన్నే నమ్మినానయ్య సీతారామ నిరుపాధికుఁడనీదయా.
నిన్నేనమ్మితిని నిగమగోచరనీతో విన్నపమొనరింప విన్నావో వినలేదో నిన్నే.
కరివరకుఁడవని కరుణాకరుఁడవని మరియుఁగనీచిన్ని మోమైనఁజూపవు నిన్నే.
వాసిగభద్రాచలేశుఁడవనినీకు దోసిలియొగ్గితి దొరవని వేఁడితి. నిన్నే.

శంకరాభరణరాగము - ఆదితాళము.

రామభద్రారారా శ్రీరామచంద్రారారా తామరసలోచనసీతాసమేతరార రామ.
ముద్దుముద్దుగాఁబలుకనవమోహనాంగరార నద్దంపుచెక్కిళ్ల వాఁడనీరజాక్షరార రామ.
చుంచురావిరేకతోడసొంపుజూచెరార పంచదారచిలుకనాతోఁ బలుకుదువురార రామ.
నాయెడలదయజూచినల్లనయ్యరార పాయకయెప్పుడునీబంటనయ్యరార రామ.
ముజ్జగములకునాది మూలదుంపరార గజ్జలచప్పట్లు ఘల్లుఘల్లుమనరార రామ.
అందెలుమువ్వలుచేతసందడింపరార కుందనంపుబొమ్మయెంతో యందగాఁడరార రామ.
పాడుకొన్న మోహమునిబ్బరమాయెరార పాదసేవకుఁడనుప్రత్యక్షముగరార రామ.
పట్టరానిప్రేమనాపట్టుగొమ్మరార గట్టిగకౌసల్యముద్దుపట్టివేగరార రామ.
నిన్నుమానలేనురనీలవర్ణరార కన్నులకింపుగనన్నుఁగన్నతండ్రిరార రామ.
మనవిచెప్పుకొందుగానిమరువకిందురార మనసునీమీఁదనేగాని మరలదెందురార రామ.
సామగానలోలనాచక్కనయ్యరార రామదాసునినేలినభద్రాచలేశరార. రామ.

వ. అని మఱియును.

కల్యాణిరాగము - ఆదితాళము.

నీసంకల్పంబెటువంటిదోకన నెంతవాఁడరామా
వాసిచోలఁగినీ దాసజనులుభువిఁ గాసిబడినయా ఘనమెవ్వరిదో నీసం.

బ్రోచినమఱివిడ జూచిననీకృపఁ గాచియుండుఁగాని
తోఁచితోఁచకను తొడరికరంబుల సాచిపరులనే యాచననేయను నీసం.

పటుతరమగునీ మటుమాయలకును యెటువలెనోరుతును
చెటులతరంబై చెలఁగుభవాంబుధి యెటుకడతేరుదు నెవరినిదూరుదు నీసం.

భావజరిపునుత పరమపురుషనీ భావము దెలియదుగా
దేవదేవనీ సేవకజనులకు సేవకుఁడనునను గావుమి మ్రొక్కెద నీసం.

దరిచేర్చెదవని ధైర్యముచేసీదరిఁజేరితిఁగాని
అరసిబ్రోవకను అరడిబెట్టుట యెఱుఁగనైతినా దొరవనుకుంటిని నీసం.

శరణాగతరక్షణ భవసాగరతరణా రిపుహరణా
కరుణఁజూడు భద్రాద్రినివాసా అరమరసేయక హరినినునమ్మితి. సీసం.

వ. అని పలుదెఱంగుల రామునింగూర్చి మొఱలిడుచుండ.

* అటహర్కారులు హరిదాసునిఁ గొని హైద్రాబాదునఁ జేరి పటుగతిఁ దానీషముందర నిల్పినఁ బల్కెనుకోపముమీఱి.

వ. తానీష గోపన్న గార్ల సంవాదము.

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

తా. రండీగోపన్నగారు మాలెక్కలెల్ల తెండీవేగమెమీరు
కందక్రొవ్వుచేత నిట్టి బండాటములకుమళ్లి
చండితనముచేత గోల్కొండదస్తు ముంచినారు రండీ, గో.

గో. వినుఁడీపాదుషగారు నాచేతలెల్ల గనుఁడీవివరించిమీరు ఘనమైనమంటపములు
కాంచనగోపురములు వినుతికెక్కిమీకీర్తి విభవముగఁగట్టినాను వినుఁడీ, తా.

తా. తానుసంగ్రహించినట్టి ధనమునధర్మముజేయఁ
జనుఁగాక నీకీబుద్ధి జనియింపఁజేసిరెవ్వారు రండీ, గో.

గో. ఒరులుచెప్పినట్టిబుద్ధి పరులుకట్టినట్టిసద్ది
తరుణమునకుఁబనికిరాదు తనకైతోఁచినబుద్ధేవృద్ధి వినుఁడీ, తా.

తా. గాలికివెరుపనిమొద్దుకైవడి బలికెదవేమి
తులవకురకలదొరతనమని తోఁచదేమోగా నీమది రండీ, గో.

గో. వెరువనేలకొకరికొకరు వెరపులన్ని దీర్చికావఁ
గరుణాకరుఁడైరాముఁడుండఁ గాంక్షచేఁగలఁగఁబడనేల వినుఁడీ. తా.

తా. కాంక్షలేనిపురుషుఁడవైతె ఖాయిదామీఱిమాడబ్బు
ఖుంట్వాజేసిభయమామాని పోటరివై పల్కెదవేమి రండీ, గో.

గో. పోటరితనము మాకేలహాటకచేలుని కృపమీ
మాటునజేర్చి మీమారుగఁ గోటఁగట్టితిరాములకు వినుఁడీ, తా.

తా. కోటఁగట్ట శ్రీరాములకు మేటివేమొ మే మెఱుఁగము
మాటికి యీమాటలేల మూటఁదెచ్చిముందరపెట్టు రండీ, గో.

గో. నీమాటముందరిదగుట నేఁగుట నీద్రవ్యమెల్ల
రాములకైంకర్యమాయె రాజరాజుల మేటివైతి వినుఁడీ, తా.

తా. రాజరాజులమేటివనవే యోజనీకుఁ గలిగియుంటె
రాజద్రోహమీలాగున ఫాజీయొందుకుఁజేతువు రండీ, గో.

గో. ఏలికనీసొమ్ముదీని పోలని కార్యము సేయ
యేలాఫాజీగీజియని యెరుకమాలిపల్కెదరు — వినుఁడీ, తా.

తా. గుణనిధివనిన్నెంచి గోపన్నా తహసీలిప్పింప
గుణహీనుఁడవై ధనమంతయుం గుడికట్టపాడుచేసితివి — రండీ, గో.

గో. అతిచంచలమైన సిరిని సతమని నమ్మి మీరిట్లు
వెతగుందనేల శ్రీయఃపతిమనవాఁడైయున్నాఁడు — వినుఁడీ, తా.

తా. మతిఁదప్పిమాటలాఁడేవు పతినాకంటె నీకెవ్వరు
కుతికంటివచ్చెనుబ్రతుకు సతమనినమ్మఁజెల్లదు — రండీ, గో.

గో. దేహముసతమని నేను మోహముఁజెందనీయట్ల
కూహకవృత్తులవిడచి గోలకొండదొరవై మనుము — వినుఁడీ, తా.

తా. గోలకొండతురకవాఁడు చాలబండఁడని నీమది
కేలనుంతైనతోఁచదు యేమందుహావహ్వానిన్ను — రండీ, గో.

గో. తోఁచనిచేతలెల్లను దుర్మార్గవృత్తులుగాక
కాఁచేటివాఁడురాముఁడు కల్పించేవృత్తులివిగాక — వినుఁడీ, తా.

తా. కాపాడేవాఁడు వాఁడైతె యీపాటునీకేలవచ్చె
నీపీఁచమణఁచెదనేఁడు ప్రాపెవ్వరోరమ్మనుబ్రోవ — రండీ, గో.

గో. భద్రాద్రివాసుని శ్రద్ధాభక్తితోవిడువకకొల్వ
ఛిద్రములెల్లఁబోఁదోలి భద్రములొసఁగు దాసులకు వినుఁడి పాడుచుపోగారు.

*గోపనధైర్య స్థైర్యములనుగని కోపమందితానీషా
యేపున నీమదమణఁగించెద నేనిప్పుడుచూడుతమాషా.
అని హర్కారులఁ గనుఁగొనిపల్కెను బెనగొన నత్యాగ్రహము
కనవలెమీనేర్పొకవారములో కక్కించుఁడుధనము
అనుచునుబంధిఖానాకనుపగయమునిబోలు కింకరులు
గొనిచనఁగా గోపన్ననువీథుల గోలగొనుచుఁ బురజనులు.

వ. అహోభద్రశైలాధినాథా నీయం దచంచలభక్తితాత్పర్యంబులు గలిగి తనసర్వస్వమును నీకొఱకు సమర్పించినయట్టి యంతరంగభక్తుని దయఁజూడవు నీజాయ సర్వసంపదలొసంగనేర్చు నీసుత సర్వపాపహారణముఁ జేయనేర్చు నీసుతుం డాయుర్వృద్ధిఁ జేయనేర్పరి వీరలకునీవాధ్యుండవగుట నీచేఁగాని దెద్దియు లేదు గాన నీదాసునిఁ బ్రోవరాయని పౌరులందరు రామకీర్తనము జేయుచున్నారు.

ఉ. నీసతి పెక్కుకల్ములిడ నేర్పరి లోకము కల్మషంబుగా
నీసుత సేయుపావనము నిర్మలకార్యధురీణదక్షుఁడై
నీసుతుఁడిచ్చునాయువులు నిన్ను భజించినఁ గల్గకుండునే
దాసుల కీప్సితార్థములు దాశరథీ కరుణాపయోనిధీ.

మధ్యమావతిరాగము - ఏకతాళము.

నీసరివారికయేరి మందహాసముఖాంబుజశౌరీ
కోసలపురిరఘునాయకా యీగాసిమాన్పుటకుపరాకా నీ.
కరుణతో ననుజూడవేమిరా యింత కరకరిఁ బెట్టుటమేరా
కరుణాకరయిటురారా మా మొరవినికరుణింపవేరా నీ.
ఇంకనైనదయరాదా నా వంకజూడవు మరియాదా
సంకటములు మాన్పవేరా మా కింకమీదగతియెవరురా నీ.
దాసజనావన భద్రశైల వాసహో శ్రీరామభద్ర
వాసవార్చితమృదుచరణా రామ దాసబంధసంతరణా. నీ.

*హాపురుషోత్తమ యీపుణ్యాత్మునకీపాటులుదగునా
గోపగోపికావల్లభుఁడగునీ కీపరాకుదగునా.
అనివెతఁజెందుచుఁ గుందుచునడిచిరి హరిదాసునితోడ
ఘనమా నీకిదినన్నిటు జేయుట లనితలఁచుచువేఁడ.

సావేరిరాగము - చాపుతాళము.

రామసుధాంబుధిధామరామనాపై యెందుకుదయరాదురా
వేమరువినయముతో వివరించితే నామనవివినవేమిరా
మక్కువసేనెంత బతిమాలుకొన్న నీమనసుకరుగదేమిరా
నిక్కముగాఁదల్లిదండ్రివినీవని నెరనమ్మియున్నానురా
దిక్కునీవనియున్నదయజూడవిఁక మాకుదిక్కెవ్వరున్నారురా
యెక్కడనున్నావో నామొరాలకించ వింతపరాకేలరా
ప్రతిదినముదరపోషణసేయుటేదొడ్డ వ్రతమనితిరిగితిరా
మతిలేనిధనికులె గతియనిదినము నే స్తుతిసేయసాగితిరా
సతతముమాయసంసారమునమ్మి దుర్గతినొంద పాలైతిరా
పతితపావనచాలవెతనొందివచ్చితి గతిజూపి రక్షించరా
నీపాదసేవచేసినసజ్జనులకుఁ బాపములంటవురా
తాపత్రయవ్యథలుమాన్పినన్ను నీదరిజేర్చి గావవేరా

ఈపట్టురక్షించికాపాడకున్న నేజెవరివాఁడనౌదురా
ఆపద్బాంధవభద్రాద్రిరామదాసుఁ డనుచునన్నేలుకోరా.

వ. అహో భద్రనగాధిరూఢా తండ్రియును దాతయును తోడును నీడయును భయత్రాతయును సర్వంబును నీవేననియును నీకన్న నన్యులు లేరని చిన్ననాటనుండి నెరనమ్మియున్న నన్నిటుల చేయుదువా స్వామీ యని కీర్తింపుచున్నారు.

ముఖారిరాగము - ఆదితాళము.

ఇటులఁ జేతువఁటరా యిదితగునఁటర ఓరామరామ
కటకటా నాపై యింతకరుణయుంచితివఁటరా ఇటుల.
అలనాఁడునీవు నాకలను ప్రత్యక్షమై బలిమిని మేనమామలఁజూడఁబొమ్మని
పలికిననటుఁజేయకొలువుననిలిపి కోవెల నెరవేర్పక నవలపుడమీశుచే నిటుల.
ఇంతచేసినవాఁడవిఁక నేవిధముల నెంతెంతఁజేయింపనెంచితివో హరీ
పంతమేలనాపై భక్తవత్సల నాస్వాంతమునందున నిన్నెంతోనమ్మినందు కిటుల.
తగవేయిటులకృతఘ్నతఁదలఁపఁగ తగవేమనుపంగఁగ దేభద్ర
నగరామదాసుఁడరక్షింపుమునన్ను పగవాఁడనఁటరాపతితపావన నన్నిటుల.

వ. అని పరాకుచేయక నామనవి వినుమనుచున్నారు.

అసావేరిరాగము - రూపకతాళము.

రామ నామనవి చేకొనుమా దైవరాయ పరాకుసేయకుమా
స్వామిభద్రాచలధామ పావనదివ్యనామ గిరిజనుత భీమపరాక్రమ రా.
దరిలేని దీనజనులను గాచె బిరుదుబూనితివి ఖ్యాతిగనుమా
గురుతరశమనకింకర బాధలకునీ మరుగుజేరితి నన్నరమరసేయక రా.
కపటమానసుఁడని మతినీ యెన్న కిపుడు రక్షించు సమ్మతినీ
అపరాధముల కేనాలాయమైతిని కృపజూడుమీనాదు నెపము లెన్నకస్వామి రా.
పతితపావనమూర్తివైనా నీవె గతియనియుంటి మతిలోనా
సతతముఁరామదాస పతివై భద్రాద్రిని అతులితవైభవగతులచే నెలకొన్న రా.

వ. అని నన్ను దయాదృష్టిజూడుము స్వామీ యనుచున్నారు.

కల్యాణిరాగము - చాపుతాళము.

రామా దయజూడవే భద్రాచలధామా ననుగావవే
రామా కౌస్తుభధామా నతజనకామా జలధరశ్యామా జగదభి రా.

దేహాభిమానుఁడనై యిన్నాళ్ళు వ్యామోహసంకలితుఁడనై
ఐహికసుఖములం దనురాగముంచి విదేహాత్మజారమణ దెలియనైతిని రా.
హా రుఁ డెఱుఁగక పోయెను నీ మాయను యజుఁ డెఱుఁగక పోయెను
హరిహరి నిన్నెఱుఁగనా నా నీకృపలేక కరుణాకర నాసరసవచ్చి వేగ రా.
దిక్కులేనివారిని మక్కువతో గ్రక్కునఁ గాతువని
దక్కితినీకేను భద్రశైలరామదాసు నేరీతిని బ్రోచెదో యికమీఁద రా.

వ. నిన్ను నమ్మినందుకు యిదే రక్షింప సమయమనుచున్నారు.

శంకరాభరణరాగము - రూపకతాళము.

రక్షించు యిదియేమొ రాచకార్యముబుట్టె రామచంద్రా
నన్ను రక్షింపకున్నారు రక్షకు లెవరింక రామచంద్రా ర.
అప్పులవారొచ్చి అరిగట్టుకున్నారు రామచంద్రా
స్వామి చెప్పశక్యముగాదు చక్షుర్గోచరమాయె రామచంద్రా ర.
కుక్షిలో మీమీఁద కోరికబుట్టెను రామచంద్రా
స్వామి యిక్ష్వాకుకులతిలక యిఁకనయిన కావవె రామచంద్రా ర.
పక్షివాహనుఁడ పాలించిదయజూడు రామచంద్రా
అక్షయకటాక్ష అభిమానముంచవె రామచంద్రా ర.
అధికుని చేఁబడితి అడ్డమేమనుకుంటి రామచంద్రా
స్వామి అధములకన్నను అన్యాయమైపోతి రామచంద్రా ర.
భయమేమి నే రామదాసుఁడ ననుకొంటి రామచంద్రా
స్వామి భయముబాపిబ్రోవు భద్రాద్రిపురనిలయ రామచంద్రా ర.

వ. శరణాగతరక్షకుఁడవని నిన్ను శరణుజొచ్చితిని కావుమని వేఁడుచున్నారు.

యమునాకల్యాణిరాగము - ఏకతాళము.

శరణాగతరక్షణ బిరుదని శరణంటిగదయ్యా
వెరువకుమని యభయంబొసఁగవె ననుగన్నతండ్రివయ్యా. శర.
కరివరదుఁడ సిరులొసఁగను దశరథనందన రావయ్యా
నిరతము నీనామము నాజిహ్వకు రుచిగొననీయవయ్యా శర.
నరహరి బాలునిగాచిన జగన్నాథుఁడ వినవయ్యా
గరుడవాహనుఁడవయి నాకన్నుల గానుపింపవయ్యా శర.

ఆదిదేవ మీచిత్తము భాగ్యము భార మెవరిదయ్యా
నీదాసులకును నేదాసుండ దయయుంచి యేలుమయ్యా శర.
హరి నీతోడ సమానమైన మాయాప్తులు యెవరయ్యా
కరుణాసాగరుఁడని మొరలిడినను అరుదేటికయ్యా శర.
కోరితి నాదైవము నీవని దూరితిగదవయ్యా
నేరము లెంచక గారవించి కృపజూడు నల్లనయ్యా శర.
ముద్దులు గుల్కఁగ రామదాసుఁడని ముచ్చటాడుమయ్యా
పద్దులు యీడేర్చెడి భద్రాచలపతి నీవేగదవయ్యా శర.

వ. నాపాలిరాముఁ డేడనున్నాఁడో యని మొరలిడుచున్నారు.

వరాళిరాగము - ఆదితాళము.

ఏడనున్నాఁడో భద్రాద్రివాసుఁ డేడనున్నాఁడో నాపాలిరాముఁ డేడనున్నాఁడో
యేడనున్నాఁడో జాడఁదెలియరాదు నాఁడు గజేంద్రునికీఁడు బాపినస్వామి యేడ.
ద్రోణిబాణజ్వాలఁ దాఁకినబాలునికిఁ బ్రాణమిచ్చినజగత్త్రాణరక్షకుఁడు యేడ.
పాంచాలిసభలోన భంగ మొందిననాఁడు వంచనలేకను వలువలిచ్చినతండ్రి యేడ.
దుర్వాసుఁడుగ్రతతో ధర్మసుతుఁజూడ నిర్వహించిన నవనీతచోరకుఁడు యేడ.
అక్షయముగ శ్రీభద్రాచలమందున సాక్షాత్కరించిన జగదేకవీరుఁడు యేడ.

వ. ఇవ్విధంబునఁ గూర్చి స్తుతిఁజేసి యీచెఱలోఁ బ్రవేశించ సెలవా యని రాముని సెలవడుగుచున్నారు.

నాదనామక్రియరాగము - ఏకతాళము.

సెలవా మాకు సెలవా యీచెఱకేఁగ సెలవా
సెలవా మాకిఁక జలజసంభవనుత జలజాతనేత్ర సజ్జనమిత్ర శ్రీరామ సెలవా.
నీవా నన్నేలుకోవా యిటువేగ రావా సమయము కావా రామయ్య సెలవా.
వాసిగ భద్రాద్రివాసా వరరామ దాసా హృదయనివాసా రామయ్య సెలవా.

వ. ఓతండ్రీ రామయ్యా నాకర్మ మెంతబలమైనదో స్వామీ అనుభవించఁ గాల మెంతయున్నదో తెలియదే అనికీర్తనముఁ జేయుచున్నారు.

హుసేనిరాగము - చాపుతాళము.

కర్మ మెంతబలిమో గడుపుటకుఁ గాల మెంతస్థూలమో
మర్మ మెఱుఁగ వశమా మహిమయెట్టిదో కాని ధర్మతత్త్వ మింతని తెల్పలేనయ్యా. క.

గురుఁడు గానఁడాయె సాబ్రతుకునకు పరులవేఁడనాయె
యెఱుకమాలితత్తరమునఁజిత్తము పరుగులిడుచునాతురగతిరవ్వాయె కర్మ.
వాసనఫలమెట్టిదో నాగతభవోపాసన మెంతటిదో
వాసరంబుసంవత్సరసమమాయె వాసుదేవభవవార్ధిగడుపుటకు కర్మ.
హాసవిజితకందా భద్రాచలరామ దాసహర్షబృందా
వాసవాదిసురవంద్యపదారవింద వాసుదేవభవవార్ధిగడుపుటకు కర్మ.

* బందీఖానను భక్తుఁడునిలిచెను పదిరెండేఁడులదనుక
'వందే రామం దాసోఽహ' మ్మని పనరుచుండెఁ గడకన్.

వ. హేభద్రాద్రిపురాధీశ్వరా నే నితరదైవములజోలి నొల్లనీనామంబు సర్వకాలములయందు స్తుతియింపుచు నీసేవచేయుచునీయడుగుఁగెందామరలకే నమస్కరింపుచు నీమూర్తిని నామనంబున నెలకొల్పుచు నీ దాసానుదాసుండనై వర్తింపుచుండునటుల కృపయుంచుమని మఱియును వేఁడుచున్నారు.

ఖమాచిరాగము - ఆదితాళము.

వందనమోరఘునాయకా ఆనంద శ్రీరఘునాయకా
పొందుగఁబాదారవిందములను గనుఁగొందునో శ్రీరఘునాయకా వంద.
ఎవరేమన్న రఘునాయకా నే వెరవఁజాలరఘునాయకా
నవనీతచోర నీనామమెగతియని నమ్మితి శ్రీరఘునాయకా వంద.
మన్ననతో రఘునాయకా నా మనవి వినుము రఘునాయకా
సన్నుతింపఁగఁజాల సరసిజదళనేత్ర కన్నతండ్రివి రఘునాయకా వంద.
చపలచిత్తుఁడ రఘునాయకా నన్నుఁ జేపట్టుమీ రఘునాయకా
విపరీతగుణముల నిడుములఁబడితిని యింపమే మెఱుఁగను రఘునాయకా వంద.
దాసపోషక రఘునాయకా నీవు దాతవు శ్రీరఘునాయకా
వాసిగభద్రాచలరామదాసుని యాస దీర్చుము రఘునాయకా వంద

వ. ఇవ్విధంబున నేను మొరబెట్టుకొనినను నీకేల దయరాదు స్వామీ యనుచున్నారు.

పున్నాగవరాళిరాగము - ఆదితాళము.

ఏలదయరాదే రామయ్యనీ కేలదయరాదే
శ్రీలమేలంగై పాటుబడితినని కాలవిడంబము చాలుచాలునీకే నేల.

బ్రహ్మగూర్చిగదే అహో పరబ్రహ్మకావఁగదే
బ్రహ్మజనక నవబ్రహ్మేంద్రాదులు బ్రహ్మానందము పాలై సారఁట యేల.
పాపములచేత రామయ్యనే నోరకలేనుగదే
శ్రీభూప యేప్రాపులేక మీ ప్రాపేగోరితి గోపరూపయిఁక నేల.
తలఁచగఁజాల నానందబాష్పజలములూరెగదే
నీలనీరదనిభకోమలరూప భద్రశైలవాస రామదాసునేలఁగ నేల.

వ. స్వామీ నన్నేలరక్షింపవు నేఁజేసిన నేరము లేమని వేఁడుచున్నారు.

సురటరాగము - అటతాళము.

స్వామిరక్షించవేమీ సీతారామ స్వామినన్ను రక్షించవేమీ
మోమైనఁజూపవేమి నేఁజేయుఁ నేరమేమి స్వామి.
మరువకనిన్నె నమ్మియుంటి నెంతైనఁగాని పరదైవముల వేఁడనంటి
నీదివ్యనామస్మరణయెప్పుడుచేయుచుంటి సత్కృపనిహపరములిచ్చేవాఁడవనియుంటి
యెందునైనా మీసరివేల్పులేఁడని మఱిమఱిసాటుచుంటి స్వామి.
జాతినాతిఁగఁజేసినావు అజామీళు నిర్మాతుగఁజేసినావు
ప్రహ్లాదుని ప్రఖ్యాతిగాను రక్షించినావు ద్రౌపదికి దయచేతఁ జీరలొసఁగినావు
నామీఁదయేమి హేతువోకాని దయసుంతైనరానియ్యవు స్వామి.
లీలావిభూతిజన్మములు యెత్తుచుండేటిమేలు యీపాటినావఁజాలు
యెంతనిబలిమాలుకొందు ననునీపాలు సేయుటే పదివేలుభాగ్యములుదోషాలు
చూడకనన్ను నేలుకొనుటేమేలు సంతోషములు స్వామి.
సకలలోకములు నీలోను లోకములఁ బాయక నీవుసంతోషములోను
ఉన్నాఁడవనుచు ప్రకటించిశ్రుతులుపాడఁగాను కర్ణములామోదకరములోనె విన్నాను
యిట్టివాఁడవు ఇఁకనీవుబ్రోవకుంటె యెవరుబ్రోచేరునన్ను స్వామి.
దాసమానసపద్మభృంగా సంతతచిద్విలాస పక్షిరాజతురంగా
శ్రీసీతామనోల్లాస యింద్రనీలశుభాంగా శ్రీభద్రాచలవాసా సత్కరుణాంతరంగా
యేవేళ రామదాసప్రసన్నకరుణాసాగర రామ స్వామి.

గీ కమలనయననన్నుఁ గరుణించుమని వేఁడి, పెదవులెండి తృష్ణపీడ నేయ
భటులు దెచ్చిరంత బత్తెములవణము,తండులములఁ జేర్చి తనకొసంగ.
*కనుఁగొనగోపన కడుదీనుండై కరుణాసాగర రామా
మనఁగలనే. యీయన్నము. దిని యేమార్గము నాకిఁక రామా.

# రామదాసచరిత్రము.

## కేదారగౌళరాగము - చాపుతాళము.

ఏలాగు తాళుదు నెవ్వరికేఁడుదు నేమిసేయుదు రామా
యేలువాఁడవటంచు నిను నే చాలనమ్మితిగాని రాముడి
ప్రాలుమాలక ప్రోవు భద్రశైల రాఘవ సర్వలోకేశ ఏలా.
ఎల్లప్పుడు మయప్పాటికి రామామృత మెలమి గోలకొండకు యప్పుడయ్యమారికి తెప్పున
ఇచ్చుకొమ్మని యయ్యవచ్చిరి యప్పు నే నెప్పుడిది గుదుటూర తెప్పునను ననుబ్రోవరారా.
తాపమాయెనుగదరా యెట్లోర్తుర తాపవిదూరరారా తాపసాంత హృదయవాసా
దండనేలర శ్రీనివాసా కోపముంచఁదగదు వేగమె తాపమార్పు సుధాబ్ధిశయనా ఏలా.
భద్రాచలరామా శ్రీరామభద్రా నన్నేలుమా భద్రగజమేమిచ్చె నీకలభద్రుఁడేమియొసంగె
వారల భద్రముగఁ గరుణించినటు నాఛిద్రముల దునుమంగరాదే ఏలా.

వ. అని మఱియును.

## బేగడరాగము - ఏకతాళము.

ఏలాగు తాళుదు నేమి సేతురరామా ఈజాలి చేతను తాళఁజాలను రామా ఏలా.
దీనజనుల కెల్లదిక్కు నీవె రామా మనమున నిన్ను నే మఱనో రామా ఏలా.
పావనమూర్తియో పట్టాభిరామా కావవే యీవేళఁ గౌసల్యరామా ఏలా.
శరణని నీ మఱుఁగుఁ జేరితిరా రామా శరణంటె కాచేది బిరుదె రఘురామా ఏలా.
ఎన్నరాని ప్రేమ నెందుదాతురరామ ఆపన్నరక్షక నాపాలిటి శ్రీరామా ఏలా.
నీసొమ్ము నేననుట నిజమె యోరామా నాదోసములన్నియుఁ దొలఁగించవేరామా ఏలా.
తాలి కైనఁ జమటరంజిల్లు రారామ ఆతీరు నీమనసునొందదు రామా ఏలా.
యమబాధలొందలేననిజంకితిర రామ యమదండన లేకయెడబాపుమి రామా ఏలా.
వాసిగ రామకీర్తనఁ జేసితి రామ రామదాసుని మీఁద దయయుంచుమి రామా ఏలా.

గీ. దశరథసుతుండె తనపాలి దైవమనుచుఁ, బచనమొనరింపఁ బాయసపక్వమైన
ద్విజకులోత్తంసుఁడిది రామదేవుమహిమ, యనుచు సంతృప్తిభుజియించి యలరుచున్న.

క. తానీష యొక్కనాఁడు జవానులఁ బిలిపించి ఖైదిఁ గర్తన లడుగక
మానవనాథా ద్రవ్యము, తా నియ్యఁదలంపఁడతని దండింపఁదగున్.

క. అనిన విని మీఱలిది మొద, లనుమానము మానిఁ దెబ్బలంటించుఁడు నా
ధన మెటులరాదో చూచెదఁ జని కార్యము నెరపుఁడనినఁ జారులు వేగన్

## ద్విపద.

రామదాసుని భటు ల్రాజసంబునను, సీమలోఁ జనములు చింతిలిచూడ
ముష్టిప్రహారంబులను గొనసి కట్టలకుఁ, దెప్పునఁ దగిలించి లేజంబుదూల

# రామదాసచరిత్రము.

పురములోనిజనంబు లరయఁ ద్రిప్పుచును, కరముగానిదురుక్తు లతఁడు ఘోరనింద
నంబులరొప్పుల నార్భాటములను, యంభోధి మొఱయు చందంబునఁ జేసి
రోరి పాతకుఁడ నీయుబ్బణంచెదము, వేఱుబుద్ధులుమాని వినుమా పలుకులు
గొబ్బునఁ జెల్లించు గోల్కొండదస్తు, నిబ్బరంబున నుండ నీయబ్బసొమ్మె
చెల్లించకున్నఁ జెచ్చెరఁ గొనిపోయి, విచ్చలవిడిగాను వేధింతుమనుచు
మండలేంద్రునిముఖ మంటపంబునకు, దండతాడితుఁ జేయఁ దగురీతిఁ దెచ్చి
కట్టిరి చేతులు కాష్ఠకంభమున, కొట్టిరి కొరడాల కోయనియార్వఁ
బట్టేమిగానక భాగవతుండు, అట్టె మొరలిడఁబూనె హరినిఁ దలంచి.

యమునాకల్యాణిరాగము - ఏకతాళము.

అబ్బబ్బబ్బ దెబ్బలకుఁ దాళలేరా జబ్బుసేయక మాయబ్బ రారా అబ్బ.
అబ్బబ్బ మేనుబ్బడంగెగొబ్బుగొబ్బునరా వేమినిబ్బరముగఁ బ్రోతువనియుబ్బుచుంటిరా అ.
దబ్బరగాదుర యొకడబ్బైన నే నెఱుఁగ నాయబ్బతోడుగ నాకీదెబ్బ లేలరా అ.
శరణాగతత్రాణబిరుదెందుఁ బోచ్చెనా తెరువుఁ జూడవిదేమి తెఱఁగౌరా అ.
కొఱకొఱలాడుచుఁ జిఱజిఱఁ జూచుచుఁ గొఱడాల చేఁగొట్టు ఘోరమేమిరా అ.
హరిహరియనినిన్ను మఱిమఱివేఁడిన నరమరలేల భద్రగిరిధామా అ.

వ. అని యివ్విధంబున మొఱలిడి భక్తియుక్తుండై స్తుతిసేయు చున్నారు.

శంకరాభరణరాగము - రూపకతాళము.

నారాయణ నారాయణ జయగోపాలహరే నా.
శ్రీకౌస్తుభమణిభూష శృంగారమృదుభాష నా.
నందనందనకుమార నవనీతదధిచోర నా.
కమనీయశుభగాత్ర కంజాతదళనేత్ర నా
కరుణాపారవార వరుణాలయగంభీర నా.
మంజుళకుంజభూషా మాయామానుషవేష నా.
అజభవనుతకంసారీ యచ్యుతకృష్ణ మురారీ నా.
మురళీగానవినోదా వ్యత్యస్తాద్భుతపాదా నా.
యమునాతీరవిహారా దృఢకౌస్తుభమణిహారా నా.
వరభద్రాచలవాసా పాలితశ్రీరామదాసా నా.

* తాళఁజాలననితల్లడమందెడి దాసునిదేహముఁ జూడఁగ
కూళలుకొట్టిన క్రూరపుదెబ్బలగురుతులె లేకుండెన్.

శా. అంత న్దాసుఁడు హా మురారి యిట నేనార్తుండనై యేడ్వ గో
రంతైనా కృపయుంచఁజూడ వయయో హాపాపసంహర్త శ్రీ
కాంతా యీఘనపాపకర్మములచేఁ గారింపఁగాఁ జేయుదే
సంతాపంబు హరింపఁ జేసి నను నీసాన్నిధ్యముం జేర్పవే.

బిలహరిరాగము - రూపకతాళము.

రక్షించెదొకపని నమ్మితి నన్ను శిక్షింపఁదప్పేమి సేసితి
రక్షించనికంటె రాజులెవరున్నారు దాక్షిణ్యమింతైనఁదలఁపునుంచవు ర.
శ్రీపావె నెరనమ్మియుంటిని నన్నుఁగాపాడెవిరుదు నీదంటిని
చేపట్టివిడనాడఁ జెల్లదు యింకనీవు దాపుదండయునీవె దైవముసాక్షిగ ర.
ఎంతో వేఁడిన నేలపల్కవు నే నెంతద్రోహినో దయఁజూడవు
యెంతేసివారల నేలేటికర్తవు అంతకంతకునాపై యరమరజూచేవు ర.
భద్రాద్రివాస మీబంటను ఇతరపాపములేదు నావెంటను
అద్రిజసన్నుత యమరాదివందిత భద్రే భవరద నాపాలిటిదైవమ. ర.

బిలహరిరాగము - ఏకతాళము.

రావోయిరామన్నా రావయ్యా ఈవోయిసాయుజ్య మింపొందఁగాను
ఓసదయాపరనీ సేవకైనే నాసించియున్నాఁడ నార్తరక్షవేగ రావో.
దేవరవారిది పావనబిరుదే నావంటిదీనునిఁ గావదిక్కేదే రా.
క్రూరకర్మములు నేరకజేసితి వేఱెప్రాపకులు లేరు సుమ్ము రామ రా.
మదనాంధకారము మది దెలియనీయదు వదలదు సంసారవాంఛయేమిసేతు రా.
మదిలోనయముఁ డంటె మఱిబెదరుచున్నది అదెవెరవకుమని యభయమిమ్ము రామ రా.
పున్నమచంద్రుని బోలునీనగుమోము కన్నులఁజూపర కరుణాసముద్ర రా.
ఎన్నాళ్లదుర్బుద్ధు లేమందురానన్ను గన్నతండ్రి వేగ మన్నించరారామ రా.
నీవుభద్రాచలనిలయుండవై యుండి కావవయ్యరామదాసవిలాసా రా.

గీ. ఇవ్విధంబున మొరలిడ నినకులుండు, పజ్ఞత్తర దేహునిగఁ జేసివాడుదీర్చె
నంత తానీష యొకనాఁడువింత లేమి, వర లెగోపన చెఱననంబంటుఁ నిరి.

* కొట్టిన దెబ్బలు గుఱుతులుగానము గురుమాంత్రి కుఁడతఁడు
మట్టుబెట్టకను మనపైకం బేమాత్ర మొసఁగఁడతఁడు
అనవినియిది మొదలాదుర్మార్గుని హస్తములకుకట్టి
పెనఁగొనవేసి వధించుఁడుమీరలు ధనముపచ్చు గట్టి.

క. అనినంత కింకరులు వే, చని గోపనఁ బట్టితెచ్చి [illegible]
మనవచ్చు కిట్టికోలలఁ, గొని యొత్తిరి తాళలేక కుందుచు నార్వన్.

వ. అప్పుడు రామదాసుగారు భద్రాద్రినిలయునింగూర్చి యిట్లని విల
పించుచున్నారు.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

ఏమిరా రామా నాపల్ల నేర మేమిరా రామా
యేమి రామ యీలాగుకష్టము నీమహిమో నాప్రారబ్ధమో — ఏమి.
కుండలిశయన వేదండరక్షకా ఖండతేజ నాయండనుండవే — ఏమి.
పంకజలోచన శంకరనుత నా సంకటమూర్చవె పొంకముతోడను — ఏమి.
మందరధర నీసుందరపదములు యిందిరేశ కనుఁగొందుఁ జూపవే — ఏమి.
దినమొకయేఁడుగ ఘనముగగడపెద తనయునిమీఁదను దయలేదయయో — ఏమి.
సదయహృదయ నీమృదుపదములు నా హృదయకమలమున వదలకనిల్పెద — ఏమి.
రామరామ భద్రాచలసీతా రామదాసుని ప్రేమతోనేలవే — ఏమి.

శా. ధీరాగ్రేసర నందనందన హరీ దేవౌఘచూడామణీ
ఘోరాఘౌఘహరా ముకుంద నృహరీ గోవింద శ్రీకృష్ణ సం
సారాంభోనిధికర్ణధార కమలాక్షా శౌరి దామోదరా
శ్రీరామాచ్యుత జానకీరమణ ని న్సేవింతు నిష్టాప్తికిన్.

ముఖారిరాగము - చాపుతాళము.

ఏటికిదయరాదురా నాపైని నీ కేటికిదయరాదురా ఓరామా
ఏటికిదయరా దిదేటికర్మమొగాని మాటిమాటికి వేఁడ నేటికి నాపైనీ — కేటికి.
కన్నతండ్రియంటిఁగా నాపాలిటి పెన్నిధానమంటిఁగా
కన్నడసేయకుమని వేఁడుకొంటిఁగా కరుణాజలధే హేదాశరథే — ఏటికి.
కుయ్యాలకింక నే నాపదు పాల్లయ్యయో గనుమంటినే
వెయ్యారువిధముల వినుతిఁ జేసిననన్ను య్యెడగృపజూచియ్యన బ్రోచుట — కేటికి
పతితుఁడ నేనంటిఁగా పతితపావనబిరుదు నీదంటిఁగా
గతినీవేయని నే మతినమ్మియుంటి నిరతమునీ నామకీర్తనము చేసిననాపై — యేటికి.
హరిహరిపరాకా నీవిటురాక అరమరలెందాక
శరణన్నజనులను బిరబిరఁ బ్రోచెడి బిరుదుగల్గినయట్టి దొరవనిపిలిచిన — నేటికి.
దోసిలొగ్గితినీకు ఓరామరామ దోసమెన్నఁబోకు
ఆసించియుంటి భద్రాచల శ్రీరామ దాసుఁడనంటి నాగాసిమాన్పవుంటి. — ఏటికి.

వ. అని మఱియు నిట్లని విలపించుచున్నారు.

ఆహిరిరాగము - అటతాళము.

రామహో సీతారామహో రామహో నే శరణన్న
నామొరాలించి కావవు ప్రేమలేదుగదర నాదుష్కృతమదేమో తెలియదాయె. [పుట్టి
మ్రొక్కినిన్ను వేడగా నాదిక్కుచూడవేమి సేతుజక్కనయ్యనీ నాసందుమయెక్కడివైరము
ఎట్టకేలకైననిన్నుఁ బట్టినోటఁ బిలువగాను పెట్టుపోతలుడిగినను పట్టిమాటలాడఁగరాద.
నన్నుసంరక్షించుటకు నెన్నరానిబరువదేమి మన్ననచేసి నేఁడు నాకన్నులకెదురై వసించు.
దినముదినమునీచుట్టుదీనుఁడై నేతిరుగఁగాను కనికరమింతైనలేకకఠినమిలాగాయెఁగదర.
సారెసారెకునిను వేఁడి భారకుఁడవనుచునమ్మి కోరి పిలిచితేనునన్నుఁ దేరిచూడవేమిసేతు.
చాలగానమ్మితిరఘుస్వామిభద్రశైలవాసయేలుకొనుమురామదాసునెప్పుడు నేమరకుండ.

చ. ఇటులఁదలంప నాచిరత లేమియు సేయఁగ లేనివయ్యె నా
పటుతరభక్తమానసుని పాండురసాంద్రతరేందుజూటుఁ డే
బటువగుమంత్రరాజము నుపాసన చేసి తరించె నట్టి ది
క్తటపరిపూర్ణమంత్రమును దా భజియించిన జెంద వాపదల్.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

గోపాలరామ భద్రాచల కోదండరామ.
మాపాలఁగలిగితి వాపదఁదొలఁగెను పాపములన్ని పటాపంచలైపోయెగోపాల.
ఏదినీమహిమముందుగజలనిధిలో నీఁదినాఁడవు శంకలేదు నీకింతైనా గోపాల.
సాటిగలరె నీతోపాటివారెరితాఁ బేటివై కొండక్రిందాటలాడినచిన్ని గోపాల.
ముందు హేమాక్షునిగ్రిందుపరచినభూమిక్రిందదూరినగోవిందమురాంతకగోపా.
గానకానితనపుత్రుఁడనకపోరినకనకకశిపునిద్రుంచిచక్కఁగనేలినముద్దు గోపాల.
వడుగవై ధరణిమూఁడడుగులఁదొడిగినబడలికేమనవచ్చుబడుగుబ్రహ్మచారిగోపా.
పావనమూర్తినిపాటివారెవరయ్య రావణకుంభకర్ణాదులద్రుంచిన గోపాల.
రారానీచేతికుఠారముచేతను శూరులనెల్లను శోషింపఁజేసిన గోపాల.
నీమహిమఁగనుఁగొనలేమెన్నటికిసుత్రామవందితబలరామపరాక్రమ గోపాల.
ఉద్ధృతరూప ప్రసిద్ధప్రతాపా మోదితరూప శ్రీబౌద్ధస్వరూపా గోపాల.
రంగైనమేటితురంగము నెక్కి చలంగుదువౌ నీచెలువమేమనవచ్చు గోపాల.
మీసాటిగలరవిలాసమున భద్రాద్రివాసుఁడవై రామదాసునేలినతండ్రిగోపాల.

వ. అని యిట్లని స్తుతిచేయుచున్నారు.

సీ. ఇవ్విధంబున బాధ లెడపక చేయింపఁ బరితాప మొందుచు భాగవతుఁడు
హా రామ హా రామ హా రామ కావవే పరమదయానిధే పాపహరణ
యనివేఁడ నాతనియార్తనాదం బాలకించి యాపదఁ బాప కేశవుండు
కావలివారలఁ గనుఁగొని తానీష గోపనకార్య మేకోలఁది యనిన

తే. ద్రవ్యమియ్యఁగఁ దలఁపునఁ దలఁచఁ డెపుడు
రాముఁ డెవ్వఁడో రక్షించ రాఁగలఁడఁట
పాపములఁ బాప నాతఁడె భారకుఁడఁట
యిటులఁ బల్కును బాధింప నేమియనఁడు.
* అనవిని యాజ్యాహుతిచే వెలిఁగెడియగ్నివలెనుమండి
పెనఁగొని వీఁపున గుండు పెట్టి పురవీథుల ద్రిప్పుకరండి.

వ. ఇవ్విధంబునఁ దానీష చారుల కాజ్ఞయొసఁగిన.

ద్విపద.

రాజాజ్ఞఁ గైకొని రయమున భటులు, భూజనంబులు వినఁ బురిని సాటించి
తడయక జైల్ఖాన తలుపులు దెఱచి, జడుని కైవడి ధరాస్థలిఁ బడియున్న
వాడఱు నేకాంత భక్తాగ్రగణ్యు, జాడఁ దెలియఁగలేక చారు లాఘనుని
యిరుకుసంకిలల నేవర పాదములును, కరములు బంధించి కరుణారహితులు
గ్రక్కుననుక్కుగుం డొక్కటిఁ దెచ్చి, స్రుక్కణంగఁగ భూసురోత్తముశిఖను
బట్టి నేలకు వంచి పదుగురుయెత్తి, పెట్టిన వీఁపున పెనుభారమైన
మోయఁజాలక యోన్న మోరామ యనఁగ, కావలివారలు ఖడ్గములూని
తనయిరుప్రక్కలఁ దరుముచు రాఁగ, ఘనభారమగుటచేఁ గాళ్లువడఁకాడ
భూతలాధిపునాజ్ఞఁ బోరి పౌరిభటులు, నీతిఁదప్పిన యట్టి కూఁతలతోడ
గోల్కొండవీథులఁ గొని త్రిప్పుచుండ, నాల్క యెండఁగ రమానాథుని మదినిఁ
దలపోసి తలపోసి తలయూఁచి యూఁచి, విలపించె నిట్లని విశ్వేశుఁ గూర్చి.

సావేరిరాగము - చాపుతాళము.

వంచనసేయక నన్ను రక్షించుమి వారిజదళలోచనా
స్వామి పంచబాణునిఁగన్న పరమపురుష నాపాలిటి శ్రీరామా వం.
బహుజన్మములెత్తి బాధఁజెందఁగలేను పరమపురుష రామ
నిన్ను పాహి యనివేఁడు భక్తులపాలిటి పారిజాతమ రామ వం.

కొంచపునరులను కొసరి వేఁడఁగ లేను కోరిక దయసేయవే
నాపై యించుకైన నెనరుంచవుగద నేనేమి సేయుదురా వం.
దీనుఁడ నేనని మీనామకీర్తన నూని సేసితి రామ
సన్మానవుంచఁదలఁచు నానేర మెంచకుమనుకులాబ్ధిసోమ వం
ఈతాపత్రయముల నిడుమలఁబడఁజాల నినకులేశ రామ
నాదాతవు భ్రాతవు దైవము నీవని దలఁచియుంటిరామ వం.
రామ భద్రాచల రామదాసునిఁ బ్రోవ రఘుకులాబ్ధిసోమ రామ
సారసనయన నాస్వామివి నీవని సన్నుతించెద రామ వం.

వ. ఓరామభద్రా యీభారము నేను మోయఁజాల నీవే మోయవల
సినదని తా నకర్తయై యిట్లనుచున్నారు.

భైరవిరాగము - ఆదితాళము.

భారములన్నిటికిని నీవేయనుచు నిర్భయుఁడనై యున్నానులే
దారిఁదప్పక నీవు దరిఁజేర్చెదవని ధైర్యముదోఁచిందిలే శ్రీరామ
అతిదుష్కృతములు నేనెన్నో చేసితి అయితే మరేమాయలే
పతితపావనబిరుదువహించినావనిప్రఖ్యాతిఁగొన్నావులే శ్రీరామభా.
ఏరీతినైననే నినునమ్మినాను నన్నేలుకొనుట కీర్తిలే
నేరుపునేరము లెంచిచూచుటకు నే నెంతవాఁడనులే శ్రీరామ భా.
మును నినుజేరి కృతార్థులైనవారి ముచ్చట విన్నానులే
వినివిననట్లున్నా వేమని పలుమారు విన్నవించ నేరలే శ్రీరామ భా.
శరణన్న వారి రక్షణసేయు బిరుదు నిశ్చయమైయున్నాదిలే
మరిపెముగా నన్నిటికినేబట్టింప మునగకొమ్మగాదులే శ్రీరామ భా.
బహువిధములనిన్ను బ్రస్తుతించుమని బ్రహ్మవ్రాసినాఁడు లే
విహితజనములలో నెవ్వఁడోయని వేలుచేయలేవులే శ్రీరామభా.
వాసిగ భద్రాచలేశుఁడవని చాల వర్ణింపుచున్నానులే
భాసురముగ రామదాసునేలునట్టిభాగము గన్నానులే శ్రీరామభా.

వ. ఇవ్విధంబున వీఁపున గుండువెట్టి కాళ్లుసేతులకు సంకెలలు వేసి
పురవీథులం ద్రిప్పుచుండ.

శా. వింతల్జూడఁగవచ్చి పౌరులు బలోద్వేగంబుతోడ న్భటుల్
రంతుల్సేయుచు రాజవీథులను రా రామావనీభర్త శ్రీ

కాంతుఁగ స్వాంతములోనఁ గొల్చునతనిం గారించుటల్జూచి వా
రంతంతఁగ విధిఁ దూర పల్కుచును దుఃఖాక్రాంతులై రందఱున్.
* కొన్ని దినంబులు జరిగినపిమ్మట కుపితహృదయుఁ డగుచు
గ్రన్నన తానిష బంటుల నడిగెను కార్యము లేమనుచు
రాంజీయని యొకసాహుకారు భద్రనగరంబునఁ గలఁడు
కొంజక ద్రవ్యము దెచ్చియిచ్చి నాకొదవఁ దీర్పఁగలఁడు.
అని మాతో గోపన్న సెప్పినన హర్కారులఁజూచి
గోని యిచటికి భూసురునిఁ దెమ్మనిన చని తెచ్చినఁజూచి
ద్రవ్య మెచ్చటను దాఁచితి విప్పుడు దండింతును చెమ్మనినా
అవ్యయాత్మునకు నర్పించితి ధన మైనది కాని మ్మనినా.
కొట్టినఁ దిట్టినఁ గోపగించినను కుయికయి యనఁడితఁడు
పట్టుక గొని చన్ని యెండకునిల్పుఁడు బండమీఁద నేఁడు.
గీ. చిత్తమనుచు భటులు చెచ్చెరఁ గొనిచని
బ్రహ్మకులునిఁ బట్టి బండమీఁద
నిలిపి త్రాళ్ళతోడ నెరికాళ్ళు నేతులు
నంటఁగట్ట డస్సి హరినిఁ దలఁచె.

ముఖారిరాగము - చాపుతాళము.

అయ్యయ్యోనీవంటి అన్యాయదైవము నెయ్యెడఁగాననయ్యా
యియ్యెడనేనుకుయ్యిడిననాలకించ వయ్యయ్యోయేమందునయ్యయోరామయ్య అ.
ఎంతనివేఁడుదు నెంతనిపాడుదు నెంతనిదూఱుదు నేమిసేతురరామ
సుంతైనఁగాని నీయంతరంగము దేమొ వింతాయెఱుగను యెంతోనమ్మినందుకు అ.
శరణన్నజనముల బిరబిరఁబ్రోచేటి బిరుదుగలిగినయట్టి దొరవనినేసీ
మఱుఁగుజొచ్చినందు కరమరఁ జేయుట పరువేకరుణింపఁ బరువేహరిహరి అ.
కామితమందార కలుషవిదూరా తామసమిఁక నేల తాళఁజాలనురా
నీమోముఁజూపుము స్వామిభద్రాచల రామదాసునిఁబ్రేమ రయమున నేలుము అ.
వ. అని మఱల నిట్లని స్తుతిచేయుచున్నారు.

మధ్యమావతిరాగము - అటతాళము.

రామానన్ను బ్రోచితేకారాదా నన్నుఁగన్నసీతా భామామణికైనఁజాలిలేదా
నామీఁదనీకుఁ బ్రేమలేకుండుటమర్యాదా రక్షించేభార మేమైన మీకున్నాదాలేదా
భద్రాచల ధామా సుంతైన నెనరు తలఁపునసుంచుటకాదా రామా.

నీలోనజగములుండుఁగాక జగములలోన లీలతోనీవుందువుగాక యీజాలిచేత
నేలాగుతాళుదునెందాక నన్నుఁబ్రోవలేక యీలాగునుండేవిపరాకా రామా.
నానాటికెంతోసులభానసీవనుపెన్నిధానముదొరికెను మాకుశానా నటులైననిన్ను
మానానాకన్నులయానాపరదైవాలకు మ్రొక్కనాజరగశవచ్చినా నీవాఁడనుగాన రా.
ఈసమయమునరామదాస పోషకచిద్విలాసా భద్రాచలవాసా తెలిసికృపఁజేసి
రక్షించేదిప్రయాస ఆసురదర్పనిరాసా గాసిమాన్పుశ్రీనివాసగావకుండుటిదిబాసా రా.

వ. అని మఱియును నేనోరఘువీరా యని పిలచినపుడు మాఱుపలుకరాదా స్వామీ యనుచున్నారు.

మధ్యమావతిరాగము - ఆదితాళము.

ఓరఘువీరాయనినేఁ బిలిచితె యోహోయనరాదా
సారెకు మఱివేసారి యన్యముచేరదు నామదియేరాధీరా ఓరఘు.
నీటఁజిక్కి కరి మాటికివేసరి నాటకధరనీపాటలఁ బాడఁగ
మేటిమకరితలమీటికాచుదయ యేటికినాపై నేఁటికిరాదో ఓరఘు.
మున్నుసభను నాపన్నతసేయఁగ మిమ్ముఁగృష్ణయనియెన్నఁగ ద్రౌపది
కెన్నొవలువలిచ్చిమన్ననఁ బ్రోచిన వెన్నుఁడ నామొరవిన్నదొలేదొ ఓరఘు.
బంటనైతిననియుంటె పరాకున నంటివిడిచెనిసెముక్కంటివినుత నా
జంటఁబాయకను వెంటరమ్మని వేఁడుకొంటి భద్రగిరిరామదాసపోషక ఓరఘు.

గీ ఇవ్విధంబున రాముని నేకచిత్త
వృత్తిఁ గొల్వఁగఁ భక్తునిబాధఁ బాపె
తన్మయంబున నాతఁడు తనువు మఱచి
చిత్రరూపంబుకైవడిఁ జేష్ట లుడిగి.

శా. సర్వేశు న్స్వహృదయాబ్జమధ్యమున నిష్ఠ న్నిల్పి సంతృప్తహృ
ద్గర్వప్రాభవుఁడై యచంచలమతిన్ కల్యాణు రాముం బరున్
నిర్వాణస్థితిఁ గాంచి సాక్షినిలువ న్నిర్జీవుఁడే యంచు నా
దుర్వారోగ్రులు గోపనా యన నహో దుఃఖార్త రక్షింపుమా.

క. అని రాముఁ బేర్కొనిన నా
తని దేహం బెండ కాకఁ దగులకయుండెన్
గనుఁగొని పారాజనులా
ఘను నడిగిరి యిట్లులనుచుఁ గలుషరహితులై.

*ఎంతటిబాధలు పెట్టిన భయపడ వెవరైనా నీకొఱకుఁ
జింతఁదీర్పఁగాఁ గలిగినవారలఁ జెప్పవలయు మాకు.
అన విని యట్లనె రక్షించుటకై యనఘుఁడు రాముఁడు గలఁడు
అనయము కంటికి ఱెప్పకై వడిని మనలఁ గావఁ గలఁడు.

ఆనందభైరవిరాగము - రూపకతాళము.

రామునివారమూ మాకేమీవిచారము
స్వామి నీదే భారమూ దాశరథే జీవాధారమూ
తెలిసియుం తెలియనేరము మా దేవునిదే యుపకారము
కలఁచినశరీరము మదిఁ బల కాంతురభూరమూ రాము.
ఘోరాంధకారము సంసారమె నిస్సారము
శ్రీరాములయవతారము మదిఁ జింతించుటె సారమూ రాము.
యెంతో విస్తారము ఆ వింతల యొయ్యారము
ఎంతో శృంగారము మా సీతేశునియవతారము రాము.
ఇతరసేవఁ గోరము రఘుపతినే నమ్మినారము
అతిరాజసులఁజేరము మా కతఁడె మందారము రాము.
ఆమహిమ విన్నారము భద్రాద్రినిఁ గనుఁగొన్నారము
రామదాసుల మైనారము మది రంజిల్లుచున్నారము రాము.

వ. ఇట్టివాని వెనుప్రాపు గలిగియుండుటవలన.

మోహనరాగము - చాపుతాళము.

సామాన్యులచెంతఁజేరము రామ నామమంత్రమె మాకు నీమము
సామగానలోలునన్నుతించిన మాకేమి కొదవ సీతారాములె యున్నారు సా.
మూలకారణునిలీలఁదెలియలేని మూఢులైనవారి నొల్లమూ
ఓలలాడుచు రామనామామృతము జిహ్వఁగీలుకొలుపనివారి నొల్లము
వాలాయముగను వారిజాక్షునికథలమే లెఱుఁగనివారి నొల్లము
యేలనితరమైనపాలుమాలినజోలి రామమూర్తిపాదపద్మములె చాలు సా.
ధర్మశూన్యులైనదారుణకర్ముల దరికిఁజేర మే మొల్లము
కర్మాదులచేతఁ గట్టువడినపాపకర్ములైనవారి నొల్లము
నిర్మలుఁడైనట్టి నిగమగోచరు నాత్మ నిలుపలేనివారి నొల్లము
మర్మమెఱిఁగినట్టి మదనజనకుఁడైన ధర్మమూర్తిరామ తారకమే చాలు సా.
తామసంబుచేతఁ దామెపెద్దలమని తత్త్వమెఱుఁగనివారి నొల్లము
కామాదులచేత గర్వమొందియున్న కలుషులైనవారి నొల్లము

నియమకర్మాదివినిష్ఠలేనివారు నీచులైనవారి నొల్లము
రామదాసునేలు రఘుకులాగ్రజునిఁ బ్రేమతో భద్రాద్రిధామునిగొలువని సా.

వ. ఇట్టిదుర్జనులపొత్తు వదలి సద్వృత్తులు గలభక్తులతోఁ జేరియుండుము గావున.

నాదనామక్రియరాగము - చాపుతాళము.

రామునివారమైనాము యితరాదుల గణనసేయము
అమహామహుఁడు సహాయమై విభవముగామమ్ముఁ జేపట్టిగారవించినఁజాలు రా.
యమకింకరుల జంకించేము పూని యమునైన ధిక్కరించెదము
అమరేంద్రవిభవము అదియెంతమాత్రము కమలజునైన లక్ష్యము సేయకున్నాము రా.
గ్రహగతులకు వెఱవఁబోము మాకుఁ గలిగుండుదైవానుగ్రహము
ఇహపరాదులకు మాకిక నెవ్వరడ్డాము మహిమరామబ్రహ్మమంత్రమెపూనియున్నాము.
త్రిభువన దేవదేవుఁడు రామతీర్థాల దైవరాయుఁడు
శుభదాయియై చాల శుభములుదయచేసి విభవముగాఁ బ్రోచి ప్రభుఁడై రక్షించెడి రా.

వ. ఇట్లు చెప్పిన గోపన్నగారిం జూచి భటులు వీరలందఱు కానివారలుగాన నీకైనవాఁడైన యీరాముండు నీకేవిధంబున రక్షకుండయ్యె బంధుత్వం బేమైనగలదా యనిన భక్తాగ్రేసరుఁ డిట్లనుచున్నాఁడు.

ధన్యాసిరాగము - ఆదితాళము.

కోదండరాములు మమ్ము గన్నవారు ధరలో నాదరించి పెంచివిడనాడలేరు కో.
మోదముతోఁగూడుక తమ్మునిజోడు ఖలులు బాధించువేళలో నాకుభక్తితోడు కో.
సీతారామానామమే మాజిహ్వయందు యమునిదూతలబారదోలేటిదొడ్డమందు కో.
పట్టాభిరాములఁజెయ్యిపట్టినాము మేము గట్టిగయమునికి నామము పెట్టినాము కో.
ప్రేమతో భద్రగిరీశరావదేమి రామ దాసునిరక్షింపవేగరామస్వామి కో.

వ. ఇవ్విధంబున రామునకును తనకునుగల బంధుత్వం బెఱుకపఱచి రామదాసుగారు మరల భటులఁజూచి యిట్లనుచున్నారు.

గీ. తాను బ్రదికినదినములఁ దథ్యముగను, రామచంద్రుని సర్వశరణ్యుఁ గొలిచి
పూర్వకర్మంబు లెల్లను బుచ్చివైచి, ధీరుఁడై భక్తిసలిపినదినమె దినము.

వ. అని యిట్లనుచున్నారు.

శ్లో. యద్దినం హరిసల్లాపకథాపీయూషవర్జితమ్,
తద్దినం దుర్దినం మన్యే మేఘచ్ఛన్నం న దుర్దినమ్.

వ. అనెడు నీశ్లోకముయొక్క ఫలీభూతార్థ మేమనిన, హరిని గీర్త నము సేయుదినమే సుదిన మగుటవలన.

కాఫిరాగము - చాపుతాళము.

దినమే సుదినమూ రామునిఁగొల్చు దినమే సుదినము
ఘనమైనభక్తిచేఁ బెనఁగొని యేవేళ మనమున శ్రీరామునిఁ జింతించిన దిన.
రంగుగనట్టి మృదంగతాళములు చెలంగఁదంబురశ్రుతి సంగతిఁబొగడు దిన.
భక్తులతో ననురక్తినిగూడుక భక్తిమీఱఁగను భక్తవత్సలుఁ బొగడు దిన.
రారా నన్నుఁగైకోరా శెరనమ్మినారా నిను విడలేరా యనివేఁడు దిన.
దీనశరణ్యా మహానుభావ యో గానలోలనన్నుఁ గరుణించుమని కొల్చు దిన.
వాసిగ శ్రీహరిదాసులగూడుక వేసుకగంతులు వాసుదేవునిఁ బాడు దిన.
కరమువెలుంగుబంగరుపుష్పములచేత ధర భద్రగిరిరామదాసుఁడుపూజించు దిన.

ఉ. కావున సార్వకాల మవికారు భజించినఁ గామితార్థముల్
జేవఁదలిర్పఁగా నొసఁగి చెచ్చెరఁ బాపు మహాదవాళి నా
భావముఁ గాంచి మీరలు కృపాకరు రాముని రామరామ శ్రీ
భావితరక్ష మా మనుచుఁ బట్టుగఁ గొల్వఁ దలంపుఁబూనరే.

వ. ఏలననియెద రేలనేలె గోపాలబాలుం డాలస్త్రీల గిరినేలఁ గేల నెత్తి యాలోచనలేల బాలబుద్ధిచాలుం జాలు జాలమేల మేలుగలుగు గానలోలయని ఫలంబులం దలంపులంగొనక యిటులఁ దలంపుఁడు.

* ఉ. తప్పు లెఱుంగలేక దురితంబులు సేసితినంటి నీవు మా
యప్పవు గావుమంటి నిఁక నన్యులకున్ నుదు రంటనంటి నీ
కొప్పిదమైన దాసజను లొప్పిన బంటుకు బంటనంటి నా
తప్పుల కెల్ల నీవె గతి దాశరథీ కరుణాపయోనిధీ.

బిలహరిరాగము - ఏకతాళము.

రామని న్నెనమ్మితినిప్పుడు రవ్వపాలుసేయక రక్షించుమిఁకనూ
సామగానలోలా మీసముఖమందుమిమ్మే సన్నుతిసేయలేనుగా
సాకేతవాసా కామజనక నాకన్నులనిండారఁ బ్రేమమీఱ నీ మోముజూపరా రా.
అపరాధము లెన్నేని యలవిగాక చేసితిని కోపగించవద్దూ కోదండరామా
కాపానుగ్రహశక్తిమీవద్ద నపారమైయున్నది అయోధ్యవాసా
పాపాత్ముదినన్ను కాపాడుమిరామ చేపట్టుమి మీచెంతజేరితిని రా.

---

* దాశరథీశతకమున దీనియర్థము గలదు.

పరసతులందు బుద్ధి పట్టుగానియ్యక నీ పరసజ్ఞానమె తెల్పుమీ సంగీతలోలా
సరసిజనుతనీ సమాను లెవ్వరు నరసిచూచినలేదుగా అయోధ్యవాసా
అరమరసేయక పరమహర్షమున కరివరుఁగాచిన కనకాంబరధర రా.
నీదయను దప్పలేదునా హృదయమందే తారకము వెదచల్లవలెఁగాక వేదాంత వేద్య
ముదముతో శ్రీభద్రాద్రిసదయ రామదాసుఁడను వదలకనన్నేలుమీ వారిధిశయనా
వడవడవణఁకుచు ముదిమి హెచ్చునా మదినిల్పుము నీమృదుపదములయందు రా.

గీ. జిహ్వగలఫలంబు శ్రీకృష్ణుఁ బొగడుండు, తనువుగలఫలం బతనిఁగొలుండు
శిరముగలఫలంబు సిరివరునకుమ్రొక్కుఁ, డాత్మగలఫలంబు హరిఁదలఁపుఁడు.

వ. ఎట్లనిన.

కాఫిరాగము - ఆదితాళము.

ఏమయ్యా రామ యేమయ్యా
యేమయ్యాభద్రగిరీశపాలకా స్వామి మాకుసుప్రసన్నులేకాక
యీమొరఁబెట్టేది యిఁకనుయెందాక యేమిదయఁజూచిన నిప్పుడె కాక యే.
కరిమొరవిని జీవగణములు రారా పరతంత్రులై సిగ్గుపడి మళ్ళిపోరా
అరసిచూచినమీరు సాధ్యులుగారా యిరవొందమముఁబ్రోవ నితరులున్నారా యే.
గత్యంతరము మీరెకాకలనైనా ప్రత్యక్షముగాకున్న బలిమిఁజేసెనా
నిత్యము మీకీర్తనము మరచేనా అత్యంతభయభక్తులమరకున్నానా యే.
ఇతరచింతమదినెఱుఁగను నేను హితవు ప్రసాదించేవని నమ్మినాను
మతిఁజక్కఁజేయుమేమరువాఁడఁగాను పతిసేవేయని దృఢవ్రతుఁడనైనాను యే.
దూరితినని నాతోనలుకా గారవించితేనే బంగారుపలుకా
ఈరీతియమృతము లింతింతఁజిలుకా రా రామయ్య ముందర ముద్దుగులుకా యే.
నన్నాదరించేది న్యాయముగాదా నిన్నునమ్మియుంట నీమదిలేదా
మన్నింప నీయభిమానమేకాదా కన్నతండ్రి బిడ్డలఁ గడతేర్చరాదా యే.
వద్దువద్దనఁగానే వచ్చెనేముదిమి వర్ధి దురితములవలసిపోగడిమి
తద్దయుందయఁదాపత్రయములఁజిదిమి దిద్దుమీ చిత్తవృత్తికి రాకున్ననుమీ యే.
మామీఁదనుంచిన మముఁదాఁకుఫలము మామొరాలకించ మీకదిఘనము
యీమేనమిముఁగన్న నీడేరుఫలము మోముఁజూపిన నాయమునిగెల్వఁగలము యే.
శ్రోత్రలేమైన యెక్కువలాడేనా భక్తిలేనిచోటబలిమిఁజేసేనా
మత్తుఁడనై మిమ్ముమరచియున్నానా సత్తుపగదాఁచి వంచనజేసేనా యే.
ఘనుపరచి మీపాదభక్తినిమ్మీఁదను యాదియుంచిమీదయతోఁజూడుమీ
కనుఁగొనవలెఁ బ్రత్యక్షముగానేమీ చనువీయవయ్యా విజయరామస్వామీ యే.
కరణత్రయమునందు గతినీవెకావా పరగనీపట్లను భక్తులఁబ్రోవా
గుఱుతుమీఱఁగ భద్రగిరి నుండుదేవా స్థిరరామదాసపోషకుఁ డనఁదగవా యే.

వ. రక్షకుండుగాఁ డనుశంకచే నుపేక్షింపక మోక్షాసక్తి నాలక్ష్మీపతి యక్షీణవిభవంబులవేక్షం ద్రౌపదీమానరక్షా పాండవపక్షా యార్తజనసంరక్షా యని మొరలిడుండు. పక్షముంచు పక్షివాహనుండు.

గీ. తన్ను నెంగిలిడిన దనపేరువినకున్న, దొంగిలింప రోలితోడఁ గట్టఁ
ప్రేమమెచ్చుశౌరివినుతిఁ జేసినశరణన్నఁగాచు టేమి యద్భుతంబు.

వ. అని తనకావలిజనంబు లనువున మననంబుఁజేయ రామనామంబును దన్మాహాత్మ్యంబును నుడువుచు నానందనృత్యంబు సలుపుచు మైమఱచి చిత్తంబు రామునందుఁ గీలించి యానందజలంబు నేత్రంబులం జిప్పిల లెప్పలనొప్పుగా నప్పళించుచు నుప్పతిల్లిన భక్తిరసంబున నిట్లని స్తుతియించెను.

సారంగరాగము - చాపుతాళము.

రామయిదేమిర రాజసమా రఘు రామపరాకుగారాదుసుమా
నీమదికఱఁగించ నేనెంతవాఁడను నామొరాలకించి నీమహిమఁజూపవు రామ.
వేఁడిన వేయిమార్లు కేమనవు మమ్ము వేఁచేవుమామీఁదిజోలెన్నవు
నాఁడైతే విభీషణాదులేమిచ్చిరో నేఁడు నాదుమొర నీకు వినలేదో రామ.
కన్నదికానుపుకాదనకు ఆపన్నులఁ బ్రోచుటలేదనకు
యెన్నెన్నిజన్మాదులెత్తఁబాలుపడునో నన్ను రక్షించకయున్నదినీకబ్బ రామ.
ఔరామఅందుల కపరాధమా చేసినందుకు నాపై యనాదరమా
కూరిమిలోనీదుగురిజూచెదనంటె చేరిదగ్గఱ దయజేసితీయరెవరు రామ.
స్వామిభద్రాచలవాసుఁడవు మిమ్ముఁగామించితే కోర్కెలీఁజూడవు
రామతారకమంత్ర రామభజనసేతు రామదాసుఁడనని రక్షించువేగమె రామ.

వ. ఇట్లు స్తుతిచేయుచు.

గీ. తన్మయతనొందెఱుంగక తన్నుమఱచి, మరలఁదెలివొందిభటులతోమందలించెఁ
గ్రోలి చవిఁజూడరయ్య సద్గుణసమృద్ధి, నమరి చవిగల్గురామనామామృతంబు.

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

ఓరామ నీనామమేమిరుచిరా రామ శ్రీరామ నీనామమేమిరుచిరా
మధురసములకంటె దధిఘృతములకంటె మధురసమగు నామమేమిరుచిరా ఓ.
ద్రాక్షఫలముకన్న నిక్షురసముకన్న పక్షివాహన నీనామమేమిరుచిరా ఓ.
అంజనీతనయుం హృత్కంజతలమునందు రంజిల్లు నీనామమేమిరుచిరా ఓ.
సదాశివుఁడు మదిసదాభజించెడి సదానందనామ మేమిరుచిరా ఓ.

సారములేని సంసారమునకు సంతారకమగు నామమేమిరుచిరా ఓ.
శరణన్న జనముల సరగునరక్షించే బిరుదుగల్గిన నామమేమిరుచిరా ఓ.
తుంబురునారదులు డంబుమీఱంగ గానంబుఁజేసెడి నామమేమిరుచిరా ఓ.
రామా భద్రాచలధామా రామదాసునిఁబ్రేమ నేలిననామమేమిర్చుచిరా ఓ.

గీ. అనుచు సంసారతారకంబైనరామ, నామమాహాత్మ్య మెఱఁగింపనమ్రులగుచు
భక్తుఁడనియెంచవారిలోఁ పాపయుతులు, గొందఱా మోడ మొందకకువేతులగుచు.
*రాజద్రోహముఁ జేసినవారల రాముఁ డెట్లు బ్రోచు
యోచనలేక నీమాటలనమ్ముట యుక్తము కాదనుచు.
అని వేగంబున నాస్థానంబున కరుగుదెంచి యిట్లనిరి
మనవివినుఁడు గోపన్న ద్రవ్యమును మనకు నివ్వఁడనిరి.
విసుకుఁజెంది తానీష కోపమున వీరభటుల కిట్లనియెఁ
వెసకత్తుల కెరచేయుఁడు బాపనిఁ జాలుచాలు పదమనియెన్.

ద్వి ప ద.

ఆజ్ఞగైకొనివార లాగ్రహంబునను, ప్రాజ్ఞతలేకయ బ్రాహ్మణోత్తముని
కఠినాత్ములగుచు ముష్కలొప్పఁగట్టి, శఠగోపునిర్మలు శాంతు శ్రీరామ
దాసునిఁగొలఁజేయుస్థలమునకపుడు, గాసిబెట్టుచుఁజుట్టు గగ్గోలుగాఁగ
విచ్చుకత్తులుపట్టి వెసఁగొనిపోవ, పచ్చితురకలనడుమ బ్రహ్మకులుండు
మర్కటంబులచేత మడియంగఁజిక్కు, కరోర్కటకులవలె కడుపడిఁజిక్కి
దిక్కుగానక పలుదీనతతోడఁ, గ్రుక్కిళ్లు మ్రింగుచుఁ గుందుచువెతల
చక్కనినాసామి సామజవరద, మక్కువఁజూడరా మన్మథజనక
శృంగారమానీకు సీతాకళత్ర, బంగారుతండ్రి పాపాత్ముఁడగాన
నీపాట్లుగలిగె నీవేమిసేయుదువు, కాపాడుభారము కాకుత్స్థతిలక
నీయందుఁగలదని నెఱనమ్మినాఁడ, నాయంద మీచంద మాయెనోయయ్య
పంకజనాభ నాపాలిసర్వేశ, యింక నెన్నఁడు ప్రోవ నెంచితో యెఱుఁగ.

బిలహరిరాగము - చాపుతాళము.

రావయ్య భద్రాచలరామా శ్రీరామ రమణీయ జగదభిరామ లలామ.
కేవలముగభక్తి శ్రీవిలసిల్లఁగ భావముదెలిసిన దేవుఁడవైతె రా.
ప్రొద్దు ప్రొద్దున నిన్నుఁబొగడుచునెల్లపుడు పద్దుమీరగాను భజనఁజేసేను
గద్దరితనమునఁ బ్రొద్దులఁబుచ్చుచు ముద్దులుకులుగుచు మునుపటివలెనిటు రా.
నాకన్నతండ్రీ నామదిలోనా నీకన్ననితరుల నేగొలిచేనా
శ్రీకరదివ్యప్రభాకరకులరత్నాకరపూర్ణ సుధాకరతేజ రా.

అంజలిసేయునినరమరలేని అడియేని నీవు కటాక్షముంచూని
ముజ్జగములకును ముదమిడుపదముల గజ్జలుగదలఁగ ఘల్లుఘల్లుమన రా.
దోసములెంచని దొరవనినీకు దోసిలియొగ్గితి దొలుతపరాకు
దాసరితప్పులు దండముతోఁ దీర మీసముగలిగినరోసరిహైతే రా.

కాంభోజిరాగము - ఆదితాళము.

ఇక్ష్వాకుకులచంద్ర యిట్టులుండుట మేర రామచంద్రా
నన్ను రక్షింపఁజూడవు రాజీవదళనేత్ర రామచంద్రా.
గోవిందుఁడనినీకు గోపురమెత్తితి రామచంద్రా
మదిని భావింప గోపురము పదివేలవరహాలు రామచంద్రా.
ప్రాకారములుమూఁడు పటిమతోఁగట్టితి రామచంద్రా
ఆ ప్రాకారమొకటికిఁ బదివేలవరహాలు రామచంద్రా.
గరుడధ్వజుఁడవని గరుడస్తంభముఁ జేయ రామచంద్రా
నాకుఁ బరువడి పదివేలవరహాలు సెలవాయె రామచంద్రా.
మామనోహరనీకు మకుటముఁజేయింప రామచంద్రా
రామస్వామీ పదివేలవరహాలు పట్టెను రామచంద్రా.
పాలింతువనినీకు పాలకిఁజేయింప రామచంద్రా
నాకు ఫలమేమి పదివేలవరహాలు సెలవాయె రామచంద్రా.
ఆభరణములనెల్ల నానాఁడెచేసితి రామచంద్రా
రామ ఆభరణ మొకటికి నార్వేలవరహాలు రామచంద్రా.
రథముఁ జేయించితి రాజరాజకుల రామచంద్రా
ఆ రథముగుంజుకపోయెఁ బదివేలవరహాలు రామచంద్రా.
సీతాదేవికి శృంగారగాత్రికి రామచంద్రా
లోకమాతకుఁ జేయిస్తి మకుటాంగదాదులు రామచంద్రా.
నీతమ్ములకునగలు నీతోఁబాటుగఁజేస్తి రామచంద్రా
యిం దేతప్పునకుఁగాను యీశిక్షఁజేయుట రామచంద్రా.
వాహనముల దగు వైఖరిఁ జేసితి రామచంద్రా.
జగన్మోహనదాసుని మోహమైనఁజూడవు రామచంద్రా.
దశరథుఁడదయుఁడై తరిమె రాజ్యము వెడల రామచంద్రా.
నీదెసఁజూడక మిథిలేశుఁ డూరకుండె రామచంద్రా.

ఇంతసౌమ్యుదిని యటులూరకున్నావు రామచంద్రా
హా యెంతవింతాయెను యెవరబ్బసొమ్మురా రామచంద్రా.
సర్వలోకశరణ్యా సర్వపూజిత శ్రీరామచంద్రా
నా దుర్వారదుఃఖము తుదముట్టదాయెను రామచంద్రా.
కుటిలాత్ముఁడై నీవు కులుకుచుఁదిరిగేవు రామచంద్రా
హా కటకటా యీపాపకర్ముని గతియేమి రామచంద్రా.
తిట్టితినని రామ పట్టుఁబట్టఁబోకు రామచంద్రా
నన్నుఁ గొట్టించితిరిగాన కోరిప్రార్థించెద రామచంద్రా.
తురకపైకము దెచ్చి త్వరలోఁ జెల్లించవె రామచంద్రా
ఓ పరమాత్మ యీయప్పు భారమేమోనీకు రామచంద్రా.
స్వామిభద్రశైల రామసద్గుణధామ రామచంద్రా
శ్రీ రామదాసునిఁ బ్రోవ రావయ్య వేగమె రామచంద్రా ఇక్ష్వాకు.

వ. మఱియు నేమని మొరఁబెట్టుచున్నారు.

యదుకులకాంభోజిరాగము - ఆదితాళము.

పాహిమాం శ్రీరామాయంటె పలుకవైతివి నీస్నేహమెట్టిదనిసెప్ప
వోహోహోహోహోహోహో పాహి.

ఇబ్బందినొంది యాకరి బొబ్బబెట్టినంతలోనె గొబ్బునగాచితివఁట
జబ్బుసేయక నిబ్బరముగానేనెంతో కబ్బమిచ్చి వేఁడుకొన్న
తబ్బిబ్బుఁజేసేవురామా అబ్బబ్బబ్బబ్బబ్బబ్బబ్బా పాహి.
సన్నుతించేవారికెల్లా మున్నుదయతోఁ బ్రోచితివని
పన్నగశాయి నేవిని విన్నవించితి విన్నపమువినకయెంతో
కన్నడఁజేసేవురామ యెన్నటికినమ్మరాదు రన్నన్నన్నన్నన్నన్నన్నా పాహి.
చయ్యనభద్రాద్రినిలయ స్వామివనినమ్మినేను
వేయాఱువిధముల వినుతిసేయసాగితి
యియ్యెడను రామదాసుని కుయ్యాలించి ప్రోవకున్న
నీయొయ్యారమేమనవచ్చు నయ్యయ్యయ్యయ్యయ్యయ్యయ్యా పాహి.

రాగము - యదుకులకాంభోజి - ఏకతాళము.

ఎన్నఁడు రక్షింతువనియున్నావోరామా
యెన్నతరముగాని యాపన్నుఁడనైయున్నన ఎన్న.
తరముగాని యిటువంటి దైన్యసాగరములోన

వెలుపుమాలినే నందందేతిరిగితి నీలాగే
పరిగానక వేసారి తారిసీ వేగతియని దురితభవన
నిన్ను గురివేసుకొనియున్న న శ్రీ.
జ్ఞానముచాలక నేసజ్ఞాన పరవశుఁడనై
పూనినాకర్మముల ననుభవించినాఁడా
దీనుఁడని నీదయయుంచి దిక్కయ్యేవానీవన శ్రీ.
కొద్దివారికెల్లఁ జేరికొలువ నాకేలచనువు
కద్దుర రామదాసాయని గారవించి నాపద్దు
నీడేర్చుటందుకు చేపట్టి రక్షించవలెగాక
ముద్దుగాభద్రాద్రీశుఁడవనియే ప్రొద్దుఁ బొగడుచున్నన శ్రీ.

వ. ఇవ్విధంబున దాసుండు మొరలిడిన నుపకరింపక నామొరకులు కొలజేయుస్థలంబునకుం గొనిచని యచ్చట గూర్చుండం బెట్టి పట్టాకత్తులం దూసి ఝళిపించుసమయంబున రామదాసు నిశ్చలచిత్తుండై రామునిం బేర్కొనె నెట్లనిన.

కాఫిరాగము - ఆదితాళము.

చరణములేనమ్మితి నీదివ్యచరణములేనమ్మితి
వారధిఁగట్టిన పరభద్రాచల వరదా వరదా వరదా నీదివ్య చరణము.
ఆదిశేష నన్నరమరసేయకు మయ్యా అయ్యా అయ్యా నీదివ్య చరణము.
వనమునతాతిని వనితఁగఁజేసిన చరణము చరణము చరణము నీదివ్య చరణము.
పాదారవిందమె యాధారమని నేను పడితీ పడితీ పడితీ నీదివ్య చరణము.
వెయ్యాఱువిధముల కుయ్యాలించిరావయ్యా అయ్యా అయ్యా నీదివ్య చరణము.
బాగుగనన్నేలు భద్రాచలరామ దాసుఁడ దాసుఁడ దాసుఁడ నీదివ్య చరణము.

సౌరాష్ట్రరాగము - ఆదితాళము.

రామనిన్నేనమ్మినానయ్య నన్నురక్షింప సమయమిదేనయ్య
అక్షీణకరుణాకటాక్షముచే నాదుపక్షమైయుండుము పేక్ష సేయకుమయ్య రామ.
శరణన్న మోమెత్తి చూడవు కాపాడె బిరుదుకలవాఁడవు
కరిరాజుబాధచే మొరలిడనాలించి వెలువకుమనిదానిఁ గరుణించినస్వామి రామ.
ఆపన్నుఁడనేనంటిఁగామాకు బ్రాపుమీకన్న లేరంటిఁగా
పాపాత్ములు చేరి పైపుట్టములొలువ ద్రౌపదియాపదఁ బాపినట్టిస్వామి రామ.
బాలకముమిము నుతియింపుచు నున్న సుతునిఁజూచి కోపింపుచు
దితిసందనుఁడు తనసుతునిఁ జంపఁజూడ నలివేగమున వానినాదరించినస్వామి రామ.
మీసేవమాకీవేళను వలయుఁజేసితె మాకంతెచాలును

. వాసిగభద్రగిరీశుఁడవై రామదాసుని నేలినట్టిదశరథనందన రామని న్నేనమ్మి.

గీ. రామచంద్రుని మది నిల్పి రామకీర్తనంబుఁ జేయుచునుండఁ గోపంబులోఁడ
భటులు విసరుచు కత్తులు భాగవతునిఁ, దీర నీవింతలెల్ల నీదినమె యనుచు.

వ. ఇట్లు కత్తులవిసరినప్పుడు భద్రాద్రినిలయుని హృత్పద్మంబున నిలిపి యిట్లనుచున్నారు.

ధన్యాసిరాగము - ఆదితాళము.

ఎంతయెంతకుమందలింతునే నయ్యయ్యో పంతగించేవుస్వామి పట్టాభిరామ.
వింతవాఁడగాను విడనాడకుమినన్ను
భ్రాంతిఁదీరమదిశాంతిఁజెంది విశ్రాంతినొందకను చింతఁదీర దిఁక యెంత.
ఏలుకొన్నవాఁడవూ మమ్మేలదయఁజూడవు తాళిరక్షింతునని దండమాటాడవు
యీలాగునున్నందుకు యేలాగుతాళకొందు
పాలముంచుమటి నీళ్లముంచు మాపాలిరామ భూపాలతిలక యిఁక యెంత.
నిన్నేనమ్మినారము నీవారమైనారము సన్నుతించనేరము
స్వామినీదేభారము ఆమాటకేమిగాని ఆమీఁదనెయిత్తుఁగాని
యేమరించి యముఁడేమిచేసునో జాముజామునకు మోముఁజూపుమిఁక యెంత.
పావనాద్రినాయకా భక్తిఫలదాయకా
దేవాదిదేవదివ్య భవ్యసత్యనాయకా రావేమహానుభావ రామదాసునిఁ బ్రోవ
వేవురించితిని గావరించితి సంతరించమని తీవరించితిని యెంత.

వ. అని మటి న్నేమనుచున్నారు.

ముఖారిరాగము - ఆదితాళము.

రామరామ నీవేగతి సంరక్షణంబుసేయ
యేమనందు హాదైవమ నీమనసింకఁ దరుగదాయె.
పుడమిలోన నావంటిదురాత్ముఁడు పుట్టఁ డింకనంటి
విడువఁబోకుమయ్యా యని మున్నే విన్నవించుకొంటి.
ఎన్నివిధంబుల బిలిచినఁ బలుకవు యే మదృష్టమందు
నెన్నరాని వైవస్వతవేదన కెట్లు తాళుకొందు.
స్వామియుమటయ్యా మ్రొక్కఁగ నామొర లాలకించిరావు
శ్రీయుతముగ నినునమ్మిన దాసులకోర్కె లొసఁగినావు.

స్వామి నేను నీవాఁడను సాయొడఁ జలము సేయకయ్యా
ప్రేమఁదీర నినుకనుఁగొనియాడెద మోముఁ జూపవయ్యా.
నేమమొప్ప భద్రాచలమందిర నిన్ను నమ్మలేదా
ప్రేమఁజూచి నీబంటుగ శ్రీరామదాసు నేలరాదా. రామ.

వ. ఇవ్విధంబున రాముని హృత్కమల కర్ణికాంతర్వర్తిగా ధ్యానిం పుచుండ నాభక్తాగ్రగణ్యుని దేహంబు

గీ. వాలు సమ్మెట్లఁగొర్చిన వజ్రమనఁగ, కాకలకు వన్నె కెక్కిన కనకమనఁగ
రాహువితతికిఁ జెరలనిరాజనంగ, తన్నుఁ జేయించు బాధలఁ దలఁకఁడయ్యె.

వ. అప్పుడు రామదాసుగారిది రామానుగ్రహంబని రాముని తారకనాముని భండనభీముని సద్గుణధాముని నెమ్మనంబున నిల్పి స్తుతిఁ జేయుచున్నారు.

జంఝూటిరాగము - ఏకతాళము.

రామసీతారామ రఘురామ జయరామా
రామ నామనవినివిని యేమంటివి రామా రామ.
అపరాధిని నెపమెన్నక కృపఁజూడుము రామా
జపతపములు చేసీగతి నుపమెఱుఁగను రామా రామ.
పాపాత్ముఁడ బహుబాధల పాలైతినిరామ
యేపారఁగఁ జెనుభూతము దాఁపాయెను రామా రామ.
కావరమునఁ బరస్త్రీలను కనుఁగొంటినిరామ
యేవిధమున దుష్కర్మము లెడఁబాపెదొరామా రామ.
ఇలసౌఖ్యం బధికంబని యెంచితిరా రామా
కలకాలం బొకరీతిని గడుపవుగదరామా రామ.
అనుదినమును నిను నెమ్మనమునఁ గనుఁగొంటినిరామా
ఘనకోపిని బహుపాపిని మనఁజాలను రామా రామ.
సురవందిత భద్రాచల వరనిలయుఁడరామా
కరుణగలిగి శ్రీరామదాసునిఁ గరుణించవేరామా రామ.

సీ. ఇవ్విధంబునఁగ త్తినువ్వొత్తుగొనక, భజన సేయఁగ నాతనిపటిమఁగాంచి
చింత చేయుచుండి తానీష సేవకులకుఁ, జెప్పెగారాగృహంబునఁ జేర్చుమనుచు
*కటిక చీఁకటులు గ్రమ్ముచునుండెడి కారాగృహమునను
కుటిలాత్ములు గోపన్నను వేసిరి ఘోరము గనుఁగొనను.

వ. ఇవ్విధంబున బాధలఁబరిచి ఫలంబులంగానక విఫలులై కారాగృహంబున వేసినఁ బదియు రెండేఁడులు నల్లులచే దోమలచే దేహంబు పీడం బొందుచుండినను తారకనాముండగు రామునిఁగూర్చి కబ్బంబులు నిబ్బరంబున చేయుచు స్తుతియింపుచు నాడుచు బాడుచు నుండె నెట్లన్నను.

ఆనందభైరవిరాగము - అటతాళము.

ఎటుఁబోతివో రామ యెటుబోతివో
యెటుఁబోతివో నిను నేవేఁడుకొనుచునుంటే
కటకటా నేఁడునా కనులఁజూతామంటె — ఎటు.

అంధకారమువంటి బందిఖానాలోనున్న
నిందలుయెడఁబాపు నీకు మ్రొక్కెనుస్వామి — ఎటు.

పాపములన్నియెడఁ బాపేటిదొరవునీవు
ఆపదఁదీర్చినన్నాదుకొమ్మంటిస్వామి — ఎటు.

తానీషగారువచ్చి తరితీపుఁజేస్తున్నారు
పైకముఁబంపించివేగ బందీఖానావదలించక — ఎటు.

అపరాధిననిచాల నతిఁజేసి మొరలిడఁగ
వెనుకటి నేరముల నెపముగ నెంచగ — ఎటు.

అప్పులవారువచ్చి యరిగట్టుచున్నారు
ఒప్పుకోఁబడుననిచెప్పక డాఁగున్నావేమొ — ఎటు.

నీవుభద్రాచల నిలయుఁడవై వేగఁ
బ్రోవవయ్యరామదాసు నేలెడిస్వామి — ఎటు.

మ. హరినారాయణ వాసుదేవ మధుదైత్యారీ బలిధ్వంసి వి
ష్టరకర్ణా గరుడధ్వజా మురహరా చక్రీ హృషీకేశ శౌ
రి రమానాథ వసుంధరారమణ శార్ఙ్గి కేశవా యచ్యుతా
సరసీజాక్ష జనార్దనా యనుచు నాసర్వేశు వాక్రుచ్చెదన్.

వ. అని యిట్లనుచున్నారు.

శంకరాభరణరాగము - రూపకతాళము.

తగునయ్య దశరథరామచంద్ర దయదలఁచవేమీ
నీకు దగవాఁడనా రొంటితో బరిమాలినఁగాని కల్కవేమీ — తగు.

నగుమోముఁ జూపరా నాయన్న నినుఁ జాలనమ్మినాను
యింత అగడుగఁ జూచితె ఆవలయెవరిపాలయ్యనేను తగు.
పతితులకెల్ల పావనులఁ జేయుదునని పలుక నేల
యిప్పు డతిఘోరఖలులమనుచు మమ్ము విడనాడ నేల తగు.
అన్నన్న కానరాకున్నావు ఓరామ నిన్ను మానా
నేనిక్కెన్ని గానిపరుల నెన్నఁబోను నా కన్నులానా తగు.
పడపడిమిముఁ జేరఁబడినవారలనుఁ జేపట్టలేదా
నన్ను వదలితె మీవంటి వారికీ యపకీర్తివాదు గాదా తగు.
అనుదినము భద్రాద్రిధాముఁడవని నిన్నరసినాను
నేను వినయముతో రామదాసుఁడనని విన్నవించినాను తగు.

వ. ఇవ్విధంబున నన్ను సంరక్షింప రమ్మని పరమకరుణారసంబున రామునిం బేర్కొని నిన్ను వర్ణింపఁ బ్రహ్మాదాదులకుఁ దరంబుగాదు నే నెంతవాఁడను స్వామీ యని సంకీర్తనముఁ జేయుచున్నారు.

* ఉ. తప్పు లెఱుంగలేక దురితంబులు నేసితినంటి నీవు మా
యప్పవు గావుమంటి నిఁక నన్యులకున్న దురంటనంటి నీ
కొప్పిదమైనదాసజను లొప్పిన బంటుకుబంటనంటి నా
తప్పులకెల్ల నీవె గతి దాశరథీ కరుణాపయోనిధీ.

ముఖారిరాగము - ఆదితాళము.

ఏదయా నామీఁదయాదిలేదయా రాకుంటెనీదయా
నేఁజేసేదేమున్నాదయో కోదండపాణి యే.
మీరునాదైవమనినమ్మితి ఆమాట సారెసారెకు విన్నవించి వేసారితీ
రక్షించే భారకుండవని నిన్నెదూరితి మీప్రాపే కోరితీ
మీచరణాబ్జములె చేరితీ కోదండరామా యే.
ఎంచితి నీమహిమలువర్ణించితీ అయ్యయ్యో అకించనుఁడనని విన్నవించితీ
నేఁడేరేపంచుబహుకాలము వెళ్లించితీ నీలిరువుళ్ల మెంచితీ
నీకరుణకాసించితీ కోదండరామా యే.
వేసరా కెదురెదురే చూచితీ దాసానుదాసనుసంగతి జేరితి
భద్రాద్రివాసుఁడ నేననితలపోసితీ వే రామదాసుఁ డనని నేగంతులు వేసితీ
కోదండరామా యేదయానామీఁదయాదిలేదయా యే.

వ. ఏమయ్యా భద్రాచలనిలయా యెల్లప్పుడు నిన్ను నమ్మి భజియింతునుగాన నన్ను రక్షింపవయ్యా యనుచున్నారు.

---

* దీనియర్థము మాదాశరథిశతకములోఁ జూడనగు.

ఉ. శ్రీయుత జానకీరమణ చిన్మయరూప రమేశ రామ నా
రాయణ పాహి పాహి యని ప్రస్తుతిఁ జేసెద నామనంబున
న్నాయక కిల్బిషవ్రజవిపాటన మందఁగఁ జేసి సత్కృపా
దాయిఫలంబు నాకియవె దాశరథీ కరుణాపయోనిధీ.

ఆహిరిరాగము - ఆదితాళము.

రామరారా భద్రాచల ధామరారా
రామరార నీమోమిపుడె ప్రేమఁదీరఁజూతుగానీ
తామసమువలదు రామస్వామి తాళఁజాలనిఁకను. రామ.
ఎన్నఁడు నేనినెన్నినమ్మియున్నవాఁడనని యెంచి
కన్నులెత్తిచూచి నన్నుమన్ననతోఁ బ్రోవరార రామ.
మాటిమాటికి నీతోటి సాటివేల్పులులేరని
చాటుచున్ననన్ను నీవీపాటులబెట్ట నేటగునటరా రామ.
భద్రగిరిరామదాస పాలకుఁడవై నీవేల
ఛిద్రములెల్లఁదొలఁగించి భద్రముగా నన్నేలవేల రామ.

వ. అహో భద్రాద్రీశ్వరా యెన్నివిధంబులఁ బిలచినఁ బలుకవు నేను నిరుపాధికుఁడను గాన రక్షింపు మనుచున్నారు.

ఆనందభైరవిరాగము - రూపకతాళము.

పలుకే బంగారమాయెనా కోదండపాణి పలుకే బంగారమాయెనా.
పలుకే బంగారమాయె పిలచినఁ బలుకవేమి
కలలో నీనామస్మరణ మరువ చక్కనితండ్రి పలుకే.
ఇరవుగ నిసుకలోనఁ బొరలిన యుడుతభక్తికి
కరుణించి ప్రోచితివని నెరనమ్మితి నిన్నే తండ్రి పలుకే.
రాతినాతిగఁ జేసి భూతలమునఁ బ్ర
ఖ్యాతిఁ జెందితివని ప్రీతితో నమ్మితి తండ్రి పలుకే
ఎంతవేఁడినను నీకు సుంతైన దయరాదు
పంతము సేయనే నెంతటివాఁడఁ దండ్రి పలుకే
శరణాగతత్రాణ బిరుదాంకుఁడవుగావా
కరుణించు భద్రాచల వరరామదాసపోష పలుకే

వ. ఓదాశరథీ రమ్మని వేయివిధంబుల మొరలిడినను రాకున్నావ నిను నేఁ బోనీయ ననుచున్నారు.

మధ్యమావతి - చాపుతాళము.

నిన్నుఁబోనిచ్చెనా సీతారామ నిన్నుఁబోనిచ్చెనా
నిన్నుఁబోనిచ్చెనా నన్నురక్షింపక యెన్నివిధములనాకన్నులానరామ నిన్ను.
రట్టుచేసి నిన్నరికట్టుదునింక దిక్కుగలిగితె మొరఁబెట్టుకోర రామ. నిన్ను.
గట్టిగనీపాదకమలములెప్పుడు పట్టినామదిలోఁగట్టివేతురామ నిన్ను.
బడిబడిమీవెంటఁబడి తిరుగఁగనెంతో జడియకనీవెందుజరిగేవురారామ నిన్ను.
తడయకనీతల్లితండ్రులొచ్చినఁగానీ విడిచిపెట్టితె నీకొడుకను రామ నిన్ను.
మావాఁడని మొగమోటములేకున్న సేవచేసి రవ్వచేతునురా రామ నిన్ను.
నీవుభద్రాచల నిలయుండవైనన్ను కావవయ్య రామదాసవిలాస నిన్ను.

వ. పతితపావనా యీవిధి నిన్నహర్నిశంబు దలఁచినను దయరాదు గదా, నిన్ను నేను వర్ణించలేనురా నాబంగారు నాయనా నీవెరక్షించు మాయప్పా ఆపద! అత్యాపద! సత్యము! సత్యము! నీవేగతి యితర మేమియును నెఱుఁగనని రాముని వర్ణింపుచున్నారు.

శంకరాభరణరాగము - ఏకతాళము.

ఇతరము లెఱుఁగనయ్యా నాగతినీవేరామయ్యా
సతతము సీతాపతినీవేయని మతినమ్మితి సద్గతిఁ జెందింపుము ఇతరము.
కోపము సేయఁగవద్దు నా కోరికెలొసఁగు యీప్రొద్దు
ప్రాపుదాపునాప్రాణమునీవే యీపట్టునమిముఁబట్టుసళ్ళనీక ఇతరము.
తప్పులెన్నవద్దంటి నాతల్లితండ్రి నీవంటి
మాయొప్పులకుప్పవటంటీ మాయప్పవు నీపనుకొంటీ
అప్పటప్పటికిఁ దప్పకనీవే జెపములెన్నకను నేర్పునేలుమి ఇతరము.
నామీఁదను దయరాదా రామ నామనవిని వినరాదా
వేమరు నాతోవాదా నను వెఱపకుమీ యనరాదా
ప్రేమమీర మాభద్రాచలపురి ధాముఁడవై రామదాసునినేలుమి ఇతరము.

వ. భద్రగిరీశా యిటుల మొరలిడ నేమని మోమెత్తిచూడ వేమ యా వైకుంఠవాసా యీయాపదఁ బాపుమా యనుచున్నారు.

ఆహిరిరాగము - ఏకతాళము.

ఇనకులతిలకా యేమయ్యరామయ్య రామచంద్రా
వినివినకున్నావు వినరాదొనామొర రామచంద్రా

కనకాంబరధర కపటమేలనయ్యా రామచంద్రా
జనకాత్మజారమణ జాగుసేయక ప్రోవు రామచంద్రా
దశరథసుతనాదశజూడవయ్య శ్రీ రామచంద్రా
పశుపతినుతనామ ప్రార్థించిమ్రొక్కెద రామచంద్రా
నీవేగతియని నెరనమ్మియున్నాను రామచంద్రా
కావవె యీవేళ కాకుత్స్థకులతిలక రామచంద్రా
వైకుంఠవాసా వరబాధమాన్పవే రామచంద్రా
నీకంటెగతిలేరు నిర్దయఁజూడకు రామచంద్రా
రామభద్రశైల ధామ శ్రీరామ రామచంద్రా
వేమాఱు వేఁడెద రామదాసునిఁబ్రోవు రామచంద్రా.

యదుకులకాంభోజిరాగము - చాపుతాళము.

నిన్నేనమ్మినానయ్యరామయ్య నన్ను నిర్వహించసమయమయ్యరామయ్య ని.
కన్నతండ్రివినీవేసుమ్మిరామయ్య నా కష్టములీడేర్చుతండ్రిరామయ్య ని.
చిన్ననాఁటనుండి నేనురామయ్య యిట్టి చింతలెఱుఁగ నీసాక్షిగరామయ్య ని.
ఎన్ని పాటులుపడనున్నానో రామయ్య నాకెవ్వరుదిక్కయ్యేదరయ్యరామయ్యని.
మిన్ను మీఁదనొఱిగినట్లురామయ్య తోఁచ కున్నదిమునిఁగితినయ్యరామయ్యని.
పన్నగభద్రాచలవాసారామయ్య ఆపన్నునిరక్షించుతండ్రిరామయ్య ని.

వ. హే భద్రాద్రిపురవరనిలయా నినువినాగా మా కన్యము లేదు గనుక యెంతసేపు మందలింతును మోక్షమివ్వక విడువను స్వామీ కోదండదీక్షాగురూ యనుచున్నారు.

మధ్యమావతిరాగము - ఆదితాళము.

విడియమేలనిఁక మోక్షమిచ్చి నీవడుగుదాఁటిపోరా
తడవాయెను నేనోర్వలేను దొరతనముదాఁచుకోరా విడి.
మురియుచునిదురను జెప్పినట్టువిన ముచికుందుఁడగాను
అరుదుమీరదలయెగుఱవేయ నే హనుమంతుఁడగాను
వరగుననుబ్బిచ్చులమాటలువిన నే జాంబవంతుఁడనుగాను
విరవిరమీవలలోఁపలఁబడనె విభీషణుండఁగాను మాను విడి.
మాయచేతవంచింపఁబడను నే నామహేశుఁడనుగాను
న్యాయముతేకనుయిటునటు దిరుగను నారదుఁడనుగాను

అయయముచెడిహరినరుఁడనికొలువను నర్జునుఁడనుగాను
దాయాదుండనిమదిలోమురియను దశరథుఁడనుగాను మాను విడి.
గరిమతోడమాసీతనుజూచి కాఁచితినింధాఁక పరగభద్రగిరిశిఖరనివాసా
పరబలసంహారచాపా నరహరినసురక్షింపుమి నారాయణరూపా
మరచినిదురలోనైననుమీపద సరసిజములుమరవా విడి.

వ. హే భద్రాద్రిపురనిలయా యెంతెంతఁగా మనవిచేసికొన్నను నీమనంబు కరఁగదు అంబుజలోచనా ముదంబున గమనంబుంచి కాలవిడంబంబుచేయక నీతిరువడిసంబంధుఁడని యెంచి యీనిర్బంధంబుఁ బాపి రక్షింపంబూన వీఁకమీఁద తాళుఁవాఁడఁగానని నిష్ఠురస్తుతి చేయుచున్నారు.

పంతువరాళిరాగము - అటతాళము.

దైవమనుచుమీరలేకా యింత తాళితిఁగాకపరాకా
దేవుఁడవనినిన్ను దీనతవేఁడితె కావలేనిబిరుదు కారణమేమయ్యా దైవ.
కొలువునిల్పిననాఁటిహోయీ నీవు తలఁచవేమిబడాయీ
నిలిచినజీతమీవోయి నీకు సీతాదేవిదురాయి
బెటకుచునిరిగేవువెన్నిట నిలుపుదు అలచదురనీబంటనదొరానకన్నుఁగదా దైవ.
దొరవైనందుకుబైటచదురా మూల దూరుకతలఁజూపవేరా
నీసాటివారిలోనదురా పేదసాదలున్నారనిబెదురా
అబ్బురముగమూల డబ్బియ్యలేకను బొబ్బరించునోటి పెదవునుతడిపేవు దైవ.
కలిగుండినీకింతలండా అరిగట్టుదునాయెదురండ
చెలువమైనపూలదండా మెడఁజుట్టుదు రామకోదండా
ధరలోననొకరినిదరిఁజేర్చిసొమ్ముకు గురిజూపకుంటెనే గుండెత్తకనుమాన దైవ.
నామొరాలకించవేమయా ఓరానురామ నామొరాలకించవేమయా

వ. అని దూరుచు మరల నామొర యాలకించవు యిదిన్యాయమా యనుచున్నారు.

కేదారగౌళరాగము - చాపుతాళము.

నామొరాలకించవేమయా ఓరామరామ నామొరాలకించవేమయా
నామొరాలకించవేమి న్యాయమాప్రపంచమందు
స్వామినీకన్ననన్ను సంతరించువారలెవరు నా.
ఉన్నవిధమువిన్నవించితి నాహృదయమందు నిన్ను మరవకెప్పుడుంచితి
కన్నతండ్రివైననీకుఁ గఠినహృదయమైతెనేను
కన్నకన్నవారినెల్ల కాచికొల్వలేనుయిపుడు నా.

మ్రొక్కగానె మోడిసేతురా నాపాపమెల్ల నుక్కణించియూరకుందురా
దిక్కెవరు లేరు మీరె దిక్కటంచునమ్మినాను
యిక్కడికిని మీకటాక్ష మేల రాక నున్నదయయో నా.
చేతగానివాఁడవైతివో మున్నునీవు నాతికభయమీయవైతివో
భూతలంబునందుఁ బ్రఖ్యాతిఁ జెందినావునాదు
వ్రాతఫలమదేమొ తలఁచవైతివయ్యొ నెనరులేదో నా.
మదముచేతఁ దెలియనైతిని పాపమంచుఁ బృథివియందు నెంచనైతిని
కదసి నేను జేసినట్టి కర్మమనుభవించవలెను
యిదిగో మీపాదములె గతియటంచునమ్మినాను నా.
నీసమానదైవమెవ్వరు యీలోకమందు నీసమానధీరులెవ్వరు
దాసుఁడనుచు భద్రశైల వాస వేఁబుసేయఁబోకు
గాసిమాన్పుమిపుడురామ భూపవీరరాఘువేంద్ర నా.

వ. అహో భద్రకుధరవిహారా యేల నన్నురక్షించవు యేల నాపై కృపరాదుస్వామీ యని మొరఁబెట్టుచున్నారు

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

ఎందుకుకృపరాదు శ్రీరాములు నే నేమిసేసితినయ్య శ్రీరాములు ఎం.
గతినీ వెయనుకొంటి శ్రీరాములు నా వెతమాన్పవయ్య వేగ శ్రీరాములు ఎం.
చేపట్టిరక్షించ వేల శ్రీరాములు ఆశ్రితజనాధారుఁడవె శ్రీరాములు ఎం.
అయ్యయొ నా నేరమేమి శ్రీరాములు నాకున్యాలించ నెవరున్నారు శ్రీరాములు ఎం.
ఇంకానీదయరాకుంటె శ్రీరాములు నే నెవ్వరిపాలౌదునయ్య శ్రీరాములు ఎం.
యేండ్లుపన్నెండాయె శ్రీరాములు నీకండ్లకుఁ బండుగే శ్రీరాములు ఎం.
వాసియౌభద్రాద్రివాస శ్రీరాములు రామ దాసునివిడనాడఁబోకు శ్రీరాములు ఎం.

వ. రామభద్రా యిటుల మొరలిడినను కరుణింపవుగదా గుహుఁడు అక్రూరుఁడు విభీషణుఁడు సుగ్రీవుఁడు హనుమంతుఁడు మొదలైనవారినిఁ గావలేదా వారు నీకు నేమైనాబంధువులా నేను కానా యని కీర్తనముఁ జేయుచున్నారు.

మ. గుహుఁ డెల్లప్పుడు మీనిజాశ్రితుఁడో యక్రూరుండు భావింపఁగా
సహజన్ముండో విభీషణుం డరయ నక్రూరుండు సామీరితా
బహుకాలంబులబంటో వీరల దయ న్బాలించినా వంద్రు నేఁ
డహహా! తద్దయ నాపయిం గలుగదో శ్రీభావనారాయణా.

వ. వీరలఁ బ్రోచినటువలె నన్నును గాపాడుటకు రావయ్యా యని రాముని బేర్కొనుచున్నారు.

బిలహరిరాగము - ఆదితాళము.

రావయ్యా యభయములీవయ్య స్వామిపరాకు సేయకుమయ్యా
భావజజనక నాబాధలన్నియ్యు మాన్పి యేవిధముననైన నేలేటిదారపివె రావయ్యా.
కావుకావుమని కాకాసురుఁడురాఁగఁ గాచిరక్షించిన ఘనుఁడవీవు కావె
దేవదేవోత్తమ దీనదయాపర కావవేయీవేళ కరుణాసాగర రావయ్యా.
అన్న నాపైని నీ నలుగుటేమి రామన్న రావన్న నామనవినివినుమన్న
అన్నన్న నాసేర మెన్న నేమన్న నీ కన్నమన్నింప నెనరున్న వారెవరన్న రావయ్యా.
పతితులలోఁబరమపతితుఁడనంటినీ పతితపావనబిరుదే మదినమ్మియుంటి
పరగునభద్రగిరిస్వామి ప్రోవుమంటి నితరులవేఁడనా గతినీవెయనుకొంటి రావయ్యా.

వ. భద్రశైలవిహారా నీయం దచంచలభక్తిచే నేనెంత మొరలిడి నను యింత నిర్దయఁజూచితివి నీవు ధరియించియుండు యాభరణాదులు నే నడుగలేదుగాని పూర్వికులగు భక్తులఁ బ్రోచినరీతిని నన్నుఁగాపాడుము లేకున్న ని న్నడుగుదాఁటనీయ ననుచున్నారు.

మోహనరాగము - చాపుతాళము.

అడుగుదాఁటి కదలనివ్వనూ నా కభయమివ్వక నిన్ను విడువనూ
గడియగడియకుఁ దిరిగితిరిగి యడిగితిని వేసరికి వచ్చెను
గడువు దప్పిన నేనునీఁకబహుమడుగుదనములు సేతునిన్ను అడుగు.
కుదురుగగూర్చుండనివ్వను నీకుఁ గోపమొచ్చినభయపడనూ
యిదిమదిని యెంచిఁగుండుమిఁక మొగమోటమేమియులేదుగద నా
హృదయకమలమునందు నీమృదుపదములను బంధించివేతును అడుగు.
రేపుమాపనిజరిపితేను నే నాపుఁజేసెడువాఁడఁగాను
ప్రాపునీవనినమ్మికొలిచితె పాపములుయెడఁబాపిదయతోఁ
దేపతేపకు నీదుమోమిటు చూపకుండిన నోర్వసుమ్మీ అడుగు.
పతితపావనబిరుదులేదా నన్నుఁ బరిపాలనసేయరాదా
ప్రతిదినంబును దేవతలు భూపతిపటంచును వేఁడినను నీ
హితవుజనములువచ్చినిన్ను బతిమెలాడినవిడువనిన్ను అడుగు.
రాక్షసాంతకసీతారమణా సార సాక్షసద్గుణభక్తాభరణా
యీక్షణంబునహీనజనుఁడని మోక్షమివ్వకయుంటివైనను
సాక్షిఁబెట్టి నేఁడు నేనొక దీక్షచేసాధింతునిన్ను అడుగు.

భూరిభద్రాచలవాసా రామ భుజగశయనభక్తపోషా
కూరిమితో నినువిడిచిపెట్టితె ధరణిలోభద్రాద్రిరాఘవ
రామదాసుఁడనేటినామము మారుపేరునబిలువునన్నూ  అడుగు.

వ. అని పలుదెఱంగుల స్తుతియింప నెంతనిర్దయఁ జూచితిరి స్వామీ యనుచున్నారు.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

అయ్యయ్యోరఘురామయ్యా నిర్దయఁజూచితివేమయ్యా
ప్రియమునఁ గరమునబిరుదువహించిన నయగుణనిధివనినమ్మితినామది  అయ్య.
కనకకిరీటంబడిగితినా నీ కర్ణకుండలములడిగితినా
కనకభూషణములడిగితినా నీ కాంచనచేలం బడిగితినా
అనుపమబహువిధ అగణితసంవిదితాంగుళీయకములడిగితినా
ఘనవక్షస్థలిపై విలసిల్లెడి కౌస్తుభరత్నంబడిగితినా
యినశశిసాక్షిగ నేనీభక్తుఁడ కరుణనేలుమనియంటినిగాని  అయ్య.
గళమునమెరయుచు నుండెడిమేలగు పతకముగొలుసుల నడిగితినా
పొలుపుగకోటి రవిప్రభఁదనరెడి భుజకీర్తులనడిగితినా
బళువుగజిగియిరుసంచిటగట్టిన పచ్చలతాయతులడిగితినా
కలితహిరణ్మయచిత్రవిచిత్రపు గంటలమొలనూలడిగితినా
సలలితముగనుప్రసన్నుఁడవగుటయె వెలయగఁబదివేలంటినిగాని  అయ్య.
శరశరాసనములడిగితినా నీ శంఖచక్రముఁనడిగితినా
ఆరయవిధీంద్రులకద్భుతమగుభాసురతూణీరంబడిగితినా
స్ఫురితాసురరిపుగజసింహంబగు కరధృతఖడ్గంబడిగితినా
వరరక్తోత్పల సదృశసముజ్జ్వల మైనకేతనంబడిగితినా
చిరతరకీర్తికుచేలునిఁబ్రోచిన కరుణనేలుమనియంటినిగాని  అయ్య.
సురుచిరభారకకరమునఁబెనఁగొను మురుగులుమురళీలడిగితినా
నిరుపమవజ్రశలాకయినిలిచిన నిలువుటంగినేనడిగితినా
గుఱుతుగరంగుచెలంగెడి బంగరుకుచ్చులనేమేనడిగితినా
స్థిరముగఁజరణములందున మెరసెడియందెలుమువ్వలనడిగితినా
శరణుభద్రగిరిరామదాసుపై కరుణనిలుపుమనియంటినిగాని  అయ్య.

వ. ఓ రామచంద్రా భూపాలతిలకా నన్ను ప్రేమఁజూచిన దారిద్ర్యము పరిహృతమగునని నేనింతగా వేఁడుకొన్నను యింత రాజస మేలచేసేవు మోముఁ జూపుము స్వామీ యనుచున్నారు.

హిందుస్తానికాఫిరాగము - ఏకతాళము.

రామయిదేరా రాజకుమారా ప్రేమతోఁజూచిన లేములుబాయును రామ.
భావజలీలా భూసురచేలా పాలితదాసజనావనలోలా రామ.
చేకొన వేరా నీ కిది మేలా శ్రీకుచకుంకుమ పంకితహారా రామ.
తండ్రివినీవే తలఁపఁగరావే దండిగనమ్మినదాసునిఁబ్రోవవే రామ.
భద్రగిరీశా క్షుద్రవినాశా అద్రిజనుతకామితార్థలక్ష్మీశా రామ.
నరహరిరూపా సురుచిరచాపా నరవరునేలిన నతజనభూపా రామ.

వ. దశరథరామా నన్నుఁ బ్రోవవేమా యనుచున్నారు.

ఆహిరిరాగము - ఆదితాళము.

శ్రీరామరామదయజూడవే రఘురామ వేగనన్నుఁ బ్రోవవే శ్రీరామ.
పరులవేఁడలేనంటిఁగా నీపదయుగములె నమ్మియుంటిఁగా
అరమరసేయవద్దంటిఁగా శ్రీ హరిహరి నీవాఁడనంటిగా శ్రీరామ.
వెఱవకుమని యభయమీయవా నా వెరపులెల్ల వేగఁదీర్చవా
కరుణామృతనిధిగావవా కన్నులకెదుట వసింపవా శ్రీరామ.
హరిహరి యింతపరాకా భద్రాచలసీతానాయకా
తరుణ మిదే భక్తపాలకా రామదాస మనోభీష్టదాయకా శ్రీరామ.

వ. హేరామ హేసీతాపతే సంబోధనరూపముగ స్తుతియింపుచున్నారు.

ఆహిరిరాగము - ఆదితాళము.

రామహో రఘురామహో హేసీతా రామహో రఘురామహో
రామహోభద్రశైలధామహోభక్తపాలనీమహోసీతాలోలస్వామిహోసత్యశీల రా.
అగణితగుణధామ అజభవనుతనామ నగధరమేఘశ్యామ నతజనాశ్రితకామ రా.
శరధిబంధనశౌర్య శత్రుసంహారధైర్యగురుజనకార్యధుర్య కోమలాంగసౌందర్య రా.
శరదిందునిభానన శతమన్మథసమాన నిరుపమానందఘన నిజదాసావన రా.

వ. ఓభద్రశైలనిలయా యెన్నెన్ని యవతారములనెత్తి నీభక్తుల నెన్నెన్ని విధముల రక్షించలేదు, అటులనే నన్నును నొక భక్తునిఁగా నెంచి నాకొఱకై యొకయవతారంబెత్తి రక్షింపరాదా స్వామీ యని సంకీర్తనము సేయుచున్నారు.

కాంభోజిరాగము - జంపెతాళము.

ఎన్నివిధముల నెన్నియవతారముల నెత్తి యెందఱినికావలేదో ఓరామ
నన్నుఁబ్రోచుట కొక్కయవతారముదాల్చిగ్రన్ననుగావరాదో ఓరఘురామ ఎన్ని.

మత్స్యకూర్మవరాహ నారసింహములు వామన పరశురాములగుచు
నచ్చరిత్రులెల్ల నంతరించఁగలేద స్వామినీబిరుదేగదా అవియెల్ల ఎన్ని.
దశరథాత్మజుఁడవై దశకంఠుఁదునుమాడి ధరణిభారము మాన్పవే
పశుతుల్యుఁడనైన నేనెంత వేఁడిన నన్నుదయ నేలకునికితగ వేనను బ్రోవఁగదవే ఎన్ని.
కోపమా సరసనల్లాపమా నేఁజేయు పాపమా కువలయశ్యామా
పాపుమా యాపదల భద్రగిరిరామ దాసాపదోద్ధారరామ పావననామ ఎన్ని.

వ. అహో రామచంద్రప్రభో యింతకఠినమానసుఁడ వగుట యెఱింగియుంటి నేని నాజనని యగు సీతామహాదేవికైనను మనవిఁ జేసుకొందునుగదా యనుచున్నారు.

యదుకుల కాంభోజిరాగము - రూపక తాళము.

రామయ్యనినునమ్మినజనుల నిరాకరించఁదగు నావినయముతో నినువేఁడితినని నీ
మనమున లేశంబైననుతోఁచదుకనికరంబు లేకకఠినుఁడవై తేజననీజనకజకుమనవి సేతుగద.
వెలఁగుచుననిశముఁ దలఁచినజనులకు సులభుఁడవని నినుదలఁచెదనాపై
చలమున నాసరివారలలోపల చులుకఁజేసినను పలుకరించవదె రా.
మతియందునుభద్రాచలమున వెలసిన దొరవనినినునే వరములు వేఁడితి
కరుణమాలిసీతారామదాస కింకరునిఁబ్రోచుటకు దోఁచకపోయెనో రా.

వ. అహో రామభద్రా నన్ను రక్షించ నీచేతఁగాదుగదా స్వామీ యనుచున్నారు.

ఆనందభైరవిరాగము - రూపక తాళము.

రామానీచేతేమికాదుగా సీతా భామకైనఁజెప్పరాదుగా
సామాన్యులునన్ను సకలబాధలఁబెట్ట నా మొరాలకించి మోమైనఁజూపవు రా.
శరచాపములశక్తిదప్పెనా నీశౌర్యముజలధిలోఁ జొచ్చెనా
కరుణమాలిపైకము దెమ్మని భక్తవరులబాధింపనీధైర్య మెక్కడబోయె రా.
శంఖచక్రాల్బట్టినందుకూ దాస జనులరక్షింపవదెందుకు
పంకజాక్షభక్తపరిపాలనలేని పొంకాములే గాని బింకాములేదయ్యా రా.
తల్లిదండ్రివనుకొంటిని నాయుల్లములోనమ్మియుంటిని
కల్లరిజనములు కారుబారు సేయఁ జల్లనికృపనాపై చల్లవైతివిపుడు రా.
ఇంటివేలుపనుకొంటిని నీకంటెదైవము లేదంటిని
కొంటిగాపైకమునొప్పించుమనియంటె వెంటనంటినా జంటరావైతివి రా.

ద్విపద.

అనియిట్లురామదా సారాటమునను, తనమదివిసికి యిట్లనితలపోసె
రామచంద్రునినమ్మి రవ్వపాలైతి, భూమిజపదపద్మములకు మ్రొక్కులిడి
నాపాటులెఱిఁగింప నయముగానన్ను, కాపాడఁదలఁచుచు కన్నతల్లికిని

పుత్రునిపైబాళి పోలఁగ హెచ్చు, గాత్రమున్నావడిన కదుగుందుచుంద్రు
కావునమాయమ్మ కల్పకవల్లి, సేవింపరక్షించు సీతమ్మతల్లి
యనియెంచి సీతామహాదేవినపుడు, తనదుహృత్పద్మమందనువొందనిల్పి
యోమహామహారాణి యోమధురవాణి, యోమంజుభాషిణి యోహాపురాణి
యోజగత్కారిణి యోరమారమణి, యోజగన్మోహిని యోజగజ్జనని
మక్కువమీఱశ్రీ మాత నన్నూడు, మ్రొక్కెదననియిట్లు మొరలిడఁదొడఁగె.

అసావేరిరాగము - ఆదితాళము.

కాకుత్స్థతిలకుఁడు కరుణించకున్నాఁడు కరుణించుమనిచెప్పవే
హాకటాక్ష విహీనుఁడితఁడనియెఱుఁగకపోతినకటా
యేకరణి దరియింతునాపద లీకరణి కఠినాత్ముఁడై తే   కాకుత్స్థ.
మీరలేగతియనుచు దినమేమారకనునుతిఁజేయసాగిన
సారసాక్షుఁడసారసాక్షుండైరయంబునఁజూడఁదలఁపఁడు   కాకుత్స్థ.
దీనరక్షకుఁడీతఁడని యలదేవతలుఁగొలుతురని వినినే
బూనికొల్చిన ఫలముఁగంటిని ఘూజ్యముగ సరివారిలోపల   కాకుత్స్థ.
ఏటపంటలువెట్టఁదలఁచిన మోటకాఁపుతలంపుకైవడి
మేటిదొరయనిపూనికొల్చినఁ బూట.బడిరక్షింపఁ డాయెను   కాకుత్స్థ.
దశరథాత్మజుధర్మగుణము లధర్మయుక్తములై వెలింగెను
పశముగాదీబాధలోర్వఁగ వాసుదేవుని పాదమాన   కాకుత్స్థ.
దిక్కుమాలినజనులకెల్లను దిక్కునేనని సకలదిక్కుల
నెక్కొనఁగఁదనకీర్తి మక్కువదక్కనాదగు దిక్కుజూడఁడు   కాకుత్స్థ.
దండధరుఁడై దానవులకడికండలుగ ఖండించితగ నా
ఖండలాదులఁ బ్రోచుహరియుద్దండుఁడై యిటుజూడఁడాయెను   కాకుత్స్థ.
కుండలేంద్రశయానుఁడేగతి మండలేంద్రులకొల్వలోఁదమ
దండగోరినవారిఁ బ్రోవకయుండఁగాదగవౌనటమ్మ   కాకుత్స్థ.
భద్రశైలనివాసుఁడటుదమభక్తవర్యుల బాధలుడుపఁడు
రుద్రవిహితుండగుట నాపైరౌద్రతయ సాధించెనమ్మ   కాకుత్స్థతిలకుఁడు.

ద్విపద.

ఇవ్విధంబున రాముఁడేచెనోయమ్మ, పువ్వుబోణిరో కలుములనిచ్చుకొమ్మ
యలినీలవేణియో యంబుజపాణి, సలలిత కల్యాణి సౌందర్యశ్రేణి
మనవి సేసెద నాదుమనవాలకించి, మనుపనేర్చినయట్టి మాతవుగావె.

సావేరిరాగము - చాపుతాళము.

అమ్మానన్నుఁబ్రోవవే రఘురాముని కొమ్మాననుగావవే
అమ్మానన్నుఁబ్రోవసమ్మతితోడ మా యమ్మవనుచునిన్ను నెమ్మదిఁగొలిచెద   నమ్మా.
కన్నతల్లినీవుకనుఁగొని నాపాటు విన్నపమొనరించి విభునకువేవేగ   నమ్మా.

ఉల్లములోన మీయుభయులనెరనమ్మి చల్లఁదనమ్మున వేఁడి వేసారితి అమ్మా.
చలముమాని భద్రశైలరామదాసు నలసటబెట్టక యాదరణసేసి యమ్మా నను.

ద్వి ప ద.

చంద్రవంశమునందు జనియించితీవు, చంద్రునిగుణములు జనునుజూపఁగను
రామరాముఁడటంచె రవికులప్రభుఁడు, వేమఱువేఁడిన వేఁడిమిజూపె
నాపైనికృపలేక నతజనయిత్రి, నీపాదపద్మము ల్నెరనమ్మినాఁడ
నేకరణినిసైన నెలమినీప్రియుని, చేకొనినన్ను చెచ్చెరబ్రోవుమనుచు
నెలవిచ్చివేగ రక్షించుమోయమ్మ, చలమేలరాముఁడు సాధించెనమ్మ.

శహానరాగము - చాపుతాళము.

రక్షించమను మ్రొక్కెదా నీనాథుని వీక్షింపమనునాకథా
రక్షించమనవమ్మ రాజలలాముని శిక్షకుఁబాత్రుఁడు గాఁడని తెగదెల్పి రక్షించ.
పక్షివాహనురాణీనీ పాలింపుకటాక్షముంచి జననీ
అక్షయవస్త్రముల్ ద్రౌపదికిచ్చి పక్షముసూపిన పరమదయాళుని రక్షించ.
కమలమధ్యవాసినీ కరుణించు కుసుమబాణుని జననీ
కామజనకునితోఁడఁగరుణించుమనిచెప్పి కాకుత్స్థతిలకనీదాసునండజేర్చి రక్షించ.
భద్రశైలనిలయే మామకయుంపద్రవఘనవిలయే
సద్రమారమణీసద్రూపునకునూ ఛిద్రముఁదెలిపి చేఁజేతదాసునిజేసి రక్షించ.

ద్వి ప ద.

విన్నవించెద మనవినివినవమ్మ, కన్నతల్లివిగావె కరుణించవమ్మ
రక్షింపమనవమ్మ రాజీవనేత్రి, పక్షివాహనునకీపాటులుదెల్పి

కాంభోజిరాగము - ఆదితాళము.

మిథిలేశతనయనామిలిలేనివెతల నీయధిపునకెఱిఁగింపవే ఓజననీ
వ్యథజెందుచున్నాను బుధవినుతునినా కథవినరమ్మనవే ఓజననీ మిథి.
పండ్రెండేండ్లాయెను బందీఖానలజిక్కి బాధింపుచున్నారిటు ఓజననీ
తండ్రికరుణమాని తల్లినీకృపయెట్లో వేంద్రమాయెబ్రతుకు ఓజననీ మిథి.
గదముద్గరాదులఁ గాసిపొందించిరి కరుణలేకభటులు ఓజననీ
సదయాత్ముఁడీరీతి సావకాశముఁజేసె సంతోషమేమెనీకు ఓజననీ మిథి.
పరమపురుషుఁడని పతితపావనుఁడని పాండవపక్షుఁడని ఓజననీ
కరిగాచినాఁడని కాంక్షించివేఁడితె కాలహరణముజేసెనే ఓజననీ మిథి.
కారాగృహంబున కనుగానరాకను కనీసశిక్షలబొందితీ ఓజననీ
ఘోరకుఁడితఁడని పరిపరివిధముల బ్రణుతించివేసారితి ఓజననీ మిథి.
మందునేసఁగిని యెండలోనిలిపిరి గండుమీఱుభటులు ఓజననీ
కొండంతబరువాయె మొండిజీవముపోదు దండయెవ్వరులేరె ఓజననీ మిథి.

ఉప్పుబియ్యముకొండు నుదకఁబెట్టుక తినియున్నాఁడ నీవిధమున ఓజననీ
అప్పునినుదప్పనన్యులులేరు చెప్పరములుదీర్పా ఓజననీ మిథి.
ఉదయమైనవెనుక నురగళయనునితోడుండఁజాలదసువులు ఓజననీ
సదయాత్మునిఁజంపి సంతరించితివైన సత్కీర్తిదక్కునమ్మా ఓజననీ మిథి.
తానిష్పపైకము తడలేక తెమ్మని తహాశీలు జేయించఁగా ఓజననీ
మానవాధముఁడనై మనియుండుటకన్న మరణము మేలమ్మా ఓజననీ మిథి.
అతిదుఃఖమునుబొంది యటిసటచేఁగుంది యార్జించితివిషము ఓజననీ
పతితపావనునిపై భారము వేసి ప్రాణంబులవిడిచెదా ఓజననీ మిథి.
పరమపురుషునకుఁ బరికింపరాని యీపాపపు జన్మమేలా ఓజననీ
కరణత్రయంబులఁ గాకుత్స్థతిలకుని కంటెనన్యమెఱుఁగనే ఓజననీ మిథి.
ఎప్పుడైన మీదగు కృపఁజెందఁగలనని వప్పుచుంచితీపరకు ఓజననీ
విపరీతముఁజూడఁ గపటాత్ములైతిరి విఫలమునాబ్రతుకు ఓజననీ మిథి.
స్థిరముగ భద్రాద్రిశిఖరిని సద్భక్తశేఖరుఁడై వెలసి ఓజననీ
పరువడి రామదాసునిఁబ్రోవకున్నను పరువేలాగుదొరుకునే ఓజననీ మిథి.

## ద్విపద.

ఎన్నివిధములవేఁడ నేమనఁడమ్మ, మన్ననలేదుపొమ్మన్న మేలమ్మ
పొమ్మన్న నెక్కడ బోదునోయమ్మ, సమ్మతికాకుంటె చలమేలనమ్మ
మానవ్రతముఁబూనె మారాముఁడమ్మ, జానకీదేవి సన్నిధిఁజేర్పఁడమ్మ
తనకుఁగానట్టియీ తనువేలనమ్మ, మనవిఁజేసెదనీకు మాయమ్మరమ్మ.

### జంఝూటిరాగము - ఏకతాళము.

అమ్మనాదు మనవి సీతమ్మ వినవమ్మా సమ్మతితో నీదు విభునిచరితలుఁగనవమ్మా అ.
ఎంతవేఁడుకొన్నఁబలుకఁడేమిసేతునమ్మా యింతతాలిమనసువానినెందుఁగాననమ్మ అ.
కన్నతండ్రి నామీఁదకరుణదప్పెనమ్మా కన్నతల్లినీవైనను గాచిబ్రోవవమ్మా అ.
దీనరక్షకుఁడఁటనాదిక్కుచూడఁడమ్మా కానిపనులనేనేమిగావించితినమ్మా అ.
శరణాగతరక్షకుఁడనుబిరుదఁటయోయమ్మా పరికింపఁగనాదయబట్టబయలాయెగదమ్మా
ప్రణతార్తిహరుఁడఁట భద్రాద్రివాసుఁడమ్మా గణనలేనిబాధలను గలుగఁజేసెనమ్మా అ.

### కల్యాణిరాగము - ఆదితాళము.

ననుఁబ్రోవుమనిచెప్పవే సీతమ్మ ననుఁబ్రోవుమనిచెప్పవే
ననుఁబ్రోవుమనిచెప్పు నారీశిరోమణి జనకునికూఁతుర జననిజానకమ్మ నను.
ప్రక్కన్నుజేరుక చెక్కిలినొక్కుచు చక్కఁగమరుకేళిఁజొక్కియుండెడువేళ నను.
లోకాంతరంగుఁడు శ్రీకాంతనిముఁగూడి యేకాంతమున నేకశయ్యనున్నవేళ నను.
అద్రిజవినుతుఁడు భద్రగిరీశుఁడు నిద్రమేల్కొను వేళ నెలతనో బోధించి నను.

## ద్విపద.

అనియిట్లురామదాసుండమరఁబలుక, వినిజానకీదేవి వేగంబలేచి
సద్రత్నఖచితమౌ భద్రపీఠమున, భద్రాచలంబునఁ బ్రౌఢిమీరంగ
భరతాదులుభయపార్శ్వంబులనిలిచి, గురుతరచ్ఛత్రచామరములుపూన
పరిపరివిధములవందులువొగడ, దరుచుగా భక్తసంతతిమోదమునను
తంబురల్చేఁబూని తానముల్పాడ, డంబుగాఁగొలువునాటంబున్ననున్న
రాజేంద్రచంద్రుని రవికులతిలకు, నాజానుబాహు ననన్యసామాన్య
నిద్ధతేజోనిధి నిప్సితదాయి, సిద్ధసంకల్పు నాశ్రితజనప్రియుని
భక్తపాలుని భవభయవిరహితుని, ముక్తసంగుని జగన్మోహనమూర్తి
శృంగారచరితుని శ్రీరామవిభుని, బొంగుచుఁజూచి భూపుత్రి యిట్లనియె
రామ పావననామ రవికులసోమ, భీమపరాక్రమవినుత సుత్రామ
రాజరాజార్చిత రాజలలామ, రాజితసద్గుణ రాజసుత్రామ
భవభయహరనామ భక్తప్రకామ, కవిజనప్రియ రామ కాకుత్స్థరామ
తారకనామ యో రఘుకులసోమ, ధారాధరశ్యామ దశరథరామ
సకలసద్గుణధామ జగదభిరామ, సకలజనస్తోమ సన్నుతనామ
భాగవతాచార్య పరమకైంకర్య, భాగ్యైకధుర్య ప్రభావార్యవర్య
సారుఁడుదారుఁడు సజ్జనప్రియుఁడు, ధీరుండకాముఁడు దివ్యమానసుఁడు
నీయాఖ్యగల్గిన నీదాసుఁడొకఁడు, పాయకనీవల్లబడరానిపాట్లు
బడి బందిఖానలోఁ బడియెను దీనఁ, జెడు నీదుకీర్తి చెచ్చెరఁబ్రోవకున్న.

### బేగడరాగము - ఆదితాళము.

అని దాశరథిమోముఁగనుఁగొని యాసీత యతిమోదమునఁ బల్కెను
కనకాంబరధర కరుణింపఁగదె యీ కారాగృహవాసిని అని.
కరిమకరిచేఁజిక్కి గాసిఁజెందఁగ నేఁగి కాపాడఁదలఁచలేదా
యీపరమపావనుఁడైన భక్తశిఖామణిఁ బాలింపదయరాదా అని.
కృష్ణాయనిపిల్వఁ గృష్ణకువల్వలు కృపచే నొసంగలేదా
యీతృష్ణచల్లారిన సద్వైష్ణవునిఁ బ్రోవఁ దలఁపునఁ దోఁచలేదా అని.
పిడికెడటుకులుదిని వడికుచేలునకు దృఢసంపదలీయవా
రామ తడయకతనసొమ్ము ముడువకనీకిచ్చిన బడుగునుగావలేవా అని.
గంటచెవిగట్టుక గండుమీఱియున్న ఘంటాకర్ణునిఁ బ్రోవవా
రామ వెంటనంటి నిన్ను వేవిధములఁగొల్చు విప్రునిరక్షింపలేవా అని.
భద్రగిరీశుఁడు భక్తులపాలిటి పారిజాతంబనుచు
భద్రాత్ముఁడైయున్న వాఁడు రామదాసుఁ బాలించెదవనుచు అని.

వ. అని మఱియు నేమనుచున్నది.

ఎదుకులకాంభోజిరాగము - ఏకతాళము.

నామనవివినివేగఁ బ్రాణనాథ రామ దాసునివదలించుమి ప్రాణనాథ నా.
పాచ్ఛానన్నేమేచ్ఛుఁడు ప్రాణనాథ పుచ్ఛపుచ్ఛా వాక్యములాడె ప్రాణనాథ నా.
లక్షపైకము దెమ్మనుచు ప్రాణనాథ యెంతోశిక్ష జేయుచున్నారయ్య ప్రాణనాథ నా.
శరణన్నరక్షింతునని ప్రాణనాథ. శరణాగతబిరుదువహించు ప్రాణనాథ నా.
తురకపైకముచెల్లించను ప్రాణనాథ యెంతోత్వరితముగ వేంచేయుఁడి ప్రాణనాథ నా.

వ. సీతాదేవిపలుకులకుఁ జిత్తమందు రాములు సంతసించి పెడలె దమ్మునితోమందు.

గీ. అనుచుఁ దృష్టి సనక నాజగన్నాయకు, దేవి మరల దేవదేవుమోము
నందుఁ జూడ్కినిల్పి యారాటమునఁదన, భావమమరఁ దెలియఁబడఁగ ననియె.

ఆహిరిరాగము - చాపుతాళము.

వేరేయోచనలేటికే ముమ్మాటికి వేరేయోచనలేటికే ఓరామా
ఆపదోద్ధారకుండను మాటనిజమైతె యీప్రొద్దునీతనిఁ బ్రోచుటయేసాక్షి వేరే.
ధ్రువప్రహ్లాదాదుల ధ్రువముగ నేలినది ధ్రువమైననీతనిదిక్కుఁజూ మటేసాక్షి వేరే.
దీనజన పాలకుఁడనుమాటస్థిరమైతె మానకయీతని మన్నించుటయేసాక్షి వేరే.
ఆర్తత్రాణపరాయణబిరుదుగోరితె వీనియార్తిపోఁగదిమి నన్నాదరించుటెసాక్షి వేరే.
శరణన్నజనులనాక్షణమునఁబ్రోచేటి బిరుదునీకున్న నీతనిఁగాచుటెసాక్షి వేరే.
ఘనమైన భద్రనగరమునందుఁగలవేని తనరంగరామదాసుని నేలుటయెసాక్షి వేరే.

* అన విని రాముం డటహార్షంబున జనకాత్మజతోడఁ
గొని లెత్తుము గోపన్న నిపుడు గోల్కొండకుఁ జని మాతోడన్.

గీ. అనుచుఁ బ్రియురాలి నర్మిలినాదరించి, తమ్ముఁగనుఁగొని రమ్ము పోదమ్మటంచు
లక్ష్మణునితోడ రాముఁ డాహ్లాదమొప్ప, వేసములు సేవకులరీతి వేసిరిట్లు.

మధ్యమావతిరాగము - ఆదితాళము.

జట్టీలాగులు దొడిగిరి రామలక్ష్మణులు
పట్టుదట్టీలు గట్టిరి రామలక్ష్మణులు
మోమునకాంతు లుట్టిపడఁ బొట్టుఁబెట్టిరి రామలక్ష్మణులు
ప్రతాణిపాగ లట్టేశిరమునఁబెట్టిరి రామలక్ష్మణులు
గట్టుతోడ్త మన మిప్పట్టున గోలకొండతట్టునదృష్టియుంచి
గట్టిగఁ దానీష బిట్టడర నంతగపురంబున నట్టైజొరబడి రట్టుజేయుచు
గిట్టిపైకముఁబెట్టి దాసుని దిట్టముగ రక్షింతమనుచు జట్టీ.

పటాకత్తులుపట్టిరి రామలక్ష్మణులు
గట్టిగఁజేత దిట్టమౌడాలులు పట్టిరి రామలక్ష్మణులు
పసిఁడికతారిదట్టిలోఁ దట్టునజెక్కిరి రామలక్ష్మణులు
పైనపుట్టము లట్టే వలెవాటువేసిరి రామలక్ష్మణులు
యట్టిభక్తునిఁగాన మెట్టియుగములందుఁ
జుట్టితనకర్మముల నెట్టివిడిచెనుగాన
మట్టుమీఱినపుణ్యమితనిది గట్టుగా మనమూరకున్నను
బెట్టుగాఁ బోసీయఁడీతండిట్టిభక్తుని బ్రోవఁదగునని జట్టీ.
జామా నీమాలుదొడిగిరి రామలక్ష్మణులు
సీతను గనుఁగొని ప్రేమ గనుఁగొనఁగ వెడలిరి రామలక్ష్మణులు
రామదాసుని క్షేమానఁ దెత్తుమనిరి రామలక్ష్మణులు
చింతిలఁబోకు కామితమిత్తుమనిరి రామలక్ష్మణులు
కోమలాంగిరోనీవు కూర్మితో భక్తుఁడని
వేమాఱు తరిమిచెప్ప మేమాడకిపుడెచని
నీమమున నానామమెప్పుడు కామితార్థమటంచు దలఁచుచు
భామలకులోనగుచుఁ బేర్కొను రామదాసునిఁ బ్రోతుమనుచు జట్టీ.
కలికితురాయిచెక్కిరి రామలక్ష్మణులు
చెవులందు వజ్రముల యంటుజోళ్లు బెట్టిరి రామలక్ష్మణులు
పతకముల కాంతు లొలయహారములువేసిరి రామలక్ష్మణులు
చేతుల రత్నకలితకంకణములు బెట్టిరి రామలక్ష్మణులు
కలుములరాణి తమతలఁపుల మెలఁగ
భద్రాచల శృంగతటమున నిలఁబడిసిద్ధులు
వెలయఁగను శాంబరివిద్యాబలమునను జగమెల్ల వెలుఁగఁగ
మెలఁగురీతిని రామలక్ష్మణు లలరుచు గోల్కొండఁ జేరిరి జట్టీ.
ఘారాచౌకీలుదాఁటిరి రామలక్ష్మణులు
ప్రహరిగోడల మీఱఁగఁజౌకళించిరి రామలక్ష్మణులు
సంతోషరస మూరలోపలికిఁ జొచ్చిరి రామలక్ష్మణులు
రాజస మొప్ప జారీగఁ దలుపుదట్టిరి రామలక్ష్మణులు
ఘోరనరకమందు కారాగృహమునందు

జేరి వేదనఁ జెంది పారము ముట్టలేక
సారసాక్ష యటంచు పలుమఱు జేరి మొఱలిడు రామదాసుని
భారములు దొలఁగింపఁ దమమదిఁ గోరి రాజాంతఃపురముఁజేరిరి జట్టీ.

వ. ఇవ్విధంబున సీతామహాదేవిచేత బోధింపఁబడి యార్తత్రాణ పరాయణుండగు శ్రీరామచంద్రప్రభుండు భక్తపరాధీనుండను బిరుదుఁ గాచికొనను పరమాంతరంగభక్తుండగు తనదాసుని చెర విడుదలఁ జేయింపఁదలంచి సర్దారులవలె వేషంబుల ధరించి గోల్కొండపురంబున రాజాంతఃపురంబునొచ్చి తానీషంజూచి మాటలాడఁగోరి వచ్చు సమయంబున రామదాసుగారు చెఱలో నేమిసేయుచున్నారనిన.

గీ. రాముఁ డీరేయి ననుఁ బ్రోవ రాక మసలె, నేని జీవంబుపైయాశ మానుదునని
విషముగిన్నెను బెట్టుక విప్రవరుఁడు, మైమఱచి నిద్రఁ జెంద భూమండలపతి.

గీ. రయముమీఱంగ రాజకార్యములు దీర్చి, భోజనముఁజేసి మైఁబూతఁబూసివేడ్క
భార్యతోఁగూడి లోపలిభవనమునను, గనులుమూసియు స్వప్నముఁగాంచి లేచి.

వ. ఆయవనభూపతి మేనుచెమర్ప, మాటలు తొట్రుపడ, తత్తరంబున తనబిత్తరింజూచి, కంటినొకకల మత్స్యకంఠి నాకల నెఱింగించెద, వినుమని యిట్లనియె.

మోహనరాగము - ఆదితాళము.

కలకంఠి నేనొక్కకలఁగంటి వినవే
పలుకఁబోయిననీతో పలుకనోరాడదె జలరుహాక్షి మదిఝల్లుఝల్లుమనెనే కల.
ఇంతకుముందు నిరువురుజంటగ సంతసమలరఁగ సకియనాయెదురుగ
వింతలుగులుకఁగ వేవేగనిలువఁగ అంత నెవ్వరనఁగ నపుడిట్లులనిరిగ కల.
రామలక్ష్మణులట రఘుకులవరులఁట రామదాసుబంట్లఁట వారితలిదండ్రులఁట
రామదాసుపైకమఁటరశీదందఁబంపిరఁట తాముయిచ్చిరశీదిట తడయక తెమ్మనినట్ల కల.
ఏమిహేతువొకాని యెన్నఁడిటులరాని యీమాయకలమాని నీమదికలఁగిన
రాముమహిమొకానియెఱుఁగనేరనుపూనిజాములోఁ దెలియుంనీజయాపజయములుఁగాని.

వ. ఈక్రమంబున స్వప్నంబుఁగంటినని తనస్వప్నవృత్తాంతంబు తానీష తనభార్యతో నుడువుచుండ శ్రీరామలక్ష్మణు లంతఃపురంబులోని కరిగి తానీష నిద్రించు శృంగారభవనకవాటంబు కరంబుల మీటి యిట్లనుచున్నారు.

గౌళిపంతురాగము - ఏకతాళము.

తలుపుఁ దీయుమయ్య తానీష నీదగు తలఁపు లీడేరెవయ్యా
అలనాఁ డభవుని యర్చించినఫల మఱచేతఁ గంటివయ్యా త.
జాతినీతులేల భూతలమందు ప్రఖ్యాతిఁజెందితి లేవయ్యా
మాతలఁపున మిమ్ము మన్నింపఁ దలఁచిన మారుబల్కవేమయ్యా త.
మీచేతలెల్లను మేమెఱిఁగినారము మీకుఁ గోపమేలయ్యా
మాచేతనైనంత మాటాడవచ్చితె మర్యాద లేదేమయ్యా త.
రామదాసునిఁదెచ్చి రచ్చలఁబెట్టిరు రాజస మేలనయ్యా
కామారివినుతుని కరుణకుఁ బాత్రునిఁ గష్టపెట్టఁగ రాదయ్యా త.
పైకమిదిగోచూచి పరకామణిఁ జేసి పరువడి సెలవీవయ్యా
సాకల్యముగ భద్రాచలరామదాసునిఁ జయ్యనఁ బ్రోవవయ్యా త.

ద్విపద.

అంతట తానీష యడలుచు లేచి, వింతగానున్న దీవిధమంచుఁదలఁచి
తొత్తరమందుచుఁ దరుణినిఁజూచి, యుత్తరియిచ్చోటి కెవరురాఁగలరె
కన్నట్టికల కిదికారణమేమొ, తిన్నఁగానే దలుపు దీసెదననుచు
దిగ్గునఁ బానుపుడిగ్గి తీవ్రంబు, తగ్గించి ధృతిచేతఁ దలుపోరఁజేసి
రత్నకాంతులతోడ రమణీయమైన, నూత్నాభరణము కాంతులుదిక్కులందు
ప్రబలఁబర్వగ ధరాపాలనశీలి, సభయుఁడై సరభససత్వరంబునను
తలుపుఁదీసినమించు తళతళమనిన, చెలువున దేహకాంతులు దీటుకొనఁగ
పటుతరంబుగ సింహబలులు తద్ద్వార, మటదాఁటి నిలఁబడ నర్కవంశజులఁ
గనుఁగొని తనమది కళవళమంది, యీనిశిథిని వీరలేయుపాయమున
పరువడివచ్చిరి ఘారాలుదాఁటి, పురుషులే వీరలు పుణ్యులుగాక
యని మది వెఱఁగంది యంతనధైర్య, మునుజెంది వారిమోములఁ జూడ్కినిలిపి
ఘనజాలములలోని గర్జనఁబోలు, ఘనతరోక్తుల నిట్టులనియెఁ దానీష

మధ్యమావతిరాగము - అటతాళము.

ఏదేశవాసులు రేకార్యమున మాయెడకువచ్చినవారలు
భేదమెంచఁబోక భీతియుడిగిఁ జెప్పి మోదమందుఁడుమీరలు సర్దారులు ఏదేశ.
సుందరాంగులగుచు సొంపొందుచున్నారు చూడఁజూడఁగవింతలు
మాగంభీరయానలఁగలసియుండుచోటఁగనియోర్వమీరంతులు నీవింతలు ఏదేశ.
పోటుటీఁగైనఁ బోనీయలేము మాపాలఁటులుండుగృహామునకు
మీరలాతప్పుపనిఁజేసివచ్చినదటులుండ వహ్వాయంతకఱుకునిజముగఁబలుకు ఏదేశ.
సింగంబులఁగని సిబ్బచూపువీరశేఖరులు మాభటులు
మీరు రంగుగఁబొంగుచు నంగవేయుచురాబోసంగిన దదియెటులు వీరిటులు ఏదేశ.

హెచ్చుగపీరలు తెచ్చినద్రవ్యం బచ్చెరువాయెఁజూడ
యెంతో ముచ్చటపడి మిమ్ము మెచ్చనేనడిగెద మోసితెచ్చినజాడ గన్గొనిచూడ ఏదేశ.
ఇంతద్రవ్యముమీరు లీయర్ధరాత్రిని నెందుకుఁదెచ్చితిరి
ఇంత సుంకప్రొద్దున్నది సూర్యోదయమైనచూతాము లెమ్మనిరి కానిమ్మనిరి ఏదేశ.
పైకముదీసుక పలుమాటలాడశ ఫారాలోపలికిఁబోండి
మమ్ము వేకువజామున వేధించుచున్నారు వెసనిద్రపోనియ్యండి వేగములెండి ఏదేశ.
గారడివిద్యలు ఘనముగమీయందుఁ గలదనిమదిఁదోఁచె
నేను కారుబారుజొచ్చి కచ్చేరిలో మీకార్యములెఱిఁగెదను పదపదమనెను ఏదేశ.

## ద్విపద.

అనియిట్లుతానీష యాడినందులకు, ఘనమతిమంతులు కాకుత్స్థకులులు
కైతవంబునఁదమకార్యార్థమెల్ల, హితమతిఁదానీషకేర్పడఁజెప్ప
మదినెంచిరామలక్ష్మణులుమృదూక్తు, లదునుకుఁదగినటులాడిరిట్లనుచు.

### మోహనరాగము - చాపుతాళము.

భద్రాద్రిపురము కాంచీపురము సర్వోపద్రవహరము మాపురము
సద్రత్నఖచితగోపురము బ్రహ్మ రుద్రాదులకగోచరము
భద్రమానసులైభజించిన రుద్రవినుతుఁడు భక్తులనునిరు
పద్రవంబునఁబ్రోతునని చిన్ముద్రచే నభినయముఁజూపెడు భద్రా.
పాయకభక్తవర్యులకుఁ దరణోపాయము గలిగేటికొఱకు
జాయతోదశరథుకొడుకు శుభదాయకుఁడై యుండుమనకు
కాయమస్థిరమనుచుఁ దెలియఁగ హేయ మగునిహసుఖములఁడఁగఁగ
జేయుతలఁపులొసంగి సులభోపాయమునఁ గడతేర్చునగము భద్రా.
తిరిగిపుట్టుక లేనియెడము పరమగురుఁడు దెల్పినమూలధనము
పరమాత్మునినామఘనము నిష్ఠాపరులకు నేకాంతస్థలము
విరివిగాబ్రహ్మ యెంతఁజేసిన తరుగులేకను వృద్ధిఁబొందుచుఁ
బరమపురుషులఁ జేయుపురుషుని శిరమునను ధరియించునగము భద్రా.
శ్రీరామదాససంఘములు విశ్వాకారునికార్యసాధకులు
నారాయణాదినామములు వేడ్కఁగోరిన నొసఁగుబోధకులు
క్రూరబుద్ధిని రామదాసుని దారిఁదెలియక ఖయిదులో మీ
రూరకను బాధించుటలు విని వారిఁగనఁగావచ్చుభటులము భద్రా.
రామదాసులభక్తి దెలియకా యిట్లు బాముల బెట్టుట మేలకా
భూమినిఁబుట్టుటయిందుకా నిన్నేమందును రాజ్యభారకా
కామివై కనుఁగానరాకను శ్రీమనోహరుకింకరులఁగూ
డీ మెయి నిగుడింపఁజెల్లునె రాముఁడే నినుఁబ్రోచుముందర భద్రా.

గోపన్నను బిలుపించు మా ప్రాపున నుండఁగఁబంచు
పాపరాధిననియెంచు సీతాపతినిమదినుంచు
యెపుడను జగమెల్ల వెలుఁగఁగ గోపనను ప్రాపునను గొనియా
శ్రీపురములోఁ జొచ్చితగ మాయాపురములైటను వసింతుము భద్రా.

ద్విపద.

అనిన శ్రీరాములకామహాత్ముఁడు, మనముత్తల్లడమంద మతిఁగుందనిట్లనియె
అటులతులపైకమాతఁడుబాకి, కారాగృహంబులఁ గనుఁగానరాక
యీతిబాధలఁబొంది యేగతిఁగానఁ, జాతనివిడువ మర్గము చెల్లకున్న
నన రామలక్ష్మణు లాతురుష్కునకు, భీకరాకారగంభీరులై యనిరి.

బిలహరిరాగము - ఆదితాళము.

ఇదిగోపైకముజూడండి భద్రాచలేశు లుదయానఁ బంపినారండి
సదయహృదయముతోడ మీరలు విదితముగ సమ్మతినిఁజూడుఁడు
కొదవలేకను పైకమంతయు కుద్దుగాఁ జెల్లింపవచ్చితి మిదిగో.
కీడుమే లెఱుఁగంగనేరని బీడుదొరతనమాయె మిమ్ముల
జూడఁగానద్గుణములుండెడి జాడదోఁచెను నెమ్మనంబున నిదిగో.
ముల్లెలెంచుక చెల్లుబెట్టుక చల్లనై మీదైనయుల్లము
పల్లవింపఁగఁ గుల్లుమొత్తము చెల్లెననుచు రశీదొసంగుఁడు ఇదిగో.
రామదాసునితల్లితండ్రులు ప్రేమచేఁదమపుత్త్రుశుభగతు
లేమరక తెలిసికొనిరమ్మన భీమగతిమేమరుగుజెంచితి మిదిగో.
చెల్లిచెల్లములుండుననని మీయుల్లమునఁ దలపోయవలదు
పొల్లులాడము యట్టులుండినఁ జెల్లఁగట్టుద ముదయమైతే ఇదిగో.

గీ. అనిన మాటలఁదానీష యాలకించి, వీరలెవ్వరివారలో వివరముగను
దెలియనడిగెద నేనని తీవ్రమతిని, గపటవేషుల కిట్లనె ఘనతమీఱ.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

ఎవరిసర్దారులు వహ్వా యెవరిహుకుమునవచ్చినారు
గోపన్నగారి సర్దార్లు మా ప్రాపునకోటినొకర్లు
ఎందుకు నిటకువచ్చినారు మిమ్మెందులకై పంపినారు
తెల్లవారకముందు మీకుఁ బాకి చెల్లఁగట్టె టందుకొఱకు
వహ్వా మీనామములేమి మీ వంగసమునకుఁబేరేమి
రామోజి లక్ష్మోజి నామం మాది రఘుకుల మనుకులనామం
కొల్వుఁగొల్చినవారుమీకు మెచ్చి కూటికిచ్చుటఁదెల్పుమాకు
మూఁడుతరములుగనున్నాము మమ్ముఁగాపాడి పెడుదురన్నము

కొలువుకొల్వఁగఫలమేమి యాకొల్వునవచ్చినదేమి
కొల్వఁ గొలుచుటలేలనయ్యా పొట్టకూటికే కాదఁటనయ్యా
మాపైకముఁదెచ్చినారా బొల్లిమాటలాడఁగవచ్చినారా
మీపైకముఁదెచ్చినాము పొల్లుమాటలజాడ లెఱుఁగము
ఎంతపైకముఁదెచ్చినారు మీ రిపుడేమి చెప్పుచున్నారు
మీకెంతబాకీ చెప్పండి అది మీరిపుడె చెల్లించుకొండి
ఆఱులక్షలు యివ్వండి మీరాఁగల గోపనను జూడండి
ఆఱులక్షలు తేలేదండి మాకు అరువిచ్చేవారు లేరండి
మీరెంతఁదెచ్చినారండి మంచిపోరాటమాయెను లెండి
మూఁడులక్షలున్నవండి మీయెడ మాఱుపల్కు లేమండి
వేగఁదెచ్చినది యివ్వండి మీరోగముడిపెదను జూడండి
పదివేలు తెచ్చినామండి మీ పంతము మానమేలండి
మకురుగుణములు మీకు మెండు మా మర్జి ఫిరంగిలోగుండు
మర్జియెఱిఁగి నడవఁగలమా మనము విసర్జనఁ జేసిన ఫలమా
విడుదలఁగను తలఁపు లేదు మీయెడమాకుసంతృప్తిలేదు
జిడిగొన్న క్రోధమేలయ్యా మాకిడరానిదొకటిలేదయ్యా
బైరోయిచ్చుటసుంత మీబాటలనెఱిఁగెదనంత
భేటికొరకు వచ్చినాము మాబాటలెఱిఁగినవారిఁగనము
మీబాటలెఱుఁగ మాకేల వహ్వా శాబాసుయీమాటలేల
మాట లేల మీతోనింక మేము పూఁటబడక పోదుమింక
గోపన్నసర్దార్లుగనుకా మీ కేపట్లు ఖైదే గతిగాక
బాకీదార్లకు కద్దుఖైదు మేము బాకియేమాత్రములేదు
తెచ్చినపైకమివ్వండి మీ తెగులుమాన్పెదనుజూడండి
తెగులుమాన్పెడుదొరయుంటె నీకీ వగపేలవచ్చునుకంటె
మాయబ్బసొమ్ముకువగపా వద్దు మానుమనుచుజెప్ప నీవా
అబ్బబ్బలకు అబ్బలము మా శిబ్బందులందఱువినుము
తబ్బిబ్బుగాఁ బలికేరు మా డబ్బియగతిగానలేరు
గతిలేనివారలకెల్లా మేమె గతి యుల్లమునఁదేజరిల్లా
ఆర్లక్షలకుగతిలేదు మీ బోర్లఁబాటుగన్న చేఁదు

కోటిలక్షలు తేఁగలము యిట్టి చోటికేలవచ్చెదము
తగదనమీకింతతెగవా మా ధనమియ్యక యింతబిగువా
ధనమురాశిఁబోసివింత దంధనముఁ జేయఁదలఁచిరంత.

వ. ఇవ్విధంబున వాదించి రామమోహారీ లార్లక్షలు రాశిఁ బోసిన.

శంకరాభరణరాగము - ఏకతాళము.

రామమోహారీల రాశిఁజూచినంత తానిషాకును
శ్రీ రామచంద్రులకు రాజోపచారము జేయఁదోఁచెను రా.
రాజోపచారముల్ రక్తిజేయఁబూన రామునకును
యితఁడు రాజరాజనిమది రామచంద్రుఁడు రంజిల్లుచుండును రా.
ఆసనమిచ్చుట యర్హమనుచుఁదోఁచెఁ దానిషాకును
అతని మోసఁబుచ్చి పోవ మురియుచునుండెను రాముఁ డంతను రా.
పాద్యమిచ్చిన దోషపరిహారమనితోఁచె తానిషాకును
ఈ చోద్యముజరిపించి జుణుఁగఁదలచెను రామచంద్రుఁ డంతను రా.
అర్ఘ్యమిచ్చినఁ దనకనర్ఘ్యపదమనితోఁచెఁ దానిషాకును
శ్రీ భర్గుఁ డిచ్చినవరము దుర్ఘటమనితోఁచె రామునకును రా.
వరవస్త్రాభరణము ల్వాడి నివ్వఁదోఁచెను తానిషాకును
రఘువరుఁడు రసీదును వ్రాసి యియ్యమని వేగలేచెను రా.
వేగిన రశీదు వెసనిత్తుపొమ్మనె యవనభూపతీ
మేము త్యాగమడుగ లేదు తక్షణమిమ్మనె రామభూపతీ రా.
కలందానులే దేకరణినిత్తునసె యవనభూపతీ
నీవు కలఁతబెంచఁబోకు ఖండింతుననిపల్కె రామభూపతీ రా.
గడగడవడఁకుచు గతిమీరెయనిపల్కె యవనభూపతీ
నీకు జడుపేల రసీదు వడిగనిమ్మనిపల్కె రామభూపతీ రా.
కలములేదన తనకాండపుములికితో వ్రాయమనెను
తురక కలఁగి మశిలేదన్నఁ గరుణతోడ తమ్మపడిగఁజూపెను రా.
కాగితములేదన్న వాక్యార్థమై మొలదట్టియిచ్చెను
నీవు జాగుసేయకుమిఁకఁ జనవలెరసీదువ్రాయమనెను రా.
తానీష రసీదు తక్షణమిచ్చెను రామునకును
వేగ భానుకులేశులు బైలువెడలిరి రామదాసుఁజూడను రా.

వ. ఈప్రకారంబున తానీషకు రామలక్ష్మణులు పైకము చెల్లించి చెఱ సాలలో నిడుమలఁ బడుచుండు రామదాసునకుఁ దాము తానీషచేఁ బుచ్చుకున్న రశీదును నియ్యఁదలఁచి తానీషచందంబున రామలక్ష్మణులు రూపంబు దాల్చి చెరసాలఁ జేరవచ్చుసమయంబున రామదాసుగారు నిద్ర మేల్కని జాము ప్రొద్దుండుటంగాంచి యిఁకనైనా రక్షించరాదా జగన్నాయకా యనియు, రాముఁడు భద్రాచలంబున నున్నాఁడో లేఁడో యనియు స్తుతింపుచున్నారు.

సావేరిరాగము - చాపుతాళము.

ఉన్నాఁడో లేఁడో భద్రాద్రియం దున్నాఁడో లేఁడో
ఉన్నాఁడో లేఁడో యాపన్నరక్షకుఁడు యెన్నాళ్ళు వేఁడినఁ గన్నులకగపడఁ డు.
నన్నుఁగన్నతండ్రి నాపెన్నిధానము పిన్నవాఁడయి తానెన్నఁడురాఁడాయె ను.
ఆఁకొని నేనిపుడు చేకొనివేఁడితే రాకున్నాఁడయ్యయ్యొ శ్రీకుల స్థతిలకుఁడు ఉ.
వాటముగ భద్రాచలరామదాసుతో నాటలాడుటకు నాటకధారుఁడు ఉన్నా.

శా. రారా కృష్ణ యశోద ముద్దుతనయా రారా దయాంభోనిధీ
రారా దీనదయాపరా మురహరా రక్షించరా శ్రీధరా
రారా సారసనేత్ర కామజనకా రారా మునీంద్రస్తుతా
రారా భక్తపరాయణాచ్యుత హరీ రారా జగన్నాయకా.

వ ఈప్రకారంబున నున్నాఁడో లేఁడో యని విచారించి మరల 'రామాదన్య న్న కించన' యని దృఢనిశ్చయుండై సంబోధనఁ జేసి పరాకు చెప్పుచున్నారు

మ. అతికారిన్యుఁడ వీవు నిక్కముగ నిత్యాపన్నుఁడ న్నేను నీ
మతిలో నించుక జాలిపుట్ట దిఁక నే నేదేవుఁ జింతింతు నే
గతి యే త్రోవఁ జరింతు నన్య మెఱుఁగ న్గాంక్షించి నీప్రాపుఁ జొ
చ్చితి నీచిత్తము యెట్లువచ్చిన సరే శ్రీభావనారాయణా.

నాదనామక్రియరాగము - ఏకతాళము.

రామపరాకు రఘురామపరాకు స్వామిభద్రశైలధామ పరాకు
శ్రీవత్సకౌస్తుభసింహపరాకు శ్రీవల్లభా కారుణ్యపరాకు రామ.
అక్షయపాండవ పక్షపరాకు పక్షివాహన భక్తరక్షపరాకు రామ.
భద్రేభవరదానభద్రపరాకు చిద్రూపకరుణాసముద్ర పరాకు రామ.

హారమాణిక్యకేయూర పరాకు తారహారయశఃపూర్ణ పరాకు రామ.
కుంభనికుంభనిర్దంభపరాకు గంభీరసమర విజృంభపరాకు రామ.
ఖండాఖండయుద్దండ పరాకు చండప్రచండకోదండపరాకు రామ.
ప్రేమతోభద్రాద్రిధామపరాకు రామదాసపోషరామపరాకు రామపరాకు.

మ. వరదా యాదవవంశభూషణ హరీ వైకుంఠ దీనార్తిసం
హరణానంద ముకుంద మౌనిహృది బ్రహ్మానంద గోవింద శ్రీ
ధర నారాయణ శంఖచక్రధర రాధాలోల కృష్ణాచ్యుతా
మరసంసేవిత బర్హిపింఛయుత సన్మౌనీ జగన్నాయకా.

వ. ఇవ్విధంబున సంబోధించి పిలిచినం బలుకకున్న వెతనొంది మరల రాముని సన్నిధిం జేర్చి పరాకుసేయక నామొఱ యాలకించవైతి వికనైన నా కన్నులకుఁ గానుపించి ముచ్చటలాడవయ్యా స్వామీ యనుచున్నారు.

శా. ఏరా జాలముసేయఁగాఁ దలఁచినా వేమోతలంపైనఁ గా
నీరా దీనులనేఁచ నీకు సరిగానే దోఁచెఁ గాఁబోలు నె
న్నోరూపంబుల సేయ నీమహిమ లేను న్విర్విగా మున్నె వి
న్నారా తాతయగారిముద్ర యెటులైనం దప్పదన్నట్లుగా
రారా నా కభయప్రదాన మియరా రామా మహీజాధిపా.

నాదనామక్రియరాగము - రూపకతాళము.

ముచ్చటైన నాడవేమిరా కోదండపాణి ముచ్చటైన నాడవేమిరా
ముచ్చటైన నాడవేమి ముదముతో మీపాదములు
మఱవకయెప్పుడు నామదిని విడువక దలంచెదనేను ముచ్చ.
ఎందాఁక నేవేఁడుకొందు నేమి సేయుదు నీవేళయందు
చెంతకుఁ జేరితినన్ను జేపట్టుమికఁ మ్రొక్కేను ముచ్చ.
పండ్రెండు యేండ్లాయె నేను బందిఖానలోనెయుండి
నల్లులు దోమలచేత నలుగుచున్నది దేహము ముచ్చ.
చైత్రవైశాఖములిపుడు చెప్పతరముగాదు యెంతో
తహశీలుసేయఁగ నాకు జామీనైన యెవ్వరు లేరు ముచ్చ.
తానీషాగారువచ్చి తహసీల్ జేస్తున్నారు
కాసులుబంపించినన్ను కరుణచేఁ జెరవిడిపించు ముచ్చ.

నేనొక్కఁడను మీకు సుంతనాపై నెనరులేదు
మాతల్లి సీతమ్మకైన మనవిఁ జెప్ప కెటుఁబోతివో ముచ్చ.
ఒంటరిగా నేనుంటె నింటిదగ్గిర యెవ్వరులేరు
జంటాతో సీతాలక్ష్మణులు వెంటనెకూడి మీరొచ్చి ముచ్చ.
వేమాఱు శ్రీభద్రాచల రామస్వామి మీరిప్పుడు
రామదాసుని చేపట్టి రక్షించకున్న ముచ్చ.

వ. వేయివిధంబుల నిన్ను గొల్చిననుఁ గృపరాకపోయెఁగదా యిఁకను మాతల్లి సీతాముఖంబున నీసిగ్గుఁ దీసెద ననుచున్నారు.

కాంభోజిరాగము - జంపెతాళము.

శ్రీరామచంద్ర నీసిగ్గుఁదీతునుజూడు సీతమ్మ సమ్ముఖముగా
తారకుఁడవై భద్రధరణీధరమునందుఁ జేరిననుఁ బ్రోవకున్నా రామన్నా శ్రీరామ.
కులగురునితో నెపుడు కలహమాడుచునుండు కుశికసుతు వెంటఁదగిలి
తలఁపనిష్ఠురమంత్రము నేర్చియంగనను తలధరణిడొల్ల నేసి
చెలఁగి వాసవినొక్క చెట్టుమఱుఁగుననుండి చలపొరీసమయఁ జేసి
తులలేని దుష్కీర్తికులమునకుఁ దెచ్చితివితులవదొరతనముఁ జేసి రామ శ్రీరామ.
కదలివనమున కేఁగి కందమూలాదులను కడువడిని దెచ్చియొసఁగి
ముదముననుగంటికినినిదుఁరదూరముఁ జేసివదలి యాహారవాంఛా
పదునాలుగేఁడులాపదనునోర్చి సదయుఁడై సేవఁజేయ
తుదినొక్కనాఁడైన తోడనుచు మదినెంచి తోయమైననొసంగితేరామ శ్రీరా.
పరమపాతకప్రవృత్తినురుకానలో సీతఁబరిపూర్ణగర్భవతిని
పరగుననువిడుమన్ననుంచినీమది మెలఁగు తెఱఁగెఱిఁగిలక్ష్మణుండు
పరమపావనీ సీతవాల్మీకివనములోఁబరువడిని విడిచివచ్చి
పరమభక్తినినిన్ను భజియించువాని నెదురరాకురాకుపొమ్మంటివిలెమ్మంటివి శ్రీరా.

వ. ఇవ్విధంబున నిష్ఠురోక్తులాడియు రాముఁడు ప్రసన్నుఁడు గాకున్న నిన్నుఁ బరమభాగవతోత్తములగు ప్రహ్లాదాదు లెటుల భజించి కృతార్థులైరో యని నిందాస్తుతి నేయుచున్నారు.

కల్యాణిరాగము - రూపకతాళము.

ఆదరణలేని నీనామమంత్రపఠన మద్రి జేమని చేసెరా రామా.
ఆదినీకు నామీఁదముద మొప్ప దయయుంటె మది దెలిపిమాట్లాడరా రామా ఆదరణ.
పరమద్రోహిని నిన్ను పతితపావనుఁడనీ ప్రహ్లాదుఁడెట్లుతలఁచె
పరమపావని సీతనడవికంపిన పాపకర్మునకుదయవచ్చునా రామా ఆదరణ.
పరబ్రహ్మమనుచునినుఁ బరమేష్ఠి యేరీతిఁ బ్రస్తుతియొనర్చి నమ్మె
పరసతులనక యిలను భంగపరచినవాని వరలక్ష్మియెటు మెచ్చె రామా ఆదరణ.

ఎన్నగాశబరియెంగిలి భక్షణముఁజేసినట్టి వ్యభిచారి వీవో
నిన్నునమ్మఁగరాదు నినుదైవమనరాదు నిజము యీమాటకును రామా ఆదరణ.
ఆదరణలేని నీనామమంత్రంబనుచు నాడితిని నినుఁదూరితి
ముద్దుమాటలుగాని మూర్ఖవాదముగాదు మురహరా ననుఁగావు రామా ఆదరణ.
ముద్దుమోమిటుఁజూపి ముదమొప్పరక్షించు భద్రాద్రిపురిపాలకా
వద్దురా కృపనేలు రామదాసుతో నీకు వైరమా చలమా రామా ఆదరణలేని.

వ. రామదాసుగారిట్లు రిపువ్యథంబునఁ బండ్రెండు సంవత్సరంబు లాచెఱలో తానీష చేఁ బడరానిబాధలం బొందుచుండియు రామునికంటె రక్షకులు లేరని దృఢత్వంబు వహించి ఆడుచుఁ బాడుచు వినయంబున నిష్ఠురవాక్యంబుల నిందాస్తుతులఁ బలుదెఱంగుల స్తుతియించియు రాముండు తనకు ప్రసన్నుండు గాకుండుటకై వగచి సత్వతామసాహంకారంబున రామునిఁగూర్చి నన్ను రక్షింపకుంటివా నీగురుమాతృపితృభ్రాతృకళత్రంబులకుఁ దప్పినవాఁడ వగుదువని యానఁబెట్టుచున్నారు.

కాంభోజిరాగము - చాపుతాళము.

ఆర్తిఁజెందిన నన్నాదరింపకున్న యానబెట్టుదు
నీ మూర్తిఁజూపకున్న మొగపాలనిలఁబడి మొరలుబెట్టుదు.
ధ్రువునిభక్తికిమెచ్చి దృఢపదమిచ్చితి వల్లనాఁడు
అట్లు సవరణగా నన్ను సంతరింపుము సీతాదేవితోడు
నక్రూరుఁడైన యక్రూరునిఁ బ్రోచితి వల్లనాఁడు
అట్లు శక్రపూజితనాదు జాలిమాన్పుము వసిష్ఠుతోడు.
వడికుచేలునవారి సంపదలిచ్చితి వల్లనాఁడు
అట్లు జడుపుఁ దీర్చినన్ను సరసఁజేర్పుము నీతండ్రితోడు.
కాకాసురునిగృపఁ గైకొని కాచితి వల్లనాఁడు
అట్లు పాకారివినుత నాచెఱబాధ మాన్పు కౌసల్యతోడు.
పాంచాలిమొరవిని పక్షముంచితివీ వల్లనాఁడు
అట్లు వాంఛలీడేర్పుము వైకుంఠవాస లక్ష్మణునితోడు.
ప్రహ్లాదునిపరమభక్తినిఁ గాచితి వల్లనాఁడు
అట్టు లాహ్లాదమున నన్నాదరింపుము శత్రుఘ్నుతోడు.
శబరిభక్తికిమెచ్చి చవిగొంటివెంగిలి యల్లనాఁడు
అట్లు శుభములొసఁగినన్ను సురనుతచేపట్టు భరతుతోడు.
బాధలఁబడఁజాల భద్రాద్రివాస నీతోడు
చలము సాధించకువిభవము చవిఁగొందు నీదుపాదములతోడు.

మ. కరినేలింది వహ్ళిక్కి ద్రౌపదికిఁ గోక ల్మెచ్చి యిచ్చింది ద
బ్బర కాకాసురునిం గటాక్షమునఁ జేపట్టిం దబద్ధం బహో
శరణన్న న్విగవానితమ్మునికి రాజ్యం బిచ్చుట ల్గల్ల యి
త్తరి నన్నేలిన నిక్క మీకథ లనంతా భావనారాయణా.

వ. అని యివ్విధంబున సత్యాహంకారంబున రాముని పితృమాతృగురుభ్రాతృలఁ గానలు పెట్టి మఱల స్వామీ యిట్టి స్వాతంత్ర్యంబు వహించి మహాపాతకంబునకు లోనైతినని యపరాధక్షమాపణంబుఁ జేసి పరమభక్తుం డగుట పెట్టిన యానలను దీర్చుచున్నారు.

కాంభోజిరాగము - చాపుతాళము.

అపరాధినై నేనానలుబెట్టితి నమరవందితా
యిదే నెపముజేసుకనన్ను కృపఁజూడమరువకు నిర్మలస్థితా — అపరాధి.
గురునియానఁదీరె కరుణింపఁజూడుము కాకుత్‌స్థాన్వయా
నన్ను సరగునఁ బ్రోవు కౌసల్యయానదీరె సజ్జనప్రియా — అపరాధి.
ఈతప్పుఁగావు నీ తాతయానదీరె భూతనాయకా
రామ సీతయానదీరె శీఘ్రముకృపజూడు శేషతల్పకా — అపరాధి.
భరతునానదీరె భారకుఁడవునీవె భక్తవత్సలా
అత్యాతురుఁడనుగావు శత్రుఘ్ను నానదీరె పరమనిర్మలా — అపరాధి.
మీవాఁడఁబ్రోవు సౌమిత్రియానదీరె మేఘశ్యామలా
రామ యేవారిఁజూచిన నీవారలైనారు భావలోలా — అపరాధి.
నీపై యానదీరె నిజముగ నన్నేలు నిగమసంస్తుతా
రామ నీపాదముల యానబా పెదనన్గావు భూపుత్రీయుతా — అపరాధి.
వాసియౌభద్రాద్రివాసుఁడవై రామదాసునేలవా
నీకు దోసిలొగ్గినవాఁడఁ గాసిఁబొందితి శ్రీనివాసరాఘవా — అపరాధి.

వ అని యివ్విధంబున యానలుదీర్చి వివేకదృష్టిచే నెన్నిదినంబులు బ్రతికియుండినను నొకదినంబున మరణంబు నిత్యంబై యుండ యేల నీ గతి జీవితాశఁగోరి విలపించుట యీవిషంబు గ్రోలి తనువు విడచి యవ్యయంబగురాముని నిలయంబుఁ జెందెదనని నిశ్చయించి యిట్టిసమయంబున సమస్తదుఃఖంబులం బరిత్యజించి యారాముని హృదయకమలకర్ణికయందుంచి పూజింతుఁగాక యని దేహపరిత్యాగంబునందు దృఢనిశ్చయుండై అహో భద్రశైలనివాసా నీకు మానసపూజ సేయ నుపక్రమించెద నను రక్షింపకున్నను నేఁ జేయు పూజలనైనను గైకొనుమని రాముని సన్నిధానంబు కల్పించుకొని యిట్లనుచున్నారు.

శా. ప్రారబ్ధం బెటువంటిదో తెలియ దీపంచేంద్రియంబుల్ మహా
ఘోరం బైనవికారము ల్సలుపు నీగోష్ఠెట్టు నా కబ్బునో
కారుణ్యాకర దీనరక్షక నుతు ల్గావింతు నెట్లైన న
న్నేరందీసి యనుగ్రహించఁ గదవే స్వామీ జగన్నాయకా.

ద్విపద.

శ్రీ రఘుకులసుధాసింధుసంపూర్ణ, తారకనాయకా తారకరామ
కౌసల్యగన్న చక్కనిముద్దురామ, భాసురమగు జగద్వ్యాపకరామ
పాషాణమైచట్టుపడినయహల్య, నలివఁ జేసిన పావనాచార్యరామ
నిరతంబు దేహంబు నీడచందమునఁ, బరగసౌమిత్రినిఁ బాయని రామ
భరతుఁడు ప్రార్థింప పాదుకలొసఁగి, ధరణి నేలించిన దశరథరామ
శత్రుఘ్ను నందు వాత్సల్యంబుగలుగు, శత్రుభీకరరామ సర్వేశరామ
అనురక్తిసీతవామాంకపీఠమునఁ, బనుపడిరాణించుపట్టాభిరామ
మునులు మోహింప నవమోహనాకార, మునిగణనారదమునివంద్యరామ
ఆటోపమునవచ్చు తాటకిఁబట్టి, వేటలాడినరణవిజయాంకరామ
బాహుబలమునను సుబాహురాక్షసుని, మోహరంబణఁచిన మురవైరిరామ
ప్రాంజలీకృతహస్తుఁడై పాదములను, నాంజనేయుఁడుపట్ట నలరారురామ
శబరిభక్తికి మెచ్చి సాయుజ్యమొసఁగి, నిపుణకీర్తులచేత నెలకొన్నరామ
కాంచనహరిణము కాండ మొక్కటను, పంచత్వమొందించి పరగినరామ
శరణంబొచ్చినవిభీషణునిఁ జేపట్టి, యిరవొందఁగా లంక నిచ్చినరామ
జలరాశిగర్వభంజనముఁ గావించి, తిలకించి కోలకుఁ దెచ్చినరామ
పరగధర్మము నాల్గుపాదములనడువ, పరగంగ రాజ్యంబు పాలించురామ
ధ్యానము సేతుచిత్తమున నీమూర్తి, యానందమొంది నే నార్తితో రామ
ఆవాహనము సేతు నతిశీఘ్రముగను, రావయ్య నీలనీరదగాత్రరామ
నవరత్నసింహాసనము సమర్పింతు, నవిరళభక్తిచే నలరుచురామ
నిరుపమాంబువులచే నీకొసంగెదను, కరమర్ఘ్యపాద్యముఁ గైకొమ్ము రామ
ఘుగఘుగవాసించుపునుఁగు జవ్వాది, నగరు గంధము నీకు నర్పింతురామ
సన్నజాజులు మంచిసంపంగివిరుల, పున్నాగములనిన్నుఁ బూజింతురామ
క్రమమున నీకుఁ బ్రకాశింపఁ జేతుఁ, దిమిరాపహార మగుదీపము రామ
సారంపురుచులచేఁ జతుర్విధాన్నములు, ఆరగించఁగనీకు నర్పింతురామ
కర్పూరసంయుక్త క్రముకపర్ణములు, నర్పింతు నీకు ప్రియంబుగ రామ
కెంపురాజోతులఁ గీలించి మించు, నింపుగనివ్వాళి లిచ్చెదరామ
మిసిమిదిక్కులమించు మేకిరీటమున, పొసఁగనిడుదును మంత్రపుష్పంబురామ
జడిగొనిముత్యాల జల్లులు వెలయ, గొడుగు గైకొనుమిమ్ముఁ గొలిచెదరామ

అడపముగొని పండుటాకులుమడిచి, యెడనెడతాంబూల మిచ్చెదరామ
శృంగారముగను మీచెంగట నిలిచి, బంగారుకడిగము పట్టెద రామ
రంజిల్లుమీశరీరము సెగదీర, వింజామరల మీకు విసరెద రామ
ఉడుగుకెంపులను రాణించుపాదుకలఁ, దొడరిమీపాదములఁ దొడిగెదరామ
ప్రణుతియొనర్తు మీపదపద్మములకు, ఘనమతిసాష్టాంగనతులఁ శ్రీ రామ.

వ. ఈక్రమంబున రామదాసుగారు మానసధ్యానక్రమంబున రామసాన్నిధ్యంబుఁ గల్పించుకొని మానసపూజసేయ నారంభించుచున్నారు.

శంకరాభరణరాగము - చాపుతాళము.

ఆరాధయామి శ్రీ నారాయణానంత ఘోరసంసారవిదూరనిగారా.
ఆరాధయామి శ్రీ రఘురామా అహ మారాధయామి శ్రీరఘురామా.
ఆవాహనాదిషోడశోపచారము సోఽహం బ్రహ్మమ్ముల దేహాభిమానముల
నావాహయామి శ్రీరఘురామ అహ మావాహయామి శ్రీరఘురామా.
భాసురమైనహృత్పద్మమునందు నివాసుఁడవైనట్టి వాసుదేవనీకు
ఆసనమిదిగొ శ్రీరఘురామా సింహాసనమిదిగొ శ్రీరఘురామా.
విద్యుత్ప్రకాశా విద్యానాశన శర్వబోధ్య వేద్యసంవేద్య చిద్రూపా
పాద్యములిదిగొ శ్రీరఘురామా నీకు పాద్యములిదిగొ శ్రీరఘురామా.
స్వర్గాదిభోగముల దుర్గతిగానెంచి సర్గప్రాణేంద్రియవర్గాదుల
నీ కర్ఘ్యములిదిగొ శ్రీరఘురామా నీ కర్ఘ్యములిదిగొ శ్రీరఘురామా.
వాచామగోచర యోగ చిదాత్మకసర్వ వాచ్యార్థములు మాని మీచెంతఁజేరుట
యాచమనము మీకు రఘురామా శుద్ధాచమనము మీకు రఘురామా.
పంచభూతోత్పన్నపంచేంద్రియ మనః పంచప్రాణముల నుంచుటమీయందుఁ
బంచామృతము నీకు రఘురామా నీకు పంచామృతము నీకు రఘురామా.
మానాభిమానములు మాని సువిజ్ఞానస్వానుభవమునందు మీనామామృతశుద్ధ
స్నానములిదిగొ శ్రీరఘురామా శుద్ధస్నానములిదిగొ శ్రీరఘురామా.
చిత్రవిచిత్రమాయాకల్పరహిత చిద్రూపతేజాశావస్త్రుఁడవగునీకు
వస్త్రములిదిగొ శ్రీరఘురామా కాంచన వస్త్రములిదిగొ శ్రీరఘు.
అజ్ఞాననాశన ప్రజ్ఞానఘన సర్వయజ్ఞపావకనీకు సుజ్ఞానసూత్రము
యజ్ఞోపవీతము రఘురామా సు యజ్ఞోపవీతము శ్రీరఘు.
అచలత్వామరత్వ అగణితానందాని అచలత్వామరత్వ ఆద్యంతరహితత్వ
ఆభరణములొప్పు రఘురామా రత్నాభరణములొప్పు శ్రీరఘు.
బంధమోక్షములేక నందఱియందున్న సుందరరూపానందగోవింద శ్రీ
గంధమిదిగొ నీకు రఘురామా శ్రీగంధమునిదిగొ నీకు రఘు.
తెలివిమఱపులులేక కలకాలమందుండి తళుకుతళుకున సిరులొలుకుచిదానంద
తిలకములిదిగొ శ్రీరఘురామా కస్తూరి తిలకములిదిగొ శ్రీరఘు.

ఈక్షణంబున నీదీక్షనుగావించి పక్షివాహన ని న్నీక్షించుట యనెడి
యక్షత లివిగో శ్రీరఘురామా మంచి యక్షత లివిగో శ్రీరఘు.
దుష్ప్రజ్ఞలనుమాని సత్ప్రజ్ఞలను బూని నిష్ప్రపంచుఁడనీకు స్వస్వరూపజ్ఞాన
పుష్పములిదిగో శ్రీరఘురామా స్వర్ణపుష్పములిదిగో శ్రీరఘు.
నాపాలిదైవమ యోపరమేశా నీపాలఁ బడితిని కాపాడవేరామ
ధూపము లిదిగో శ్రీ రఘురామా నీకు ధూపము లిదిగో శ్రీరఘు.
పాపనాశన నామరూపరహిత సర్వవ్యాపక విజ్ఞానదీపమై వెలుఁగొందు
దీపములిదిగో శ్రీరఘురామా నీకు దీపము లిదిగో శ్రీరఘు.
దేవాదిదేవ సుపావనచారిత్ర జీవపరమాత్మైక్యభావభావాతీత
నైవేద్యము నీకు రఘురామా మహానైవేద్యము నీకు శ్రీరఘు.
దంభదర్పాద్యహంభావములుమాని శంభుపూజిత చిద్బింబమంచని యెంతు
తాంబూలమిదిగో శ్రీరఘురామా తాంబూలమిదిగో శ్రీరఘు.
దానవనాశన దామోదరానంత దీనపోషణ నీకు దానమిత్తు మనో
దక్షిణలిదిగో శ్రీరఘురామా మనోదక్షిణలిదిగో శ్రీరఘు.
నక్షత్రసూర్యోర్యభాలినచంద్రతారకా సత్యప్రకాశనిరంజన
నీరాజనంబులు శ్రీరఘురామా ఉత్తర నీరాజనంబులు శ్రీరఘు.
సంతసంబున నేకాంతభక్తిని నిరంతరంబును శుద్ధాంతఃకరణుఁడగు
మంత్రపుష్పములిదిగో శ్రీరఘురామా నీకు మంత్రపుష్పములిదిగో శ్రీరఘు.
వ్యష్టిసమష్ట్యాదిసృష్టి రహిత బ్రహ్మనిష్ఠతోడుత సంతుష్టుండగుటయె
సాష్టాంగనతులు శ్రీరఘురామా నీకు సాష్టాంగనతులు శ్రీరఘు.
స్వామిభద్రగిరిధామ పావననామ సోమసూర్యనేత్ర రామదాసుఁడనై
నీమముగఁజేయుదు రఘురామా పూజ నీమముగఁజేయుదు శ్రీరఘురామా.

వ. ఇవ్విధంబున మానసపూజఁ గావించి తన్మయంబున నిర్మలాంతఃకరణంబున రామునింగూర్చి రామభజన సేయుచున్నారు.

మ. ఖగరాడ్వాహన కైటభారి రిపుజిత్కంఠీర వానంత ప
న్నగరాట్తల్పశయాన వేణుమురళీనాదానుమోదాత్మ స
న్నిగమాంత స్తుత భక్తవత్సల హరీ నిత్యానుకంపానిధీ
నగరాడ్ధీర నృసింహ విష్ణుపరమానందా జగన్నాయకా.

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

రామం రామం రామం శ్రీరఘు రామం రామం రామం.
నరహరి దేవ జనార్దన కేశవ నారాయణ కనకాంబరధారీ రామం.
రవికులాభరణ కపిసుతసఖ్యా రాక్షససంహార రాజసేవితా రామం.
పన్నగశయనా పతితపావనా కన్నతండ్రి యోకరుణాసాగర రామం.

కంతుజనక త్రిపురాంతక నరహరి సీతానాయక శ్రీరఘునాయక రామం.
సుందర శ్రీధర మందరోద్ధరా మకుటభూషణా మృద్భక్షక హరి రామం.
నందనందనానందముకుందా బృందావన గోబృంద విహారీ రామం.
వామన మాధవ వైకుంఠాధిప దేవావన ప్రాగ్దేవవిదారీ రామం.
పంకజలోచన పరమదయాళో శంకరనతనుత సర్వేశ్వర హరి రామం.
పుండరీకవర దాండజవాహన చండనిశాచర ఖండనధారీ రామం.
అంబరీషవర దాంబుజలోచన అంబుధిబంధన అమితపరాక్రమ రామం.
భానుకులేశా భవభయనాశా భాసురహాసా భద్రగిరీశా రామం.

వ. ఇవ్విధంబునఁ జెఱలో నత్యంతదుఃఖార్తుండై రామస్మరణ జేయుచు మైమరచియున్న దాసునిం గాంచి శ్రీరాముండు లక్ష్మణుం జూచియిట్లనియె.

*అన్న లక్ష్మణా చెఱలోనికి నీ వతిశీఘ్రంబునఁ జనుము
విన్నఁదనంబున దాసుఁ డున్న వాఁ డెన్నికతోఁ గనుము.
గిన్నె నున్న విషమంతయుఁ జల్లుము తిన్నఁదనముగాను
గ్రన్నన దాసునిఁ జూడవలయును వెన్నడి వచ్చెదను.
అని గోల్కొండనబాబు కైవడిని యాకారముఁ దాల్చి
వెనుకొని తనతమ్మునితో నడిచెను విబుధులెల్ల మెచ్చన్.

ఆ. త్వరగలక్ష్మణుండు చెఱసాలకరిగిన, రామదేవుఁడపుడురయముగాను
లోనికరిగి కాంచెదీనుఁడై పడియున్న, రామదాసుఁ బోలురామదాసు.

నాదనామక్రియరాగము - ఏకతాళము.

రామదాసునిఁజూచిరి రామలక్ష్మణులు రామదాసునిఁ జూచిరి
నీమమొప్పఁదానీష పైకమును తాముచెల్లగట్టిన తక్షణమున రామ.
గనుఁగొన ఘోరముగాను పద కరముల శృంఖలములను
పెనఁగొని జడలమరగను మనమున దము మరవకను
యినకులతిలకా యిటు చేయుంట మగతనమే
యాశ్రితజనపాలకుఁ డనుఘనకీర్తిఁ గైకొనలేవై లివి
కనికరంబుగనుఁగొనఁ గలికమునకుఁ గనుబడదిఁక యేమనఁగల తండ్రీయని
మనమునఁదోఁచినదుఃఖంబునఁ గనుంగవ నశ్రువులుంచుక
మన్మథజనక నీవె గతియని మైమరచిన రామ.
నల్లులు దోమలు దేహము చిల్లులు చేయఁగను
తల్లడిల్లిపగను దాసుం డుల్ల మెఱియగాను
ముల్లోకంబున నెల్లజనులు శ్రీవల్లభుఁ డీతఁడు చల్లనివాఁడని
గొల్లగబాడఁగ నుల్లసిల్లి నాయుల్లంబును నీపల్లవపదముల
కిల్లుఁ జేసి సేవల్లకిఁ గైకొని యల్లడిఁ బాడినఁ గల్లలాడునీగొల్లబుద్ధి

నా కెల్లఁజూపి నన్నల్లరిచేసితి వొల్లప్రాణమును రామ.
రామరామయనుచు భక్తుని ప్రేమఁజూడుమనుచు
సామజవరదాయనుచు నా స్వామివినీవనుచుఁ
గామజనక నానీమము దప్పక రామరామ శ్రీరామరామ
యని వేమఱుపొగడుచుఁ గామమోహముల కామించక
నీధామము చేరెద నీమహీతలములో మముఁ బ్రోవనీ
రామనామమును కామింపరు జనులోమహాత్మ యిది
నీమనముననిడి స్వామిభద్రగిరిధామ ప్రోవుమను రామ.

వ. ఇటులున్న దాసునిం గాంచి.

* కన్నులనీరిడి రామచంద్రుఁ డాపన్ననిఁ జూచుచునుండెన్
అన్నయాజ్ఞఁ గావించి లక్ష్మణుఁడు హాజరుగా నుండెన్.
రాముఁడు దాసుని కృపతోఁజూచుచు రంజిల్లుచు నిట్లనియెన్
రామదాస నీభక్తికిమెచ్చెను రాముఁడు లెమ్మనియెన్.
అనవినిదాసుఁడు కన్నులువిచ్చెను నానందాశ్రువులొలుకన్
ఘనవేగంబున లక్ష్మణుఁదోడుక కాకుత్స్థుఁడు జరిగెన్.
వింతయిదేమని వెదికెనుదాసుఁడు విషముంచినపాత్రమును
కంతుఁజనకుఁడీవింతఁ జేసెనని స్వాంతంబునఁ దలఁచుచును.

వ. లేచి నలుదిక్కులు గలయంజూచి తా నుంచినస్థలంబున విషంబును తత్పాత్రంబునుంగానక కారాగృహంబగుటవుడమింజేయిడితడవిన విషంబు మన్నునంగలసిబోరగిలంబడియున్న పాత్రంగాంచియిది రాముని మాయావిశేషంబని తలంచి అహో రామచంద్రప్రభో యేల యింత రావుఁ జేసెదు నీమహిమ లెటులెంగి వర్ణింప నేర్చువార లెవ్వరు స్వామీ యనుచున్నారు.

సీ. భరతశాస్త్రముల దప్పనియాట లటుపెట్టి ధూర్తకోణంగిగంతులకు మెత్తు
మహిఁ దిరుమాముడిమంత్రంబు లటుపెట్టి నేరక నారన్న నెరయమెత్తు
వేదపారగుల వివేకంబు లటుపెట్టి వెలివాడదాసర్లవిందు మెత్తు
దోమిచ్చునట్టిసాధులచేష్ట మటుపెట్టి తెరవాటుగొట్టుతస్కరుల మెత్తు
తే. పూజ లటుపెట్టి యెరమట్టిపూజ మెత్తు, గిరులవనివారి నటుపెట్టి యుంరుత మెత్తు
బంధువర్గంబు లటుపెట్టి పరగ మెత్తు, నీమహిమఁ దెలియఁడు లెవ్వరో మహాత్మ.

కల్యాణిరాగము - రూపకము

ఏమయ్య రామ బ్రహ్మేంద్రాదులకునైన నీమాయఁ దెలియవశమా
కామారివినుతగుణధామ కువలయదళశ్యామ ననుగన్నతండ్రి రామా ఏ.

సుతుఁడనుచు దశరథుఁడు హితుఁడనుచు సుగ్రీవుఁ డతిబలుం డనుచుఁ గపులా
క్షితినాథుఁడనుచుభూపతులు గొలిచిరిగాని పతితపావనుఁడనుచు మతిఁదెలియలేరైరిఏ.
చెలికాఁడనుచు పాండవులు విరోధివటంచు నలజరాసంధాదులు
కలవాఁడవనిఘచేలుండు నెఱిఁగిరిగాని జలజాక్షుఁడనినిన్ను సేవింపలేరైరి ఏ.
సదుఁడవనినరులు తమ దొరవనుచు యాదవులు పరుఁడనుచు గోపసతులు
కరివరద భద్రాద్రిపురనిలయ రామదాస పరమాత్ముఁడనినిన్ను భావింపలేరైరి ఏ.

వ. ఇవ్విధంబున రామదాసు చెఱలో శ్రీరామదేవుని మహిమాభివర్ణనంబు సేయుచుండ తానీష యారేయి నంతఃపురంబున జరిగినవృత్తాంతంబున కాశ్చర్యమగ్నుండై భార్యాద్వితీయుండై యాలోచించుచు వేగుటయు తనముందు రాసిబోసియుండు రామమోహారీలం గాంచి తాఁ గన్నది కలగా దనియును యిది రామదేవుండుఁ జేసిన లీలలని యెఱింగి తనభార్యామణితో నిట్లనుచున్నాఁడు.

శహానరాగము - ఆదితాళము.

కలికిరో నేఁగన్న కలనిజమాయెనె కలకలకలికదీరనే.
కలకలస్థితులన్ని మేల్కనఁగలిగెనటులనౌ తెలియఁబలికెదఁ
దలఁపులఁకనీడేర మనకిఁక తలకవలవదు ధన్యులైతిమి కలికి.
రామలక్ష్మణమూర్తులే భద్రాచల ధాములైనవారలే
రామదాసుజవాన్లటంచును రామదాసుండనిపె ననుచును
రామదాసుని బాకిపైకమును తామిపుడె చెల్లించిపోయిరి కలికి.
భక్తపరాధీనులే శ్రీరాములు భవభయ పరిహారులే
భక్తశేఖరుఁడైన యలగోపన్న బందీఖాన బంధ
విముక్తునిఁగఁజేయుటకుఁ దామనురక్తితోవిచ్చేసిరిట్టుల కలికి.
కరుణారసమూర్తులే గరితరో వినవె పరికింపలేవైతివే
కరిమకరిచేఁజిక్కి హరిహరికరుణజూడు మటంచు మొఱలిడ
కరినిఁగాచినకరణి నాతని బిరబిరను కరుణించిచనిరి కలికి.
విపులశాంతమతులె సుందరులె కపటమానసయుతులే
కపటనాటకసూత్రధారులె కామితార్థ ఫలప్రదాతలె
అపరిమితకరుణాకటాక్షులె యార్తజనశరణైకదక్షులె కలికి.
పతితపావననాముఁడే శ్రీరాముఁడు నతభక్తజనపాలుఁడే
అతిపవిను శ్రీహరిమనం బేకాంతభక్తుం డెఱుఁగుఁగావున
నతనికతని కభేదమగుటను యతనిపని తనపనిగఁ జేసెను కలికి.
మున్నుఁజేసిన సుకృతఫలమున రామన్నను బొడఁగంటినే
కన్నుగానక పెద్దలకు నపకారములునేఁ జేయునదిమది
యెన్నకను మన్నించి దర్శనమిచ్చిపైకముఁ గట్టిపోయిరి కలికి.

ఏమిశ్లోఁచకపోయెనే శ్రీరాముల మోముఁగన్గొనినంతనె
యేమిశ్లోఁచక పోవటేమో యీమహామహిమాయలేమో
రామఁభాత్ముఁడను నేనా స్వామి మహిమలు తెలియనేర్తునె కలిక.
ఎంతకరుణఁజూడవే శ్రీరాములు వింతఁజేసెఁగదవె
చింతఁదీర్చను రామదాసుం డెంతభక్తుం డొటనో భగ
వంతుఁడని నేనెఱుఁగనైతిని వంతగించితి తుచ్ఛమతినై కలిక.

వ. ఇవ్విధంబున రామునకు తానపచారంబు జేసినవానిఁగా భావించి మఱియు నేమని దుఃఖింపుచున్నాఁడు.

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

బిన్ మల్లా ఇబ్ర్హీమాన్ నిబ్ర్హీమ్
బనామేజహాన్ దాకే జాన్ అఫ్రీఇ, హాకీమే సఖున్ బర్ సుబా అఫ్రీఇ
ఖుదావన్ద్ బక్షీన్దయే దస్గీర్, కరీమేకతాబక్ష్ ఒపోసిష్ ఫిసీర్,
చెవున్ర్ ఆవరమ్ అన్నంగే తర్దామనీ, మగర్ ఇబ్న్ పేషావరం కయేకనీ
ఫకీరం బజుర్మే గునాహం మగీర్, గనీరాతఖహం బువద్ బర్ఫకీర్
బిన్ అల్ నయూపూర్ దం ఇల్లావుమీద్, ఖుదాయూసీ అఫ్ అం మకున్ నావుమీన్.

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

తెలియక నే మోసపోతినీ దేవదేవుఁడని తెలియనైతినీ.
నలినాక్షి వినవె కేవలమగు శ్రీభద్రాచలధాముఁలైన
శ్రీరామలక్ష్మణుల నిశ్చలముగ వివరించనైతినిఁజాల నిసిలో
ద్వారమందున తలుపుఁగొట్టుచుఁబిల్వఁగా సామాన్యులనియెంచుకొంటిని తెలి.
రక్షించుమనివేఁడనైతిని ద్రవ్యా పేక్షగల్గినవాఁడనైతిని
తత్క్షణమున నాఋలక్షలవరహా ల్నిర్లక్ష్యముగ నొసఁగిన సాక్షాత్కారులను
పక్షమున కరుణాకటాక్షవీక్షణాలంకార దానవ
శిక్షసజ్జన పక్ష భువనరక్ష నను రక్షించుమని నే తెలి.
కనకాసనమియ్యనైతిని కస్తూరిగంధమ్ముఁ బూయనైతినీ
ధనముఁజూచి మోహమునఁ దబ్బిబ్బైతిని మనమునఁనతఁడా దేవుఁడనుచు
భక్తివినయ పూర్వకముగను బొగడుచు వేగమున శ్రీపాదపద్మము
నెనరుమీరఁగఁ బట్టుకొని నన్నేలుకొమ్మని యడుగనైతిని తెలి.
పసిఁడిశాలువఁ గప్పనైతిని మంచి పన్నీరునేఁ జిల్కనైతిని
విశదంబుగలంక వేగమెకృపతోను దశకంఠానుజునకు మసలకయొసఁగియు
శశిముఖి సీతతో భద్రాచలమునను వసియించివేఁడుక
వసుధలోపల రామదాసునిఁ బొసఁగనేలిన రామచంద్రుని తెలియక.

వ. అని మఱియు నేమనుచున్నాఁడు.

కానడరాగము - ఏకతాళము.

కలనిజమాయనే ఓకలికిరో వినవే కలనిజమాయనే.
చూపుఁబాలులె సొగసైనరైవతులె రేపురాగే ఓరాణిమహమ్మదులె కలనిజ.
సామదిలోన నరులనఁగారే ఈమహిలోనే సెఱుఁగనివారలె కలనిజ.
పురుషులు సూడఁగ ఖురాణపురుషులే మర్యాదులే మహానుభావులె కలనిజ.
దాసజవానులే జాతికబీరులె వాసవినుతులే వారిజనేత్రులె కలనిజ.
భద్రాద్రివాసులె భవ్యయశోద్భానులె భద్రాత్మరామదాసపాలితచిద్విలాసులే కలనిజ.

* అతివేగంబున నాస్థానంబున కరుగుదెంచి మంత్రులను
హితమతిఁ గనుఁగొని యిట్లనిపల్కెను యీతత్క్షణమునను
బేడీలూడఁగఁ దీసిదాసుని గాడీలోపలనుంచి
వాడవాడజనులెల్ల మ్రొక్కులిడ నీడకుఁదెప్పించి.
మామందట నిడవలెననిపల్కిన మంచికాలమని యెంచి
మామలువేగమె యల్లునిదెచ్చిరి మర్యాదలు గావించి.
చూచెను దాసునిఘోరరూపమునుఁ జోద్యమంది తానీషా
యోచనఁ జేసెను యెంతఁ జేసితిని యుక్తముఁగానిమనీషా.
హరిదాసునితో మనవిఁ జేసుకొనె హైద్రాబాదునబాబు.
పరమపాపినగు నాభూమిని నిలు పదిదినములు బాబు
దీనుఁడ కృపణుఁడ క్రూరకర్ముఁడను దివ్యదృష్టిఁ జూడు
భూనుత భూసురవర్య మ్రొక్కెదను బ్రోవకవిడ నేఁడు.
కామమోహములఁ గట్టుబడని యాకరుణాకరుఁ డపుడు
భూమీశ్వరుతో నిట్లనె రాముఁడు ముదమందెను నేఁడు.

. వ. ఈప్రకారంబున రామదాసుగారు తానీషం జూచి రాముండు నినుఁ బ్రోవఁగలండని చెప్పిన విని తానీష యిట్లనుచున్నాఁడు.

ఉ. ఎవ్వఁడు సత్యశాంతధనుఁ డెవ్వఁడు దైవము తానయైనవాఁ
డెవ్వఁ డతిప్రతాపయశుఁ డెవ్వఁడు సాత్త్వికమూర్తిచెప్పఁడా
యెవ్వనినామముల్ నుడువ నెల్లభవంబులు వాయు నాత్మలో
నెవ్వనినిల్పు దవ్వరదుఁ డెవ్వఁడు గల్గు మదిష్టసిద్ధికిన్.
వ. అని మఱియును.

ఉ. పుట్టినవారిలోను నీకఁ బుట్టెడివారలలోనఁ జావునుం
బుట్టువు లేనిమం దొసఁగు పుణ్యచరిత్రకుఁ డొక్కఁ డెందునుం

బుట్టఁడు తత్కథానుభవబుద్ధి మనంబునఁ బుట్టి నేఁడు నా
కట్టిమహాత్ముఁ డట్టిచరితార్థుఁడు గల్గినవానిఁ జెప్పవే.

వ. అనియడిగిన ప్రశ్నకు నమ్మహాత్ముండు హర్షించి యతండు యవన
జాతుండని యెంచక దివ్యదృష్టిఁజూచి యిట్లనియె.

గీ. విష్ణుదేవునంశమునను నావిర్భవించె, సత్యసంధుఁడు రణజయశాలి యొకఁడు
రామదేవుఁ డన్పట్టపురాజుగలఁడు, దేవుఁ డనుమాత్రమే దేవదేవుఁ డతఁడు.

వ కావున.

కల్యాణిరాగము - చాపుతాళము.

రామరామయని నోట రవ్వంతసేపైన నీమముదప్పక
మంచినీతిలోఁ బలుకనివాఁడు మత్తుఁడు మూఢచిత్తుఁడు రామ.
దేహముశాశ్వతమని తెలియక దుర్బుద్ధిచేత సాహసమున
సాధుజనుల సంకటపెట్టేటివాఁడు పాతకీ బ్రహ్మఘాతకీ రామ.
కండలుపెంచుచు నేను దండివాఁడననుచుఁ జాల చెండితనములుగలిగి
పరులదండనఁ గోరేటివాఁడు నిక్కనా భువిలో దక్కనా రామ.
మన్ననతోఁ బిన్న పెద్దల కన్నులఁగానకను భాగ్యం బున్నదనిగర్వమున
నతిథుల కన్నముఁబెట్టనివాఁడు హీనుఁడు దుస్సంధానుఁడు రామ.
ధనమెంతో కలిగియున్న దానధర్మములేనివాఁడు హీనుఁడయ్యె
భూమిలోను యెన్నాళ్ళు బ్రతికిన యేటికీ ముమ్మాటికీ రామ.
పరిపాటితెలియకను బరులద్రవ్య మపహరించి కరుణలేకను
పేదసాదల కష్టముఁబెట్టేటివాఁడు తట్టుగా తుదముట్టునా రామ.
దూరభారముఁదెలియలేక దుర్బుద్ధితలపోసి మేరఁదప్పి
పరులసతుల మెల్లనపొందేటివానికి మోసము చాలాదోషము రామ.
స్నేహముఁజేసినవానికి ద్రోహముఁజేసినవాని కూహాకమునయమునిదూతలు
కులిశమునను మెండుకత్తుల గోతురూ గొఱఁతవేతురూ రామ.
రామదాసునేలినట్టి ప్రేమతో శ్రీభద్రశైలధామ
సీతారామచంద్రుల కామించికొలువకున్న గొబ్బున మోక్షమబ్బునా రామ.

వ. అట్లగుటంజేసి.

గీ. రామరామరామ రాఘవరామశ్రీ, రామరామరామ రామచంద్ర
రామరామరామ రామభద్రాయని, రామనామమే నిరతముఁ దలఁతు.

వ. ఇటుదలంతుఁ గావున నతం డాపద్బాంధవుండై రక్షించుచున్న
నతండు నీకేతీరు బంధుత్వంబనిన రామదాసుగారు యిట్లనుచున్నారు.

కాంభోజిరాగము - చాపుతాళము.

దినకరవంశపావనులైన శ్రీరామదేవుఁడే మాతండ్రి
అల్ల జనకుని పూర్వసంచితభాగ్యమునఁ గన్నజానకి మాతల్లిగా దిన.

కలుకుబంగరుచాయగలలక్ష్మణుఁడుమాకు నక్కయ్యగావలెగా
అల్ల పరమభక్తినియన్న పాదుకలర్చించు భరతుఁడేమాబావగా దిన.
శత్రులనిర్జించుశత్రుఘ్నులు మాకుఁ జిట్టన్న గావలెగా
అల్ల క్షత్రధర్మమునందు సర్వజ్ఞులైన కుశలవులే యన్నలుగా దిన.
దశరథజనకభూధవులిద్దఱు మాకుఁ దాతలుగావలెగా
అల్ల విశదముగా వారివెలఁదులుమాకు ముత్తవతల్లులగుదురుగా దిన.
పవనతనయ జాంబవంతాది కపులెల్ల బలువైనబంధులుగా
వారి వికసిసేవించిన ఘనులెల్లను మాకు ఘనమైనయాప్తులుగా దిన.
పరభద్రగిరిరఘువరుని వంశజులెల్ల వసుధదాయాదులుగా
ఈధరను సీతారామదాసుఁడననిపించి దైవమీఁడేర్చెఁగదా దిన.

వ. ఈప్రకారంబున రామదాసుగారు తనకు రామునకుంగలబంధుత్వం బెఱుకపరచి నేను కృతార్థుండనైతి ననిన తానీష నేను భాగవతాపచారంబు జేసినవాఁడ నేగతి యొందుఁజొత్తునని దుఃఖార్తుం డగుచుండ రామదాసుగారు ఇట్లనుచున్నారు.

కల్యాణిరాగము - చాపుతాళము.

దర్శనమిచ్చెను రాములునీకు దర్శనమిచ్చెను.
దర్శనమిచ్చెను దశరథతనయుఁడు పరమపావనిసీతా భామనేలినవాఁడు దర్శ.
శుభమనితనదగు విభవముగొనియాడు ప్రభులకుశాశ్వతశుభములిచ్చెడివాఁడు దర్శ.
దండములిడితనదండఁగోరినవారి దండిగఁ బ్రోచేటియండజవాహనుఁడు దర్శ.
పరమభక్తులనెల్లపాలింతునని చాల కరుణచేఁగరమునబిరుదుదాల్చినవాఁడు దర్శ.
వాసిగభద్రగిరివాసుఁడైనదాసజనుల దోషములెంచక రామదాసునేలినవాఁడు దర్శ.
* దర్శనమిచ్చెను రాముఁడు గావున ధన్యుఁడ వీవనియోర్
పరమునిఁ దలఁచుచు పాలింపుము భువి ప్రాజ్ఞతతో ననియెన్.

వ. లోకైకశరణ్యుఁడగు రాముండు ముదంబు నొందుటచేత మీరు ధన్యాత్ములని రామదాసుగారు తానీషను స్తుతియింపఁ దానీషా మీరు లోకంబునఁ గలుగుపామరులఁ దరింపం జేయఁగలయాచార్యులని తానీషా గోపన్నగార్లు సంవాదము సేయుచున్నారు.

పంతువరాళిరాగము - ఏకతాళము.

గో. ధన్యుఁడైనావుతానీషారాజేంద్ర చంద్ర ధన్యుఁడైనావుతానీషాధన్యుఁడైనావు నేడు
దాశరథినిఁజూచినావు మాన్యులలో మాన్యుఁడగుచు మహిని వెలసినావు నీవు.
తా. గురుఁడవైనావుగోపన్నామాఁబోట్లకెల్లఁ బరముదెల్పినావుగావునాగురుఁడవైనావు
నీవు గుఱుతెఱిఁగి బ్రహ్మజునకు పరమపదముగాంచురీతిఁబరమసులభమను-దుఁదెలిపి.

గో.రాములేఁగుదెంచినారుగారాజేంద్రచంద్ర ప్రేమమోముఁజూపినారుగారాములేగు
దెంచినారుప్రేమమోముఁజూపినారుభూమిలోననీవంటిపుణ్యమూర్తిఁగాననెందు.
తా.ఇంతవాఁడవనుచుఁదెలియకా ఓభూసురేంద్ర పంతగించిబాధపెడితిగా యింతవాఁ
డవనియెఱుఁగ కంతబాధపెడితిగత్యంతరంబులేదు నాయంత పాపిగలఁడె భువిని.
గో.మేటిజన్మమగునుభూపతి రాజేంద్రచంద్ర పాటవమున రాముఁగాంచితీ మేటిజన్మ
మగునుమీఁదిపాటవమున రాముఁగాంచి తేటిమాటవినుము నీసాటివారులేరుజగతి.
తా.ధనముపుచ్చుకొనుడువేగమె భూసురేంద్ర చనుఁడు భద్రగిరికిశీఘ్రమె ధనముపుచ్చు
కొనుఁడువేచనుడుభద్రగిరికి నామనవివినుడు రామచంద్రుమహితభక్తిగొలువుడెపుడు.
గో.ఇటులమీరుపలుకఁబాడియెరాజేంద్రచంద్ర పటుధనంబుఁగొనుటమేరయెయిటుల
బలుకరాదుమీపటుధనంబుమాకేల జటిలులుండుభద్రగిరినికటమునందునుండబనుపు.
తా.మీరలొల్లకున్నపైకము ఓభూసురేంద్ర మారజనకు పూజకొసఁగుము
మీరలొల్లకున్నపైకమారమాపతికొసంగిమీరుధర్మపాలనంబుకోరినడుపుచుండవలయు
గో.వింతతలఁపుగలిగెభూవరారాజేంద్రచంద్రవంతలెల్లఁదీర్చెధీవరా వింతతలఁపుగలిగె
నీవంతలెల్లఁదీరనే నెంతో పుణ్యవంతుఁడైతి నింతకొలువు దొరికెగనుక.
తా.భద్రగిరిని జాగీరుగా ఓభూసురేంద్రరుద్రనుతున కిత్తుఁబ్రీతిగా భద్రగిరినిజాగీరు
రుద్రనుతున కిత్తుఁగాన ముద్రనిశానీలనంది భద్రముగనుజనుడుమీరు.
గో.మేలుమేలు యవనభూపతీ రాజేంద్రచంద్ర చాలఁజేయ నిన్ను సంస్తుతి
మేలు మేలు మెచ్చువచ్చెఁ జాలుచాలు భద్రశైల మేలురామచంద్ర
భూపాలుఁ డెపుడు నిన్నుఁబ్రోచు.

వ ఇవ్విధంబున రామదాసుగారును తానీషయును నిష్టాగోష్ఠివినోదంబులం బ్రొద్దుబుచ్చుచుఁ గతిపయదినంబులు గోల్కొండయందు వసియించియుండెనంత నక్కడ భద్రాచలంబునఁ దానీషాపైకము రామలక్ష్మణులు చెల్లించిన మరుసటిదిన ముదయంబున.

* తానమాడి వేకువను నర్చకులు తలుపుదీయుకాలములో
తానిష కగపడినట్టిరూపమునఁ దాముండిరి కోవెలలో.
చూచిరి రామునివింత వేషమునుఁ జోద్యమంది యర్చకులు
వేచని యముల్దారునితోఁ జెప్పిరి వెసనడిచినకథలు.
పక్షివాహనునిఁ దట్టినిఁ దానిషబటువగు ముద్రనుగాంచి
తత్క్షణమున తానీషకనుపుటయె తనకు మంచిదనియెంచి.

క బేగీరావులరమ్మని, వేగంబున గోలకొండవిభునికడకు మీ
రేఁగియొసంగుఁడుదట్టిని,యాగడమేమో యెఱుంగమనియతఁడనిపెన్,

వ. వార లతిత్వరితగతిం గోల్కొండకుఁ జనుదెంచి సమస్తజన సంపన్నంబును సకలవైభవకలితంబును నగు తానీష పేరోలగంబున నుండియును రామదాసుగారిం జెంతఁ గూర్చుండఁ బెట్టుకొనియుండ నా బేగిరావులు దట్టిఁ బ్రభుముఁగలనిడఁ దానీష యిదేమనిన.

* రాజవర్య భద్రాద్రి వెలయు శ్రీరామచంద్రునకును
బూజసేయ నేర్చకులు పోవఁగాఁ బొందుగ దేవుని మొలను
ఏలినవారినిశానీతోడను నెసఁగుచున్న యీదట్టి
మూలముఁదెలియక తెచ్చితి మిట కనఁజాలవింతబుట్టి.

వ. ఆనాఁ డర్ధరాత్రియందు సర్దారులకుఁ దమ్మరసంబుచేఁ దానువ్రాసి మొహరుఁజేసి యిచ్చినది యిదియ గదాయని యాశ్చర్యంబున రామదాసుని భక్తివిశేషంబు రాముని కృపాప్రమేయంబునుం గొనియాడి తనదౌర్గత్యంబునకుఁ గుత్సించుచు రామదాసుగారితోనిట్లనుచున్నారు.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

రామదాసుగారు రండీ రసీదందుకొండీ
రండీ మనవివినండీ కృపయుంచండీ రాములమహిమగనుండీ రామ.
వచ్చినిల్చిరిందు రాతిరి వహ్వా యేమందు
వచ్చియిచట మీపైకంబంతయు నిచ్చిరశీదును పుచ్చుక వెళ్లిరి రామ.
జట్టీ లాగులతో వారలు పట్టాకత్తులతో
నెట్టినమిమ్మీపట్టునమనుపగ యిట్టివేషముల నుట్టిపడిరి యిట రామ.
యెంతశాంతనిధులో మీదగు స్వాంతంబదియెటులో
యింతకష్టముల కెట్లోర్చితిరో పంతగించితిని యంతరంగ మెఱుఁగక రామ.
కృపణుఁడనేఁగనుకా మీపై కృపలేశములేకా
యపవాదంబున కాలయుఁడైతిని కృపతోఁజూడుము కేవలుఁడనకను రామ.
తురకవాఁడనగుట నాకుఁ దుర్భాగణమెబాట
పరమపావనుని భద్రగిరీశుని స్థిరమతిఁదలఁచక చింతగుందెదను రామ.

వ. ఇట్లు తానీష రామదాసుని స్తుతియించి భద్రాచలమును జాహగీరుగా ఫర్మానావ్రాసి రాముం డొసంగిపోయిన యార్లక్షులపైకంబును మఱియు ననేక రత్నాభరణంబుల నొసంగినం బుచ్చుకొని పరమానందంబున రామదాసుగారు రామభజనసేయుచు భద్రాచలంబునకుఁ బోవుచు సంతోషంబున భద్రాచలంబును వర్ణింపుచున్నారు.

ఆనందభైరవిరాగము - ఆదితాళము.

కలియుంగవైకుంఠము భద్రాచల నిలయము సేవింతము
అలివేణులార మీరానందముగ వేగ విలసితమైనట్టివేడుకఁజూడరె కలియుంగ.
కాంచనసౌధములు వాటికిఁ గెంపుమించినదూలములు
వజ్రములు చెక్కించిన స్తంభములు బగడములభ్రమించినద్వారములు
అంచయానమణియెంచలేనుగదె మంచిపచ్చలుగూర్పించినవాకిళ్లు కలియుంగ.
బంగారుగోపురములు కోవెలలు వెలుంగుమాణిక్యములు
భేరిమృదంగాదినాదములు భాగవతుల సంగీతకీర్తనలు
రంగైనకల్యాణరత్నమంటపములశృంగారమేమనిచెలియవిన్నవింతు కలియుంగ.
తీరైనపురవీథులు సొగసైనకోనేర్లు సోపానములు
సకలఫల తరువులువనములు అందుల ఋషి గంధర్వనివసనములు
సరసిజాక్షివినవె సరిలేనిగోదావరిస్నానమునసంపత్కరమైయొప్పినది కలియుంగ.
చక్కని స్త్రీపురుషులు పట్టణమందుఁ దిక్కటిల్లఁగవింతలు
బ్రాహ్మణులు మక్కువతోఁ బూజలు వేదశాస్త్రతార్కికవైష్ణవులు
గ్రక్కునవారినిఁగన్నులఁజూచితెయొక్కువైనపుణ్యమేమనిదెల్పుదు కలియుంగ.
వామాక్షులాడఁగను సీతనుగూడి హేమపీఠమునందును
పూర్ణకళలు మోమునవెలుఁగఁగను పరివారములు ప్రేమతోఁగొలువగను
ప్రేమచేభద్రాద్రిరామదాసునేలుస్వామిశ్రీకోదండరాముని వాసము కలియుంగ.

వ. ఇవ్విధంబున రాముని ధ్యానించుచు సపరివారుండై భద్రాచలంబునకుఁ బోవుచుండునపుడు రామదాసుగారి నిరభిమానంబు నెఱుంగ వేగ శ్రీరాముండు మేఘావరణంబును వర్షంబును నొకనాఁడు సంధ్యాసమయంబునఁ గలుగునటులంజేసి యనేకచోరు లతని కట్టెదుట పొడసూపునటుల నొకమాయ గావించిన నాథక్తాగ్రేసరుండు నాచోరులం గాంచి చింతచే రామకైంకర్యంబు సేయఁగఁగోరిన నన్నీ చోరులు దోఁచఁదలంచిరే నేనెంతదౌర్భాగ్యుండనని రాములఁగూర్చి ధ్యానము సేయుచున్నారు.

నాదనామక్రియరాగము - ఏకతాళము.

పాహిరామప్రభో పాహిరామప్రభో పాహిభద్రాద్రివైదేహి రామప్రభో
శ్రీమన్మహాగుణ స్తోమాభిరామ మీనామకీర్తనలువర్ణింతు రామప్రభో
సుందరాకార మన్మందిరోద్ధార సీతేందిరాసంయుతానంద
ఇందిరావహృదయార విందాధిరూఢ యిందీవిరాకార సానంద
ఎందునేఁజూడ మీసుందరానందముల్ కందునొకన్ను లింపొంద
పుణ్యాచారిత్ర లావణ్య తారుణ్య కారుణ్య గాంభీర్య శ్రీరామచంద్రప్రభో.

కందర్పజనక నాయందు రంజిలి సదానందుండవై పూజలందు రామప్రభో.
విందుగాఁ జెవులకు నీవందుగానీకథల్ గందుగామిమ్ముసొంపొంద
వందనము జేసి మునులందఱును ఘనులైరి విందవై నట్టిగోవింద
బృందారకాది సద్బృందార్చితపదారవింద సందర్శితానంద
తల్లివినీవె మాతండ్రివినీవె మాదాతవునీవె మాభ్రాతరామప్రభో.
పల్లవాధరులైన గొల్లభామలగూడి యుల్లమలరఁగనురంజిల్లు
మల్లరంగంబునందెల్ల మల్లులజేరి యల్లకంసునిజంపుమల్ల
కొల్లలుగ నీమాయ వెల్లివిరియఁగ చేయ సల్లాపమునఁ గ్రీడసల్పు రామప్రభో.
తమ్ముఁడునీవు పార్శ్వమ్ములంజేరి విల్లమ్ములెక్కిడినిల్చుటిమ్ము
కమ్ముగొనిశాత్రవులు హుమ్మనుచువచ్చేరు వొమ్మైనబాణమ్ములిమ్ము
రమ్మునాకిమ్ముఅభయమ్ము నీపాదముల్నమ్మినానయ్య శ్రీరామచంద్రప్రభో.
కంటిమీ శంఖము గ్గంటిమీ చక్రము గ్గంటిమీ పాదము ల్గంటి
వింటిమీ మహిమ వెన్నంటితమ్ముఁడునీవు జంట రారయ్యనావెంట
మేము మీవారమైనాము రక్షించు మన్నాము జాగేల శ్రీరామచంద్రప్రభో.
నామనోవీథిపై ప్రేమతోనుండుమీ భూమిజాసహితజయరామచంద్ర
మీమహత్త్వంబువింటే మనస్సుందుఁ బ్రేమంబువేమఱుబుట్టు స్వామీ
ఏమిరా యన్నమీ కేమి నేరమ్ముజేసేము కాకున్న దూరేము
శ్యామలం సుందరం కోమలం జానకీ కాముకత్వం భజే రామచంద్రప్రభో.
కామితార్థమ్ము లిచ్చేమహత్త్వమ్ము దిన్నా మొరాలించునాస్వామి
కామితప్రదుఁడవై ప్రేమతోరక్షించుస్వామి సాకేతపురిరామచంద్రప్రభో.
అన్న రావన్న నీకన్న నామీఁద నెనరున్నవారేరి నాయన్న
నిన్నె కానీ మఱియన్యులంగాన నట్ గన్నతండ్రివి మాయన్న
వెన్న దొంగిలి తిన్న కృష్ణమ్ము నిన్నెన్నఁగావశమె రాజన్య రామప్రభో.
ఎన్నెన్నొ జన్మమ్ములెత్తఁగాఁ జాలనిఁక నిన్నె నెమ్మదిని వర్ణింతు
ఎన్నివిధములనైన నిన్నెనమ్మినవారి మన్నించిదయసేయుం మన్న
పన్నగాధిపశాయి భావనాతీతసంపన్న నామనవి వినవన్న
ఏటివాక్యంబు మీసాటిదైవంబు ముమ్మాటికినిభువిలేరు మేటి
పాడుదును మిమ్ముఁగొనియాడుదును మోదమున వేఁడుదునునన్ను గాపాడు
వేఁడుకోఁగానె నీజోడుకాఁడునునీవు కూడిరారయ్యనాతోడ రామప్రభో.
వేఁడునాకోర్కులీడేరఁగాఁజేసి కాపాడరాఁ గరినేలుజాడ
మూఁడుమూర్తుల కాత్మమూలమైచెన్నొందినాఁడవనిశ్రుతులవిన్నాఁడ
చూడుమీభక్తులను గూడుమీరిపుల గోరాడుమీరిల్లె గోవింద.

పుండరీకాక్ష మార్తాండవంశోద్భవా ఖండలస్తుత్య కోదండ
కుండలీశయన భూమండలోద్ధరణ పాషండజనహరణ కోదండరామప్రభో.
నిండుదయతోడ నాయండఁబాయకను నీవుండికాపాడు కోదండ
జాతకౌతూహలం సేతుకృత్వారమాపూత సీతాపతేధాత
పాతకులలో మొదటిపాతకుఁడ నావంటిపాతకునిఁ గాచుటేఖ్యాతి
భూతనాథునివిల్లు ఖ్యాతిగా ఖండించి సీతఁ గైకొన్నవిఖ్యాత
పూతనాకల్మషోద్ఘాతనాశత్రుసంఘాతనాసీతాసమేత
జాతినీతులులేక భూతలంబునఁదిరుగు ఘాతకులఁబరిమార్చు నేల రామప్రభో.
ఎప్పుడుం గంటికిని ఱెప్పవలెఁగాచి నన్నొప్పుగాఁగావుమాయప్ప
ఏదయా నీదయా యోదయాంభోనిధే యాదిలేదయ్య నామీఁద
వేదశాస్త్రపురాణవిఖ్యాతిచేమించు నాదస్వరూపమైనట్టి
ఘోరరాక్షసగర్వహార విశ్వంభరోద్ధారగుణసాంద్ర విస్తార
మోదముననీవు నన్నాదుకోఁగదవయ్య గోదావరీతీర రామచంద్రప్రభో.
నీదుబాణంబులును నాదుశత్రులఁబెట్టు బాధింపకున్నావదేమి
ఆదిమధ్యాంతబహిరంతరాత్ముఁడవనుచు వాదింతు నేజగన్నాథ
చాలు నే మీపదాబ్జాతములతో సాటి పదునాల్గులోకములెల్లఁగనఁగ
ఏలయీలాగుజాగేలచేసేవు మన్మేలుకోవయ్య మాపాలి
పాలువెన్నలు మ్రుచ్చిలించెనంచుయశోద రోలఁగట్టినమాయజాల రామప్రభో.
కొల్లలుగ ప్రేపల్లెపల్లవాధరులతో నల్లిబిల్లిగను రాజిల్లు
వాలినొక్కమ్మునను గూలనేసినశౌర్యశాలియానినుఁదలఁతుచాల
మేలోర్వలేకనుజాలిఁబడితిరుగు దుర్జాలమును భేదింపుమయ్య
సాలభంజికలనిర్మూలంబుఁజేయఁగాఁ జాలితివిగో పాలబాల
తాళవృక్షములొక్క కోలధరఁగూలంగఁదూలనేసిన బాహుశాలిరామప్రభో.
శిలయైనయాహల్య శ్రీపాదములుసోఁకి చెలఁతయైమిమ్ముమదిఁదలఁచె
వినవయామనవిఁగైకొనవయా తప్పులంగనరయా సమ్మతింగొనుచు
దానధర్మంబులుం దపజపంబులును నీనామకీర్తనకు సరిరావు
మానావమానములు మహిని నీకైయుండ నీయెడనుజింత మాకేల
జ్ఞానయోగాభ్యాసముననుండెడివారికానందమయుఁడవై నావురామప్రభో.
భానువంశమునందు మానవాధిపుఁడవై దానవులఁబరిమార్చినావు
అణురేణుపూర్ణమవు మనోవాస నామనవి వినుదేవకీతనయ
మాన్యమైయాశ్రితవదాన్యమై సుజనసమ్మాన్యమైవెలుఁగు శ్రీరామచంద్రప్రభో.
నిత్యమైసత్యమైనిర్మలంబైనయాదిత్యవంశోత్తంసమైన రామప్రభో.

సేవ్యమై మీకథ లాఖ్యమై సజ్జనశ్రావ్యమై యుండునో దివ్య రామప్రభో.
గట్టిగానీవు నాపట్టుగా విహితమానట్టుగా మమ్ముఁ జేపట్టు
దిట్టయగు తాటకినిఁగొట్టి వేగమె గాధిపట్టియాగముఁగాచినట్టి
చుట్టుకొని కాళింగుఁ డట్టహాసము సేయఁ బట్టుకొనితల లెక్కినట్టి
సంతతము నన్నురక్షింతువనినమ్మి మిమ్మెంతునో జానకీకాంత
పంతమున మీపాదచింతనము సేయ నావంతలన్నియుఁమాను టెంత రామప్రభో.
వింతగాదయ్య నేనింతవాఁడాదిగాఁ బంతమునమిమ్ముభావింతు
శాంతమూర్తివిరమాకాంతుండవనిచాల సంతసంబున సన్నుతింతు
అక్షయంబైననీకుక్షిలోలోకముల రక్షించితివిలక్ష్మీపక్ష
దంతివత్సల భక్తచింతామణివి విశ్వమంతయును నీవురక్షింతు
పక్షివాహన శత్రువిక్షేపణా నన్నురక్షించుమీక్షించి దాత రామప్రభో.
రక్షించు సజ్జనుల శిక్షించు దుర్జనుల వీక్షించు మము గటాక్షించు
రక్షకుఁడవై జగద్రక్షణము సేయఁగా రాక్షసులనీక్షించినావు
లక్ష్మీకటాక్ష వీక్షణ సుధావృష్టి మాకక్షయంబుగఁ గటాక్షించు
రావయా అభయంబులీవయా స్వామి వౌనీవమాగతి దేవరాయ
కావుకావుమటంచు కాకాసురుఁడురాగ కాచిరక్షించినావయ్య రామప్రభో.
దేవదేవోత్తమా దేవేంద్రసన్నుతా కావవే నన్ను శ్రీరామచంద్ర
భావజజనక నాబాధలన్నియుమాన్పి యేవిధంబుననైన నేలు
శ్రీవైష్ణవులపాలి చింతామణివి చాల సేవఁగైకొని కరుణసేయుం
భావమున మిము భక్తిసేవించుసుజనులకుఁ గైవల్యమొసఁగు శ్రీరామచంద్ర.
గోపాలబాలురనుగూడి యావుల మేపు ఆపదోద్ధారకుఁడవైన
నాపాలి శ్రీరామ భూపాలకా నన్నుఁ గాపాడవయ్య గోపాల
సారమౌ శౌర్యవిస్తారమా సుందరాకార సద్భక్తమందార
శరణాంకితత్రాణబిరుదాంకితంబైన పరము నాకొసఁగు మేమరక
శ్రీరామరామేతిశిష్టమంత్రము సారెసారెకునుగిరిజ దా జదివె
శ్రీరామనీనామ చింతనామృతపాన సారమే నాదుమదిగోరు రామప్రభో.
చేరిమీదపద్మారాధనము సేయఁగోరి నానయ్య శ్రీరామచంద్ర
ఘోరరాక్షసగర్వహర విశ్వంభరా భూరిగుణసాంద్రవిస్తార
మారీచమాయానివారశరసంధాన ధారుణీతనయావిహార
పరిశవేదక్షయం పాత్రమాకొసఁగినన్నరసిపోషింపఁగదవయ్య
పరధనంబులఁ బరస్త్రీలనపేక్షించు నరులకబ్బునె మోక్షమరయ రామప్రభో.
కామాదిదుర్గుణస్తోమంబడంగమీ నామామృతమొదికక్క స్వామి

దుష్టులగు దానవుల నష్టంబుఁ జేయఁగాఁబుట్టితివికౌసల్యపట్టి
కష్టపడలేనయ్యపట్టాభిరామ నాకిష్టసంపదలిచ్చియేలు
కేశవాయనిన భవపాశముల్దొలఁగు సర్వేశకోటిశశిప్రకాశ రామప్రభో.
నారాయణానీదు నామామృతంబెపుడు పారణముసేయదయసేయు
మాధవాయనుచుసమ్మోదమున మిముఁగొల్తుసాధుసజ్జనదయాంభోధి
గోవిందగోవిందగోపాలకృష్ణయని గోపికలుఁగొనియాడుగోః
విష్ణునా సర్వవర్ధిష్ణునా తత్వభూయిష్ణునానిర్మితం కృష్ణ
శ్రీధరా శ్రీకరా శ్రీనారసింహ గంగాధరస్తోత్ర ఆనందరామ
మత్స్యమైజలధిలోఁ జొచ్చి సోమకుఁద్రుంచి తెచ్చివేదము లజునకిచ్చు
కూర్మరూపమునొంది కొండమూఁపునఁదాల్చి కూర్మితో నమృతంబుఁగూర్చు
వారాహరూపమున వసుధగొమ్మునఁనెత్తి సురలరక్షించు దాశరథి
శరణన్నప్రహ్లాదుఁగరుణించిరక్షింప నరసింహమూర్తివైనట్టి
వామనత్వమునభూదానమడిగియుం బలిని భూమిక్రిందనడంచిపోల్చురామ
పరశురాముఁడనంగనరపాలకులనెల్ల నరసిపోరిఁగొన్నదాశరథి
శ్రీరామమూర్తివైయారావణునితలల్ ధారుణింబడగూల్చినట్టి
హలధరుఁడవైధరాస్థలిపాతకులనెల్లఁ బొలిపుచ్చివెలుఁగుమాపాలి
సిద్ధసన్మునిమనోబద్ధుఁడవైనీవె బౌద్ధుండవయితిప్రబుద్ధ
కలికిరూపముఁదాల్చి కలియుగంబుననీవు వెలసితివిభద్రాద్రినిలయ
అవ్యయుఁడవైననీయవతారములుదలఁచి దివ్యులై నారుమునులయ్య
శ్రీరామనీనామమేవేళస్మరియింతు స్వామిదయసేయుసంపదలు
అప్పశేషశయానయెప్పుడునునినుమరువ నొప్పుగాఁబ్రోవువరదప్ప
దెప్పరంబులుదీర్చియిప్పుడేమరకనన్ద్రిప్పపెట్టకగావుమప్ప
పట్టాభిరామనినుప్రభుఁడవనినమ్మితినిఁ గష్టపెట్టకనుచేపట్టు
పాహిశ్రీరామనీపాదపద్మాశ్రయుఁడ పాలింపుమీ భద్రశైల
పాహిరామప్రభోపాహిరామప్రభో పాహిభద్రాద్రివైదేహిరామప్రభో.

వ. అని మరియు నిట్లని రామకీర్తనఁ జేయుచున్నాఁడు.

సావేరిరాగము - చాపుతాళము.

రామరామరామ కోదండపాణీ రామరామరామ.
పరమపురుషునేతెరువుఁదప్పిరే దరిగానకనీదండఁగోరితిని రామ.
మక్కువఁగొనిగనుమ్రొక్కఁదలఁచిరా చిక్కనినరులకుఁజిక్కితిగనరా రామ.
చోరులువచ్చి బారులుదీరిరి భారమెవరిదో భావజజనకా రామ.

దాసులయెడఁగృపదయసేయర యిటుగాసిలఁబుట్టినదోసమెవరిదో రామ.
విల్లునంబులును పల్లవకరములఁ గొల్లగపట్టున గొబ్బునరావే రామ.
శత్రులఁబొరిఁగొని మిత్రులఁబ్రోచే పాత్రత్వముగల పాండవపక్షా రామ.
కమనీయాననకలుషసంహారా సుమనోహరనీసొంపుఁజూపరా రామ.
వాసిమీఱిభద్రాచలరామా దాసుఁడఁగావున దండనిలువవే రామ.

వ. ఈక్రమంబునఁ జోరులువచ్చినను భీతింజెందక రామునింగూర్చి ధ్యానంబు సేయుచు నృత్యంబు సలుపుచు మొదలిడ నారాముం డతని దృఢత్వంబునకు మెచ్చి యామాయ మాయించిన నిది రామానుగ్రహం బని సంతోషింపుచుఁ దనతోడం గూడివచ్చుపరివారజనంబులం గాంచి పరమకరుణార్ద్రహృదయుండై రామనామస్మరణ సేయువారల కాపదలు చెందవని నృత్యంబుసేయుచు యిట్లనుచున్నారు.

ధన్యాసిరాగము - చాపుతాళము.

రామసంకీర్తనఁజేసినవారికి నరకాదులులేవు కామునిఁగన్న
శ్రీరామునిఁదలఁచితే కష్టముఁదీర్చి యభీష్టసంపదలిచ్చు ఓమనసా నా.
మన్నించియొకమాట వినవే యోమనసా మరువకె శ్రీరామ మంత్రము
యెన్నెన్నిజన్మము లెత్తినావో నీవుయెఱుఁగవు లోక తంత్రము
అనిసృష్టించెను బ్రహ్మవిచిత్రముహరిహరీ శ్రీరాముఁడొకఁడెనిరంతరము ఓమనసా నా.
యుక్తమైన శ్రీప్రణవరహస్యం ఓంకార మనువాక్యము
భక్తితో ధ్యానముఁజేసినవారల ఫలము దేవతాయోగ్యము
ముక్తిమార్గమునకెల్ల హరికథలేశ్లాఘ్యముమురహరినిభజనజేసినవారిదేభాగ్యము ఓమనసా.
ద్రోహచింతలేక యుండేదే హరిసేవ దొరక దాణిముత్యము
దేహసాఫల్యముకైనట్టి రామునిఁ దెలుసుకొనుటే సత్యము
శ్రీహరిని వినాగాఁబ్రపంచమనిత్యముశ్రీభద్రాచలరామదాసునిదేనిత్యము ఓమనసానా.

వ. ఈతీరున నారామదాసు రామనామాభివర్ణనంబుఁ జేయుచుఁ గతిపయదినంబులకు భద్రాచలంబుఁ జేరి నరుగుదెంచి మహోత్సాహం బున గౌతమీ నదియందుఁ గృతావగాహుండైన పరివారంబుతోడం గూడి కాలోచితక్రియలు నిర్వర్తించి మృదంగాది సాధనంబులం గొని రామునిం బాడుచుఁ బురప్రవేశంబుః జేయుచున్నారు.

యదుకులకాంభోజిరాగము - చాపుతాళము.

హరిహరిరామ రామరామ హరిహరిరామ
హరిరామయనిన నామెుర యాలకింపవు కరాకేలనో పతితపావన హరి.

దేహాభిమానుఁడ మోహాతురుఁడ నతిసాహసుఁడను గరుడవాహన నన్నుఁబ్రోవు హరి.
ధరాతలంబునను దురాత్ముఁడను నే నరాధముండను పురాణపురుషా హరి.
కోపాభిరతుఁడను పాపకర్ముఁడననుఁ గాపాడి రక్షించ నీపాదములెగతి హరి.
లోభాతిశయమున నాభాసమొందితి భూభాగమునను నభోభాగమందున హరి.
వాసిగ భద్రాద్రివాసుఁడవై రామదాసు నేలుకొమ్ము దశరథనందన హరి.

వ. ఈక్రమంబున భజనసేయుచుఁ బురప్రవేశంబుఁజేయుకాలంబున నాభద్రాచలంబున నివసించియుండు భగవద్భక్తులందఱును రామదాసుగారు వచ్చుచున్నారను వర్తమానంబు విని గంధపుష్పాక్షతతాంబూలాదిద్రవ్యంబులంగైకొని యాభక్తునకెదురేఁగి ప్రదక్షిణనమస్కారంబులాచరించి గంధపుష్పంబుల నాభాగవతాలంకారు నలంకరించి యనేక తంబురలు మృదంగంబులు జాలరులు మొదలగువాద్యజాలంబులు మ్రోయ భక్తులందఱును నాభక్తవర్యు ముందిడుకొని రామునిం బాడుచురాఁగా రామదాసుగారు తనస్వగృహంబు ప్రవేశించుటకు ముందు మద్హృదయ నివాసుండగు రామునింగాంచి పూజించి నేత్రోత్సవంబంది గృహంబునకేఁగుదుంగాక యని భద్రశైలం బెక్కుచు నిట్లని సంకీర్తనము సేయుచున్నారు.

కాంభోజిరాగము - ఆదితాళము.

బహుకాలమునకు శ్రీభద్రాచలేశునకుఁ బాదసేవకుఁడనైతి అహహ
నాజన్మసఫలమాయె నేఁటికిని అనుమానములు దీరెనిఁకనూ తగను బహు.
తల్లిగర్భమునందు మలమూత్రములమునిఁగి ధరణిపైజన్మించితీ
కల్లలాడుచుఁ బాపకర్మములకొడిగట్టి కాపురుషులనుజేరితి నీవేగతి బహు.
కోపుఁడను పాపుఁడను గుణహీనుఁడను నేను క్రూరుఁడను కుత్సితుఁడను
కాపుసేయకనన్ను రక్షించఁదలఁచ శ్రీరామచంద్రులకుభారము యిఁకను బహు.
అఖిలలోకంబులకు నాధారమైయున్న యాదిపురుషోత్తముండూ
సకియతోఁగూడున్న సమయమందునఁ జేరి సన్నుతులుసేయఁగలిగె చెలఁగె బహు.
రామదాసుని నేలుకొఱకు శ్రీభద్రాద్రిధాములై యుందయించిరి
యేమికొదవలు మనకు నెఱుకఁగలుగఁగఁజేసె నేమ్యాంబులితరమెల్లా కల్లా బహు.

వ. ఇవ్విధంబున రామునింగూర్చి నుతియింపుచు భద్రశైలంబెక్కుచుండ నంతకుమున్నే యర్చకులు రామదాసుగారువచ్చుటయెఱింగియుం ధువారగుటం జేసి కోవెలబీగము ముద్రలుదీసి తిరుమంజనము సేయించి

దాసునకు దర్శనం బిప్పించుటకునై కాచియుండిరిగాన రామదాసునిం బహూకరించి లోనికిఁగొని చనుచుండ నాభక్తుఁడు ధ్వజస్తంభంబువద్ద సాగిలంబడి యిట్లని స్తుతిసేయుచున్నారు.

అసావేరిరాగము - ఏకతాళము.

రామా నీముద్దుమోముఁజూపరా సుందర రామా నీముద్దుమోముఁజూపరా
రామభద్రాచల ధామ తారకనామా రామా రామా.
నీముద్దుమోముగంటిగానిన్నుజాలసెరనమ్మియున్నానుగా నేనితరదైవములవేడబోనుగా
విడువనిబిరుదు గట్టుకొన్ననిన్నే కాని ఒట్టుబెట్టుకొంటి యొప్పులకుప్పవంటి రామా.
మురిపెంపుకొప్పుబిగిపీడఁగా ఆణిముత్యాలసరులల్లాడఁగాలేమికిరవై ననడుమసియాడఁగా
అట్టెబిరబిరవచ్చిమీపినతల్లి సుమిత్రస్థిరముగఁగస్తూరితిలకముదిద్దినట్టి రామా.
డాలైనపల్లెవాటుదుల్కఁగా నింద్రనీలాలగుంపు సొంపుగుల్కఁగా
నిట్లు హేలాద్రి బ్రహ్మమనిపల్కఁగా చిన్నిబాలుఁడవైనట్టి జాబిల్లికూనవంటి రామా.
ముక్కునముత్యమింపుమీరఁగాను జెక్కుటద్దము ముద్దుగుల్కఁగా
చనుముక్కునపాలధార లొల్కఁగా
ప్రేమమిక్కుటముగవచ్చి మీతల్లికౌసల్య అక్కునఁజేర్చినెలబాలుఁ జూపినయట్టి రా.
ముద్దుగదురనింపొందఁగా మోదమందించుచు లాలింపఁగాముద్దులన్నారమ్మనిదీవింపఁగా
సురలువెన్నుఁడేరాముఁడనివినుతించిభద్రాద్రి వెన్నుఁడవైనట్టిచిన్నారిచూపుల రామా.

శ్లో. అచింత్య మవ్యక్త మనంతరూప మద్వైత మానంద మనాదిగమ్యం,
పుణ్యస్వరూపం పురుషోత్తమాఖ్యం రామం భజే రాఘవ రామచంద్రమ్.

వ. ఈతీరున నమస్కరించి లేచి యపరాధక్షమాపణంబుఁ జేసి రామకీర్తనంబుఁ జేయుచుఁ బ్రాకారప్రదక్షిణంబు సేయుచున్నారు.

ముఖారిరాగము - చాపుతాళము.

శ్రీరామరామరామా శ్రితులపైయెంతో ప్రేమా
భారమెంచకయేలుమా భద్రాచలసీతారామా శ్రీరామా.
శరణంటెరక్షించేనస్థిరమనినీలోఁజేర ఆరావణుతమ్ముఁడేయమరినసాక్షిగామాకు.
అకుచేలునికన్ననధికమైయున్నామన్న శ్రీకాకుళాధివాసచిత్రమందైనయుండ శ్రీ.
ఎక్కడఁజూచిననీవెపిక్కటిల్లియున్నావురచక్కనిభద్రాచలస్వామిసీతారామ శ్రీ.

వ. అని యివ్విధంబున రామునిం గొనియాడుచుఁ బ్రాకారప్రదక్షిణంబుఁ గావించి గర్భగృహంబులోనికిం జని కోదండధారుండును,సీతాలక్ష్మణసహితుండును, భద్రప్రదుండును, భద్రశైలవాసుండును నైన

శ్రీరామచంద్రదేవుం గాంచి పులకాంకితశరీరుండై నేత్రంబుల నానంద జలంబులొలుక తన్మూర్తియందు మనంబు లయింపఁ జేసి నిశ్చేష్టితుండై యుండ నర్చకులు తులసీదళంబుల నా రామదేవునికి సహస్రార్చనంబుఁ గావించి కర్పూరదీపారాధనంబు సేయుతఱి రామదాసుగా రిట్లని నమస్కారము సేయుచున్నారు.

శ్లో. అనర్ఘ్యమాణిక్యవిరాజమాన శ్రీపాదుకాలంకృతశోభనాభ్యాం,
అశేషబృందారకవందితాభ్యాం నమోనమో రాఘవపాదుకాభ్యామ్.

శ్లో. ధ్వజాంబుజచ్ఛత్రరథాంగశంఖ దంభోళిపాశాంకుశమత్స్యచిహ్నం,
బ్రహ్మేంద్రదేవాదికిరీటకోటి సంఘర్షపాదాంబుజయుగ్మమీడే.

వ. ఈశ్లోకద్వయతాత్పర్యం బేమనిన.

చ. అనుపమనూత్నరత్ననిచయప్రచయోజ్జ్వల నవ్యపాదుకా
వనములు వారిజప్రభవ వాసవచంద్రదినేంద్రముఖ్య పా
వనమకుటాగ్రశోభిత సువర్ణమణీసమలంకృతంబులుఁ
వనజరథధ్వజాంబుశరపాకహలాంకుశపుండరీకలాం
ఛనములు రామచంద్రపదసారసము ల్మది నిల్పి కొల్చెదన్.

సురటరాగము - ఆదితాళము.

రామం వందేహంత్వామభిరామం రఘుకులకలశాంబుధిసోమం
వినుతభీరభినందితనామం పాలితముని సవనారామం పదపాలితగౌతమరామం
పటుబలజితభార్గవరామ మాసురస్తోమభీమ మభినోమలజలదశ్యామల మమరో
ద్దామధామ నిజనామ మనసు ప్రేమకరం క్షేమకరం దశరథ రామం.
శరణం భవసురముని పూజితచరణం గురువచన ప్రణయాచరణం
యతమతిహితనిహితాదరణం నతవితతదయారసవరణ మఘనిచయహరణం
మాయామరణ మఖిలకారణ మతులగుణాభరణ మరుణజలరుహానిభనయనం
తరణిమణిస్ఫురణకనకధనుషం రామం.
చండం తనురుహబిలవిలసదజాండం నయసీకృతశశిమార్తాండం
శుభఫలదాయక గుణషండం ఘనగమనవిజితవే
దండ మమలమణికుండల రుచిమయ గండస్థల మాహావమండల
దోర్దండకుండలీకృతకోదండం చండతరోద్దండశతకిరీటం రామం.

వ. ఈగతి నమస్కారంబుఁ జేసి తీర్థప్రసాదంబు లంది పరమామో దంబునం దేలుచుండు రామదాసునకు నర్చకులు శ్రీగంధంబు మైనిండ

నలంది పుష్పదామంబు మెడనువైవ నమ్రుండై కైకొని కాళ్ళగజ్జెలు గట్టి చేతఁ జిటితాళంబును తంబురయునుఁ బట్టి రామునియెదుట నృత్యంబు సేయుచున్నారు.

కానడారాగము - ఏకతాళము.

రామరామసీతా రామరామ రామసీతా
యాదిలేదా నామీఁద నింకైననీదయరాద
పాదములకు మ్రొక్కెద పలుమాఱు విన్నవించెద రా.
తప్పులెంచఁబోతె నీకు గొప్పతనము చెల్లదు
యెప్పుడు నిన్నేనమ్మితి తప్పక నన్ను రక్షించు రా.
ఏల ప్రత్యక్షము కావయ్య యేమిసేతునో రామయ్య
జాలము సేయకుమయ్య శరణంటిని గదయ్య రా.
ఎంతబలమొ నీదుమాయ యెన్నటికిఁ దెలియదాయె
అంతరంగము తెలియదాయె ఆపదలు తొలఁగవాయె రా.
పతితపావన బిరుదు పాలించుకో మోసఁబోకు
యితరుల వేఁడ నీకు జగదీశ్వరా యేలపరాకు రా.
నమ్మనేర్తు నిన్నే కాక నాచే లేమా నీకృపలేక
మిమ్ము నేవేఁడే దెందాఁక మీసొమ్మై నేనుపరాక రా.
ఇక్ష్వాకువంశమునఁబుట్టి యేమయ్యా నన్నుఁ జేపట్టి
రక్షించవిట్టిదియెట్టి న్యాయమో దశరథపట్టి రా.
భద్రగిరిధామరామ పాదభక్తినివదిలేమా
క్షుద్రదైవములఁగొలిచేమా చూడుమా మీదయ మరచేమా రామ రామరామ.

వ. ఇవ్విధంబున రాముని స్తుతియించి సెలవుఁ గైకొని భద్రగిరి రాజంబు డిగ్గి యనేక భక్తసమూహంబులు వెంటనంటి వచ్చుచుండ నత్యంతోత్సాహంబున భక్తులంగాంచి యిట్లనుచున్నారు.

పట్టాభిరాములఁబట్టుపట్టినాము యీపట్టున యమునికిబొమ్మఁ బెట్టినాము పట్టాభి.
కోదండరాములయందే కోరినాము మాకోరికలిమ్మని మదిలోదూరినాము పట్టాభి.
కరిరాజవరదునికరుణకు గాచినాము దురితములెల్లను బారదోలినాము పట్టాభి.
ఇందిరారమణునిపొందె చెందినాము యీసుందరాకారు సెలవందినాము పట్టాభి.
తారకబ్రహ్మముమీరనితలఁచినాను సాకుదారిఁజూపే వెలుఁగనుచుఁ దలఁచినాను.
కోరిభద్రాచలరాముని కూర్మితోను శ్రీరామదాసుఁడనుచుఁ జేరినాను పట్టాభి.

వ. అని యివ్విధంబున నాడుచుం బాడుచు రాజవీథులం దిరుగుచు రామభజనసేయుచు స్వగృహంబునకువచ్చి ఓమనసా మరల సంసార సాగరంబున మునుఁగఁబోయెదవు సుమా యటుల మునిఁగితివేని చెడి పోయెదవని మానసనియమంబు సేయుచున్నారు.

నాదనామక్రియరాగము - ఏకతాళము.

చెడిపోయెదవుసుమీ మనసా చెడిపోయెదవుసుమీ
చెడిపోయెదవు చెడుగుణములచే యెడతెగకనుహరి యడుగు లేమరితే చెడి.
కుచ్ఛితములు పోను లోపలి మచ్ఛరములు మాను
హెచ్చుగరాముని విచ్చలవిడిగా లచ్చినాయకుని ముచ్చటవినకుంటె చెడి.
కాయము సతమనకు యిఁకనీ గాయక మేమరకు
పాయకరాముని పాదపూజనము సేయక మోహపుమాయలఁబడితే చెడి.
భావములోనమ్మి భద్రగిరీశు వేఁడుకొమ్మి
దేవదేవ రామదాసుఁడేనని కావుకావుమని కలకాలమునకుంటె చెడి.

వ. ఈతీరున మానసనియమంబుఁ జేసుకొని గృహంబులోనికిం జని దారాపుత్రాదులం గాంచి యానందించి శుద్ధసత్త్వగుణప్రధానుండై యహరహంబును సహస్రబ్రాహ్మణభోజనంబు సేయింపుచు భద్రశైలం బున శ్రీరామునకు నిత్యోత్సవమాసోత్సవపక్షోత్సవంబులునుం జేయుచు రాముని నేమరక ధ్యానింపుచుఁ బరమానందంబుననుండు భద్రగిరి యందు సీతాపిరాట్టి యొకనాఁటిరేయి రామునితోడఁ బ్రణయకల హంబాడుచుఁ బురుషులందఱును కఠినాత్ములు క్రూరులు నగుటకు సంది యంబె? యెట్లన్న నీకుఁ బరమాంతరంగభక్తుండైన రామదాసుం డొక దినంబుననైన నినుమరువక భజియింపుచుండ దర్శనం బొసంగక పరమ నీచుండై నీయందు భక్తితాత్పర్యంబులులేని మ్లేచ్ఛునకు సేవయొసంగితి రకృత్యంబనుబీజం బాదినుండి మీహృదయం బనుపాదియం దంకు రించి వృద్ధింజెంది మహాలవాలంబై యున్నయది యిట్టికపటకృత్యంబున నీదాసులఁ గాసిల్లంజేసిన నీకైన లాభంబేమని ప్రశ్నసేయు సీతానాయి కంజూచి రాముండు మునిమునినగవులు నగుచు నిట్లనుచున్నాఁడు

క. తరుణీ పూర్వభవంబున, కరమరుదుగఁజేసినంత కాచుట్ వేచట్
గుఱియుంచి వినుము తెలిపెదఁ, బరికింపఁగరాని వీరి పాపక్రియలన్.

గీ. కాశికాపురి కావల కామితార్థ, ఫలదుఁ డైనట్టిస్థాణునిభవన మొకటి
యలరు నొకయేఁడు విడక రుద్రాభిషేక, మెలమిఁజేసిన నొసఁగు మహేంద్రపదవి.

క. అని తెలుపుస్థలపురాణము, విని యొకవిప్రుండు భక్తివివశుఁడగుచు నా
వనజభవనుతున కతులిత, ఘనమతితో పూజ సలుపఁగాను దొడంగెన్.

గీ. ఇటులనొకహాయనముభక్తిచటులతరమ,హోగ్రముగఁజేసెనొాఱఁతగా నొక్కదినము
కొఱఁతదినమ్మని యెఱుఁగక కుపితుఁడగుచు,పూర్ణఘటమునసీశునుఁబొడిచె వినవె.

వ. ఇట్లు పొడిచిన ఘటంబు విచ్చి తద్ఘటజలం బాలింగమూర్తి శిరంబునం బడె నంత నావిప్రుం డంతర్గతంబున.

గీ. ఈశ్వరుండని నమ్మితి నింతకాల, మీశ్వరుండీడ లేఁడని యెఱుఁగనైతి
బుద్ధిజాడ్యంబు విప్రోత్తములకటంచు, పలుకుజనవాక్య మిపుడు ఫలించె ననుచు.

వ. ఇటులఁ దలంచుచుండు సమయంబున దశదిశావకాశపరిపూర్ణంబగు నొక్కతేజం బుద్భవించి తన్మధ్యంబునందు.

సీ. కటిభాగమునగంధకరటిరాట్చర్మంబు కపటంపుజిమ్మచీఁకట్లనీన
వక్షఃస్థలంబునఁ జక్షుశ్రవోభర్తతారహారము తేవఁ దళుకుఁజూపఁ
గేలుదామరయందు శూలముద్భటనటజ్జ్వలనకీలముల వసంతమాడ
జూటజూటమునందు సొబగులేఁజందురుఁ డకఠోరసారచంద్రికలుగాయ

తే. గుటిలనిర్ఘాతఘుర్ఘురఘోషఘోష, సరణి డమరుధ్వానాన్నాదంబు పరిఢవిల్లఁ
గురనిశాటవిపాటనస్ఫుటవిహార, దుర్జయుం డగుహరుఁడు ప్రాదుర్భవించె.

వ. ఇవ్విధంబునఁబ్రత్యక్షుండైయాధూర్తశిఖామణింగాంచియిట్లనియె.

క. తామస మతివై నా కీ, పీమార్గముగాఁగఁ బూజనిటు చెఱచితిఁగా
నేమందు యవనజాతికి, ఖామండై రాజ్య మేలు కలికాలమునన్.

గీ. ఇంద్రపదవికి మాఱు రాజేంద్రపదవి, యొసఁగితిని యేలుమయ్య మహోన్నతముగ
నాదుసేవావిశేషసంపత్తివలన, రామచంద్రుండు రక్షించ రాఁగలండు.

వ. అని వరంబొసంగి యంతర్హితుండైన.

క. ఆతండు మ్లేచ్ఛజాతుం, డై తానీషయని పొగడి యభవునికరుణ
న్నితరమున నగ్రాంచెను, సీతా! తొలినోముఫలము సిద్ధి యొసఁగదే.

వ. ఇది కారణంబుగాఁ దానీషకు దర్శనంబొసంగితి నిఁక రామదాసుని పూర్వవృత్తాంతంబు వినుము.

సీ. పూర్వజన్మంబునం దుర్విలో నొకవిప్రవరునకుఁ బుత్త్రుఁడై వరుసఁబుట్టి
యతులితైశ్వర్యం బనాయాసమునఁ గూర్చి దారాసుతాదులఁ దగిలి ప్రీతి

శ్రీద్ధార్థముగ నొక్కకీరరాజంబునుఁ బంజరంబుననుంచి పామరమున
రామరామయటంచు రాచిల్కకేర్పడఁ జెప్పుచుఁ బ్రీతి రక్షింపుచుండి

తే. కాలపరిపక్వమైనను కాంతచేత, రామచిల్కనుగని రామరామ యనుచు
జీవ మెడఁబాసిపుట్టె నీక్షితిని మరల, గుట్టెఱుఁగకున్న మెడఁజుట్టుకొనదె కర్మ

క. పుణ్యాపుణ్యఫలంబు ల,గణ్యాగుణాకరులనైన నలసటఁ బెట్టున్
పుణ్యానికి నన్నేటికి, పుణ్యవతీ దూరదే యపూర్వగుణాఢ్యా.

గీ. రామరామయటంచు నన్ రక్తిదలఁచెఁ, గాన మద్భక్తుఁడితఁడయ్యె కామజనని
చిలుకనిర్బంధపెట్టిన ఛిద్రమునను, బందిఖానను బడియుండె బాడబుండు.

వ. పూర్వజన్మకర్మవశంబున సుఖదుఃఖంబులం బొందుటయ్యెనేని నీనామస్మరణంబుననైనఫలం బేమనియెదవేనిం జెప్పెద వినుము.

గీ. నన్నుఁజేరంగఁదలఁచెడి నరులకెల్ల, కర్మశేషంబు గూడదుగాన నితని
కర్మమంతయుఁ దీరిన గాతుననుచు, కాచియుండితి కర్మము ల్గడచి చనియె.

క. ఇప్పుడు మద్భక్తుండై, యొప్పె నిఁకను ముప్పులే దొసంగెద ముక్తిన్
దప్పను సత్యము సత్యం, బప్పని కిఁక నడ్డు సేయకే యబ్జముఖీ.

వ. అని గోపన్న తానీషలగారి పూర్వజన్మవృత్తాంతంబు రాముండు జెప్ప విని సీతాదేవి యానందించుచుండె నంత చైత్రశుద్ధప్రతిపదాదిగా శ్రీరామనవరాత్రి యాసన్నంబైన రామదాసుగారు ధ్వజారోహణంబు మొదలవభృథోత్సవంబుతుదగా బ్రహ్మోత్సవంబు సాంతంబుగావించి సీతాకల్యాణంబును పట్టాభిషేకోత్సవంబునుం గావించి కలశోద్వాహనంబుఁ జేయించి కృతకృత్యుండైయుండుతఱి నర్చకులు తీర్థప్రసాదశఠగోపంబులు నొసంగి ధర్మపరిపాలకుఁడగుట రాముని కలంకారంబుఁ జేసియున్న పుష్పధామములలో నొకదాని నతని యఱుతవైచి వాద్యఘోషంబులతోడ గృహంబున కనుపునపుడు రామదాసుగా రానంద పరవశంబున రామునింగూర్చి నృత్యంబు సేయుచున్నారు.

నాదనామక్రియ రాగము - ఆదితాళము.

ఆనంద మానందమాయెను శ్రీ జానకీ రామస్మరణసేయను
నేఁడార్యులకృపమాకుఁగల్గెనుఇప్పుడిరువైయేడింటనున్న పరమాత్మునిఁజూడఁగానే ఆనం.
పరమభక్తిశ్రద్ధగల్గెను బహు దురితజాలములెల్ల దొల్గెను
పటు రాగద్వేషములెల్లవీడెను అట్టెరాజయోగమందున్న రాజునుజూడఁగానే ఆనం.

పూర్వపుణ్యములొనగూడెను శ్రీ పార్వతిజపమంత్ర మీడేరెను
ఆ పూర్వకృతినిగనఁబడెను పరమపావనమైన శ్రీహరి సేవగల్గెనేఁడు ఆనం.
సామాన్యులచెంతఁజేరము పట్టి పామరజనులనింకఁగూడము
విషయకామబద్ధులఁజేరివేఁడమమాకుహరినామస్మరణఁజేసేపరమభాగవతులెదిక్కు ఆ.
రామభక్తులఁజేరఁగల్గెను ఇతర కామములెల్ల వీడఁగల్గెను
పరభామలపైని భ్రాంతిదొల్గెను మేముపరుల దోషములెన్న మెరు లెన్నెదురాడము.
ఇతరచింతనకల్గిసేయము రామ యితరదైవాలఁగొనియాడము
ధరాపతులకుఁజిక్కి చింతచేయము యినకులచంద్రుఁడైన భద్రాచలరాము సేవ మానము.
భద్రాద్రిస్వామి మాకుదైవమూ వేఱె క్షుద్రదేవతలఁ దలఁపము
దారిద్ర్యములెల్లమది నెంచముభద్రగిరిరామదాసునేలినపరమదయాళుఁడుగల్గె నానంద

వ ఈప్రకారంబునఁ బరమానందంబునఁ బ్రతిసంవత్సరంబును శ్రీరాములకు బ్రహ్మోత్సవంబు సేయుచు విప్రుల షడ్రసోపేతాన్నంబునఁ దృప్తులం జేయుచు దానధర్మపరోపకారంబులుం జేయుచు బహువాయనంబులు వర్తింప నందలిజనులంద ఱితనిఁ బరమధర్మాత్ముండని కొనియాడ నొకకొంద ఱితండు రాజద్రోహియై ద్రవ్యం బపహరించెనని వాడవాడలం దూఱుచుండు దుర్జనులంజూచి సహింపఁజాలక భగవద్భక్తులగు కొందఱావర్తమానంబు రామదాసుగారితో విన్నవింప నిర్మలచిత్తుండు గావున కోపంబులేక వారలంగాంచి యిట్లనుచున్నాఁడు

కాంభోజిరాగము - చాపుతాళము.

తాఁజేసిన మేలుదైవమెఱుంగవలె తాఁజెప్పుకోవలెనా
వాసిగధర్మముఁ జేసుకున్నఁజాలు కాశికిఁబోవలెనా తాఁజేసిన.
కలకాలముతల్లి కరుణభోజనమిడు కాలమందుఁజూడండీ
కులుకుచుఁబెంచిన కొడుకులగుణముల కోడలొచ్చినఁజూడండీ తాఁజేసిన.
ప్రేమగల్గినట్టి పెండ్లాముగుణమెల్ల పేదరికమునఁ జూడండీ
కామించి బంధులకరుణారసంబెల్ల కలసిమెలసి చూడండీ తాఁజేసిన.
అలరుచుఁదిరిగేటి యన్నలగుణమెల్ల నవిభక్తులై చూడండీ
చెలఁగుచుతిరిగేటి చెలికానిగుణము లేములు గలుగఁగఁ జూడండీ తాఁజేసిన.
జన్మముగలిగి జన్మమునకుఁ దగుగుణముగల్గితె మంచిది
ధనముకలిగితేను ధనమునకుఁదగినట్టు ధర్మమున్ననుమంచిది తాఁజేసిన.
హరిదాసులనెల్ల నాదరించినట్టి యానందమిదె చూడండీ
వరరామదాసుని వాగ్వైఖరి విన్నవారలకే ఫలము తాఁజేసిన.

వ. కావున మీరలేల విచారంబునొందెద రెవ్వరేమనిన మనకే మంచుల కొఱంతపడియెడి సర్వంబునకు రాముండె కర్తయగు నైనను నాజనులను రామునియందు బుద్ధినిల్పుండని యేను తెలుపుదుంగాక యని పురవీథుల మృదంగాది వాద్యంబులతోడ నృత్యంబు సేయుచుఁ బౌరులం గాంచి నిఖిలభవరోగహరంబగు నారామజోగిమందుఁగొనుం డని కీర్తనము సేయుచున్నారు.

జంఝూటిరాగము - ఆదితాళము.

రామజోగిమందుఁగొనరే పామరులారా రామజోగిమందుఁగొనరే.

రామజోగిమందు మీరుప్రేమతో భుజియించినపుడె
కామక్రోధములనెల్లఁ గడకుఁ బారద్రోలేమందు — రామ.

మదమాత్సర్యలోభములను మాటలో నిలిపేటిమందు
గుదిగొన్నకర్మములను చూడఁగా నెడఁద్రోలేమందు — రామ.

కాటుకకొండలవంటి కర్మము లెడఁబాపేమందు
సాటిలేదు జగములందు స్వామిరామజోగిమందు — రామ.

కోటిధనములిచ్చేమని కొనఁబోయిన దొరకనిమందు
సాటిలేనిభాగవతులు స్మరణచేసి తలఁచేమందు — రామ.

ముదముతో భద్రాద్రియందు ముక్తినొందించేటిమందు
సదయుఁడై శ్రీరామనామ సద్భక్తితోఁ గొలిచేమందు — రామ.

వ. ఈక్రమంబున నాభద్రాచలంబున నందఱకును ముక్తిమార్గైక హేతుభూతంబగు రామనామస్మరణయం దభినివేశనంబుఁ గలుగ నుప దేశింపుచు ననేకహాయనంబులు గడపి ముదిమి సంప్రాప్తంబైన రామ దాసుగారు రామునిందలంచి యిట్లని వినుతిసేయుచున్నారు.

* సారరహితసంసారములోఁబడి తారితినో రామా
ఘోరనరకమని తోఁచెను సంసృతిఁ గుందఁజాలరామా.

సైంధవిరాగము - ఆదితాళము.

భళిరావైరాగ్యమెంతో బాగైయున్నది చంచలమైనమనసు నిశ్చలమైయున్నది . భళి.
అరిషడ్వర్గములునన్నంటకున్నవి శ్రీహరినామస్మరణజిహ్వ కనువైయున్నది . భళి.
గురుధ్యానమందేమనసుకుదురైయున్నదిచిత్తమిరుపదియారింటమీదనిరవైయున్నది భళి.
పరుల్లధనములఁజూడఁ బెచ్చు పరిగియున్నది అలపరభామలందు మాతృభావమున్నది భళి.

పరమశాంతమెన్నగాను బాగైయున్నది మాకుపరతత్త్వమందెబుద్ధిపట్టెయున్నది భళి.
విరసము వేఱులేనివిభవమైయున్నది ప్రకృతి తెఱఁబాసి మోక్షమునకు తెరువై యున్నది.
గురిభద్రాద్రీశునందెగుఱుతైయున్నది యిప్పుడెరలేకరామదాసుఁడనఁదగియున్నది. భళి.

* ఇహసుఖంబులేనొల్లను నీదగు యేలుఁబడినిఁజూపు
అహరహంబునీమూర్తినిఁ జూచుచు విహరించఁగ నిలుపు.

వ. అని మోక్షాపేక్ష నిట్లని ప్రార్థింపుచున్నారు.

అసావేరిరాగము - చాపుతాళము.

వీరరాఘవ నిన్ను వేఁడినందుకునన్ను వెఱవకుమనరాదా
వారివీరిని వేఁడుకొనినను నోరునొచ్చునుగాని యిప్పుడు
కోరి మదిని గొల్చి మోక్షము కోరికొంటిని కొదవసేయకు వీర.
ఎన్నివిధముల విన్నవించిన నీకెందుకు దయరాదు నాకన్నతండ్రిపటంచునమ్మితిఁ
గరుణనీకింతైనలేకనెయున్న జాడలు తెలియదాయనుచుంచితమా యిదిపతితపావన వీర.
నీకునాపైదయలేకయుండినఁగానినాకెవ్వరునులేరురా లోకమెఱుఁగఁగనాకుభాగ్యము
జోకతో యిపుడివ్వకుంటె నీకు బావనబిరుదుచెల్లదు నిజముగా నీజగమునందున వీర.
క్షాత్రకుఁడని యీపట్ల గాచుటకుఁజేతగాదని యున్నావో ఘాతచేసినవాని తమ్ముఁడు
కావుమన్ననుగావలేదా జాతినాతిగఁ జేయలేదా రామదాసునిఁ బ్రోవరాదా వీర.

వ. ఈక్రమంబున స్తుతిసేయుచు తన్మయుండైయున్న రామదాసుని తాత్పర్యం బెఱింగి లోకైకనాయకుండగు రాముం డశరీరవాక్యంబుల నిట్లనియె.

* రామదాస నీభక్తికి మెచ్చితి రక్తినిత్తు మత్పదము
భూమిలోన నొకకొన్నిదినంబులు ముదముతోడ మనుము.
ఆమాటలువిని కన్నులువిచ్చెను ఆశ్చర్యము పెనఁగొనఁగా
ప్రేమతోడ నలుదిక్కులఁజూచెను నామరూపముల నెఱుఁగన్.
ఈగతిఁ బల్కినవార లెవ్వరని యెంతో యోచనఁజేసెఁ
భోగిశయనుఁడే బలికె ననుచు నప్పుడు ధ్యానముసేసెన్.

ఆరభిరాగము - ఆదితాళము.

ఎక్కడఁజూచిన రాముఁ డక్కడనున్నాఁడు
తానొక్కఁడనంతరూపముల నొప్పియున్నాఁడు ఎక్క.
తాపసులహృదయములకు దీపమైనాఁడు
దివ్యరూపములకెల్ల నాదిరూపమైనాఁడు ఎక్క.

దండిగఁ జరాచరముల కాధారమైనాఁడు
అఖండమై బాహ్యాంతరముల నిండియున్నాఁడు ఎక్క.
మూఁడుమూర్తులకు న్నాదిమూలమైనాఁడు
భూసలోఁ బ్రాఁడువలెనే యంత టంతర్యామియైనాఁడు ఎక్క.
దాసుల పాలికి నిజావేశుఁడై నాఁడు
రామదాసు నేల భద్రగిరి నివాసుఁడై నాఁడు ఎక్క.

వ. అని మఱియు నిట్లు చింతింపుచు.

* రామాజ్ఞక్రమమున భువినిలిచెను రామదాసవర్యుండై
సోమసూర్యనేత్రా యనిసొక్కుచు సోలుచు ధీరుండై.

వ. ఇట్లని రామస్మరణసేయుచునుండె నెట్లనిన.

మోహనరాగము - చాపుతాళము.

గోవింద సుందర మోహన దీనమందారగరుడవాహన
భవబంధాదిదుష్కర్మదాహన భక్తవత్సల త్రైలోక్యపావన గో.
కలితులపై ప్రేమరోసితి సతతమునీపై భారము వేసితి
యది మిముఁ గనులఁజూడఁగ వాచితి మీదయ కెప్పు డెదురెదురెచూచితి గో.
చాలాదినములు మిము వేఁడితి కాలహరణము పేసి విడనాడితి
మేలా నీనామము పాడితి మెరసి ముందొక్కవిధమున వేఁడితి గో.
దీనరక్షకుఁడని విందును యేతీరున మీకృపఁగందును
మానసమున నమ్మియుందును నామనవి చేకొనవేమనందును గో.
అధికుఁడవని నమ్మినందుకు ఆశ్రయించితె శ్రమపెట్టెదెందుకు
మిము వెదకి కొలిచేదెందుకు నాకిది పూర్వకృతము లనుటెందుకు గో.
దాపైవచ్చె వార్ధక్యము యిఁక ప్రాపేది బహుసామీప్యము
యెంతని వినుపింతును గోప్యము మీరెపుడు చూపేరు సారూప్యము గో.
భద్రగిరిని నీవు లేవేమో ఉనికి నిజమైతె మొరవిని రావేమో
కరిని గాచినశ్రీహరి కావేమో రామదాసుని మొర వినరావేమో

వ.ఇవ్విధంబున భగవంతుని ధ్యానంబుసేయుచున్నఁ గొన్ని దినంబులకు భద్రశైలం బెక్కుటకు శక్తిలేక ముదిమి సంప్రాప్తంబైన రామదాసు విచారగ్రస్తుండై కలకాలము నీసేవఁజేసిన నాదౌర్బల్యంబు పాటించి యేల పలుకవు స్వామీ యని సంకీర్తనము సేయుచున్నారు.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

రామమాటాడవ దేమిరా కోదండ సీతారామ మాటాడవదేమిరా
స్వామీ నేనీనామస్మరణ కామించియున్న యప్పుడె
నీమోమైనఁ జూపవై తివయ్యయ్యో కోదండపాణి రామ.
పుట్టినదిమొదలుకొని నీపాదములె గట్టిగనే నమ్మితిని యింకనైననుఁ జేపట్టి
రక్షించెదనని తలఁపునలేక యిట్టి వెతలఁబెట్టి తేని యింకమీఁదు నేనెట్లుకోర్తు
నాకింక నెవ్వరుగతి నాదుచేపట్టియు విడుచుటనీకు పాడియె కోదండపాణి రామ.
పలుమాఱు వేఁడెదనని జడిసో నాలోనియార్గురి ఖలులఁద్రుంచేది నీకదిగడుసో
నావ్రతమనేది జలమైనచతుర్థంబని తెలిసో దూరినఁగాని పలుకకుండేది నీమనసలసో
కలిమిబలిమినీవేననిపలుమాఱువేఁడినగాని తెలిసియిట్లుదొలఁగియుండన్యాయమా కో.
శరణాగతబిరుదునీదేసుమ్మీ భద్రాద్రిమందిర రామనిన్నే చాలనమ్మియున్నవాఁడ నీ
కరుణనుంతైనరానిమ్మీ మత్తిల్లి సుందర రామదాసు నేలుకొమ్మి పరమేశ్వర
నీదాసుఁడనంటి పరునివలెనుజూచి యనాదరణచేసేది న్యాయముకాదురకోదండ.

వ. అని మఱియును కృష్ణపరంబుగా స్తుతిసేయుచున్నారు.

యమునాకల్యాణిరాగము - ఆదితాళము.

పాహిపాహి కృష్ణమాం పరమదయాళో దేహిమేత్వయిభక్తిం దీనదయాళో పాహి.
కమలాధ్యక్షాకృష్ణా కరుణాకటాక్ష అమరసంరక్షా సురశిక్షాకమలాక్షా పాహి.
నందనందనాకృష్ణా నతజనావనామందస్మితవదనా భక్తచందనచారులోచనా పాహి.
మంజుభాషణాకృష్ణా మహితభూషణా కుంజరపతిపోషణ గురుగోగణరూపధారణా
భద్రవినుత రామా మాంపాలయ పరంధామా భద్రగిరినివాసా
రామదాసాహృద్వాసా పాహి పాహి కృష్ణ మాం.

మ. నను జన్మింపఁగఁజేసి యింద్రియములన్ నాయందుఁ గల్పించి యా
పనులందే దిరిగించి పాపములు నాపైఁబెట్టి నేఁదేరకాఁ
డనుచుంబోయెదొ సూత్రధారి వగునీ వాడించినట్టే నటిం
చిన కీల్బొమ్మను యెట్లు నేసినసరే శ్రీభావనారాయణా.

వ. అని యివ్విధంబునఁ గర్తృత్వాదిస్వాతంత్ర్యధర్మంబుల నీశ్వరా
ర్పణంబుఁజేసి "సర్వధర్మాన్పరిత్యజ్య" యనుచరమశ్లోకార్థంబు దృఢంబుగ
మనంబునఁ బాదుకొల్పి నిశ్చలుండై యుండ భద్రాచలరాముఁ డీప్సితఫల
ప్రదాతయగుట రామదాసుకోరిన తెలుంగునభక్తుని భద్రశైలంబునకుం

గొనిచని తనయందునవ్యయపదంబగు సాయుజ్యంబొసంగందలంచిరామ దాసునికడకు రా నుద్యోగించుసమయంబున గోపన్న లోకైకమాత యును కరుణాసముద్రయు నగుసీతాదేవినింగూర్చి యిట్లనుచున్నారు.

శా. శ్రీరంజిల్లఁగ నెల్లవాంఛితములన్ జేకూర్చి రక్షింప నా
ధారంబై వెలుఁగొందు నీయడుగులుత్సాహానురాగంబు లే
పారం బెంపుదలిర్ప నేర్పొదవ నెయ్యంబొప్ప నిత్యంబు నే
నారాధించెద భద్రశైలనిలయా యక్షీణసంపత్కరీ.

శహాన రాగము - చాపుతాళము.

రమణిరో రాముని రమ్మనవే ప్రేమ మీఱఁగ నొకముద్దు యిమ్మనవే
అందమైన గజ్జలందియలు పాదద్వంద్వముల నింపొందఁగను రమణిరో.
కస్తూరితిలకము జాఱఁగను కనకకౌస్తుభహారము గుల్కఁగను రమణిరో.
మచ్చికచే ముచ్చటలాడుచును నాయిచ్చనుగల కోర్కెలియ్యఁగను రమణిరో.
ముదమునఁ జిరునగవులొత్తఁగను వానికదిసి కన్నులనిండఁజూచెదను రమణిరో.
ధర రామదాసుని వదలకను భద్రగిరివాసుని నేఁడు వేఁడగను రమణిరో.

శా రక్షించం గద వమ్మ దీక్షఁగొని ఘోరంబైన పాపంబులన్
శిక్షింపం గద వమ్మ యెల్లకలుములన్ నేకూరఁగాఁ బ్రేమ న
న్నీక్షించం గద వమ్మ నమ్మితిని తల్లి చల్లఁగాఁ బ్రోవు కం
జాక్షీ జానకి భద్రశైలనిలయా యక్షీణసంపత్కరీ.

వ. అని యివ్విధంబున నాజగజ్జననిం బ్రార్థింప నాయమ్మ నాథునికడ నిల్చి భక్తునిం బ్రోవుమా యని ప్రార్థింప రాముండు గరుత్మంతునిం బిలిచి యశ్వాకారుండవై నావెంట రమ్మనుమని ఖాసుదారీవానిపలెఁ దావేషంబుధరించి భక్తునికిఁ దపనతీక్ష్ణకిరణంబుల బడలకయుండుటకై లక్ష్మణుని ఛత్రధారునింగా నుండునటులఁ గఱపి భక్తకామదుండగు రాముండు సూర్యోదయాత్పూర్వంబున రామదాసుగారి గృహంబువాఁకిట నిలువంబడి యహోభద్రాచల రామదాసా భద్రగిరికిం గొని చని యెద రమ్మనిన నతం డిల్లువెడలి బైటవచ్చి యశ్వంబును ఖాస్దారి వానింగాంచి యెటులైనను రాముని దర్శింపంగలిగెఁగదా యని సమ్మతించి యశ్వంబునెక్కి సహచారిణి యగుభార్యంబిలచి రావే యనిన

స్నానంబుసేయుచున్న దాన నిదిగో వచ్చెద ననిన నీప్రాప్తం బింతయే యని ప్రయాణోన్ముఖుం డగుటయు నాయశ్వంబును ఖాసుదారీఛత్రధారులును ఖేచరమార్గంబున కెగసిపోవుచుండ రామదాసుగారు రాముని మానసంబున నిల్పి యెల్లవారు విన నిట్లని కీర్తనము చేయుచున్నారు.

పున్నాగరాగము - ఆదితాళము.

తర్లిపోతాము చాలాదయయుంచండి ఇఁకనుమళ్లీ జన్మాలకురాముమదిలోనుంచండీ తర్లి.
బార్లుగట్టిభక్తపరులుభజనలుసేయఁగను మూడుయేర్లుగలసిన దారియోఱఁగివేగమున తర్లి.
సోఽహమనియేటికత్తిఁజేతనేఁబూని అట్లెమోహపాశమునెల్ల మొదటికేత్రుంచి తర్లి.
ఈషణత్రయముకెల్ల నిలలోనెడించి సంతోషసాగరమునందె సంచరించుచూ తర్లి.
తారకమంత్రౌషధధారలుగ్రోలీ యేపుమీరఁగాను మోక్షపదవిహెచ్చుగఁగాంచీ తర్లి.
ఆఱుకమలముల మీఁద నద్భుతమైన సహస్రారకమలమందుఁజేరి సంతసింపుచు తర్లి.
చక్కనిభద్రాద్రిరామస్వామికృపను పెంపెక్క రామదాసుఁడనెపేరుచేతను తర్లి.

వ. అని యెల్లవారికిం దెలిపి నిశ్చలంబైన చిత్తంబున రామభజన సేయుచుం బోవుచున్నారు.

అసావేరిరాగము - చాపుతాళము.

కోదండరామా భద్రాచల కోదండరామా.
కోదండరామ నీవేదండమాకు మరేదండయెఱుఁగము మీదండతప్పను కోదండ.
ఎగుభుజములవెంట ధగధగనింపొందు నిగనిగలాడు తూణీరముగలిగిన కోదండ.
అంగరాగములై వజ్రాంగముదొడి సమరాంగణమున వెనకాగ వెరఘువీర కోదండ.
బలుఁడలక్ష్మణయని పలుకనడవిచెంత జలనిధిఘటు నిర్జలభూమిఁజేసిన కోదండ.
బాణాగ్రమెక్కడ పాథోధియెక్కడ నాణిముత్యముగశరాగ్రమందుంచిన కోదండ.
నందిగ్రామములోన విందారగించి మీరందఱుఁగూడియయోధ్యకేతెంచిన కోదండ.
అక్కడవెడలి భద్రాచలమందున గ్రక్కునవెలసిన రామదాసపోష కోదండరామా.

వ. ఇవ్విధంబునఁ గీర్తనంబుఁ జేయుచుంబోవ నాహాయరాజంబు భద్రశైలశిఖరంబునఁ గోదండరామస్వామి కోవెలకవాటంబు ముందు డిగ్గిన, కవాటంబులు బీగముద్రలైయుండఁ గని విచారంబున కవాటంబులు మూసియున్నయది రామా నీమూర్తినిఁ జూచుభాగ్యంబు కృప సేయుమని స్తుతిసేయుచున్నారు.

శ్లో. శ్రీమన్నిర్మలపుణ్యవైభవసుధాప్రాయామ్బుగోదావరీ
తీరే కల్పకకాననాంతరమహాభద్రాద్రికూటాన్తరే,
శోభాయుక్త విచిత్రరత్నఖచితే సింహాసనే సంస్థితం
శ్రీభద్రాచలరామచంద్ర మనిశం సీతాసమేతం భజే.
కింజల్కారుణవాససం కువలయశ్యామం సరోజేక్షణం
మాణిక్యాఙ్గవిభూషితాయతభుజం వజ్రోజ్జ్వలత్కఙ్కణమ్,
ముక్తాహారవిభూషితం మణిలసత్కాఞ్చీగుణాలఙ్కృతం
శ్రీభద్రాచలరామచంద్ర మనిశం సీతాసమేతం భజే.

సావేరిరాగము - ఆదితాళము.

కలయే గోపాలం కస్తూరీ తిలకసుఫాలం కుండలరుచి లలితకపోలం
జలదసన్నిభకాంతి కాంతం జగన్నాథపురనిశాంతం కలయే.
అనుపమరూపం మహితమణి కనకకలాపం విగతగోప వనితానుతాపం
మునిమనోనీరజతరణిం వనజసన్నిభ చారుచరణం కలయే.
అవితద్విజాతం కరాంభోజ నవనవనీతం కమలభవభవమునిగీతం
వివిధకుసుమాలంకారం విమలబృందావన విహారం కలయే.
భాసితభానుం భద్రాద్రినివాసనిదానం దివ్యానందభాసురగానం
రాసకేళివిరాజమానం రామదాసశ్రిత నిదానం కలయే.

వ. ఇవ్విధంబున నిర్మలచిత్తుం డై రాముని నిరామయస్వరూపంబు భావించి ధ్యానించుతఱి కవాటంబులు ఫెళఫెళార్భటులవిచ్చిన నాఖాసుదారియును యశ్వంబును ఛత్రధారుండును రామదాసుని డిగ్గనివ్వక రామాలయంబులోనికిఁ గొని చనునప్పుడు రామదాసుగా రా రామమూర్తిని భావించి నేత్రంబు మొగిచి నిర్వికల్పమానసుం డై ధ్యానించి మరల కనుదమ్ములవిచ్చి యుదయకాలం బగుట భూపాళరాగంబున రామభూపాలునిఁ దనకు మోక్షం బొసంగుటకొఱకు మేలుకొను మని మేలుకొలుపులుఁ బాడుచున్నారు.

భూపాళరాగము - చాపుతాళము.

శ్రీమించుకౌసల్యగర్భరత్నాకర శ్రీరామమూర్తి మేలుకో.
సురలోకమానంద మొందనుదయించినసూర్యవంశాగ్రణి మేలుకో రామ మేలుకో.
భరతాలక్ష్మణ శత్రుఘ్నులతో వేదపఠన సేయవలె మేలుకో
గరడీలు దలిపేటి వస్తాదులెల్లను కాచియున్నారయ్య మేలుకో రామ.

శ్రీమించు కౌశికయాగసంరక్షణా సేయంగఁబోవలె మేలుకో
కామించి గౌతమసతిశాపమోక్షము గావించఁబోవలె మేలుకో రామ.
వేమాఱుజగమెల్ల యెఱుఁగంగహరువిల్లు విరువంగఁబోవలె మేలుకో
ప్రేమతో జనకునియింటను జానకిఁబెండ్లాడఁబోవలె మేలుకో రామ.
పరశురామునిబాహుబలమెల్లనణఁపంగ పరువడిపోవలె మేలుకో
చిరపుణ్యుఁడగు దశరథరాజువాక్యము చెల్లించఁబోవలె మేలుకో రామ.
గరిమతో గుహుఁడాచరింపు సపర్యలు గైకొనఁబోవలె మేలుకో
ధీరుఁడుండు పంపాతీరమున వాయుసుతుఁగానఁబోవలె మేలుకో రామ.
ఖండించి ఖరదూషణాదుల విజయముఁ గైకొనఁబోవలె మేలుకో
మెండుచాయలుఁగల బంగారుమృగముకై వేటలాడవలె మేలుకో రామ.
చోరునిమాయొక్క.కోలనువాలిని కూలవెయ్యవలె మేలుకో
కారుణ్యమున సుగ్రీవునిపట్టము కట్టించఁబోవలె మేలుకో రామ.
దిట్టయినహనుమంతుఁగని సీతక్షేమము తెప్పించఁబోవలె మేలుకో
నెట్టనజలరాశి ఘట్టించి వారధిఁ గట్టించఁబోవలె మేలుకో రామ.
నెట్టనరావణ కుంభకర్ణాదుల నిర్జించఁబోవలె మేలుకో
పట్టభద్రుఁడై ప్రబలువిభీషణుని పాలించఁబోవలె మేలుకో రామ.
లంకలో జానకి రక్షింపవలె శుభలక్షణగుణనిధి మేలుకో
పొంకముతో నగ్నిముఖమునభక్తినిబొగడంగఁబోవలె మేలుకో రామ.
శంకలేక పుష్పకమెక్కి వేడుక నగరికిఁ జనవలె మేలుకో
అంకెలువేయుచు భరతాదులఁగూడి రంజిల్లఁబోవలె మేలుకో రామ.
నందిగ్రామములోనఁ బాదుకారోహణ మందఁగఁబోవలె మేలుకో
అందఱుఁజూడంగ మదపుటేనుఁగునెక్కి యేతేరఁబోవలె మేలుకో రామ.
కమలసంభవుఁ డాదిగావచ్చి ద్వారాన కాచియున్నారయ్య మేలుకో
క్రమముతోడుత మీమహిమలెల్లచాల పాడేరువినవయ్య మేలుకో రామ.
పొందుగనయోధ్య సింహాసనమెక్కి భూములేలవలె మేలుకో
సుందరిమణియైన జానకితోఁగూడి సుఖయించఁబోవలె మేలుకో రామ.
సమయమిదిగో రామదాసున కిప్పుడు సామ్రాజ్యమొసఁగుదు మేలుకో
క్రమమొప్పభద్రాద్రియందున నెలకొన్న కారుణ్యనిధివేగ మేలుకో రామ.
భక్తులపాలించవలె నిద్రచాలించు భక్తవత్సల యిఁక మేలుకో
వేమాఱుపనులింక చాలగా నున్నని వారిజలోచన మేలుకో రామ మేలుకో.

వ అని మేలుకొల్పి తనకు మోక్షం బొసంగుటకొఱకు రాముల పదపద్మములకు నమస్కారము సేయుచు కీర్తనము సేయుచున్నారు.

చతుర్వింశతినామప్రతిపాదకమైన చూర్ణిక.

శ్రీమదఖిలాండకోటిబ్రహ్మాండభాండతండోపతండకరండమండలకాంతోద్దీపిత సగుణనిర్గుణాతీతసచ్చిదానందపరాత్పరతారకబ్రహ్మాహ్వయ దశదిశప్రకాశం, సకల చరాచరాధీశం. కమలసంభవశచీధవప్రముఖనిఖిలబృందారకబృందవంద్యమానసందీప్త దివ్యచరణారవిందం, శ్రీముకుందం, దుష్టనిగ్రహ శిష్టపరిపాలనోత్కట కపటనాటక సూత్రచరిత్రాంచిత బహువిధావతారం, శ్రీరఘువీరం. కౌసల్యాదశరథమనోరథా మందానంద కందళితనిరూఢక్రీడావిలోలనశైశవం, శ్రీకేశవం. విశ్వామిత్రయజ్ఞవిఘ్న కారణోత్కట తాటకాసుర సుబాహుబాహుబలవిదళన బాణప్రవీణపరాయణం, శ్రీమన్నారాయణం. నిజపాదజలజరజఃకణస్పర్శనీయశిలారూపశాపవిముక్త గౌతమసతీ వినుతమహీధవం, శ్రీమాధవం. ఖండేందుధరప్రచండకోదండ ఖండనోద్దండ దోర్దండ కౌశికలోచనోత్సవజనకచక్రేశ్వరసమర్పిత సీతావివాహోత్సవానందం, శ్రీగోవిందం. పరశురామభుజాఖర్వగర్వనిర్వాపణతానుగత రణవిజయవర్ధిష్ణుం, శ్రీవిష్ణుం. పితృవాక్యపరిపాలనోత్కటజటావల్కలోపేత సీతాలక్ష్మణసహిత మహితరాజ్యాభిమత దృఢవ్రతకలిత ప్రయాణరంగద్గంగావతరణసాధనం, శ్రీమధుసూదనం. భరద్వాజోపచారనివారితశ్రమక్రమనిరాఘాటచిత్రకూటప్రవేశక్రమం, శ్రీత్రివిక్రమం. జనక వియోగశోకాకులిత భరతశత్రుఘ్న లాలనానుకూలబంధుపాదుకాప్రదాన సుధా నిర్మితాంతఃకరణ దుష్టచేష్టాయమానక్రూరకాకాసురగర్వోపశమనం, శ్రీవామనం. దండకాగమన నిరోధక్రోధవిరాధానలజ్వాలాజలధరం, శ్రీశ్రీధరం. శరభంగసుతీక్ష్ణాత్రి దర్శనాశీర్వాద నిర్వ్యాజ కుంభసంభవ కృపాలబ్ధ మహాదివ్యాస్త్రసముదయార్చితప్రకాశం, శ్రీహృషీకేశం. పంచవటీతటసంఘటిత విశాలపర్ణశాలాగతశూర్పణఖానాసికాచ్ఛేదన మానాపబోధన మహాహవారంభ విజృంభణరావణనియోగమాయామృగసంహార కార్యార్థలాభం, శ్రీపద్మనాభం. రాత్రించరవర వంచనాపహృత సీతాన్వేషణరథ పక్షికరథక్షోభితశిథిలీకృతపక్ష జటాయుమోక్ష బంధుప్రియావసాననిర్బంధితకబంధ వక్త్రోదరశరీరనిరోదరం, శ్రీదామోదరం. శబర్యుపదేశపంపాతటగమనహనుమత్సుగ్రీవ సంభాషణబంధురాద్బంధురదుందుభికళేబరోత్పతనసప్తసాలచ్ఛేదనవాలివిదారణప్రసన్న సుగ్రీవసామ్రాజ్య సుఖహర్షణం, శ్రీసంకర్షణం. సుగ్రీవాంగదనీలజాంబవత్పనస కేసరిప్రముఖ నిఖిల కపినాయకసేనాసముదయార్చితదేవం, శ్రీవాసుదేవం. నిజదత్తముద్రికా జాగ్రత్సమగ్రాంజనేయ వినయవచనరచనాంబుధిలంఘనోల్లంఘితలంకిణీ

ప్రాణోల్లంఘన జనకజాదర్శనాక్షకుమారహరణ లంకాపురీ దహన తత్ప్రతిష్ఠితసుఖ ప్రసంగధృష్టద్యుమ్నం, శ్రీప్రద్యుమ్నం. అగ్రజోదగ్ర మహోగ్ర నిగ్రహా పలాయమానావమానసీయ నిజశరణ్యాగణ్య పుణ్యోదయవిభీషణాభయప్రదానానిరుద్ధం, శ్రీమదనిరుద్ధం. అపారలవణ పారావారసముజ్జృంభితోత్కర్షణగర్వనిర్వాపణదీక్షా సమర్థసేతునిర్మాణప్రవీణాఖిలతరుచరోత్తమం, శ్రీపురుషోత్తమం. నిస్తుల ప్రహస్తకుంభకర్ణేంద్రజిత్కుంభ నికుంభాగ్నివర్ణాతికాయ మహోదరమహాపార్శ్వాది దనుజతనుఖండనాయమానకోదండగుణత్రవణశోషణహతాశేషరాక్షసవ్రజం, శ్రీఅధోక్షజం. అకుంఠితశరణోపకంఠ దశకంఠదనుజకంఠీరవకంఠలుంఠనాయమాన జయావహం, శ్రీనారసింహం. దశగ్రీవానుజపట్టభద్రత్వాశక్యవిభవలంకాపురీస్ఫురణసకలసామ్రాజ్యసుఖోజ్ఝితం, శ్రీమదచ్యుతం. సకలసురాసురాద్భుత ప్రజ్వలిత పావకముఖపూతాయమాన సీతాలక్ష్మణానుగత మహనీయ పుష్పకాధిరోహణ నందిగ్రామస్థిత భ్రాతృభిర్యుత జటావల్కల విసర్జనాంబరభూషణాలంకృతశ్రేయోవివర్ధనం, శ్రీజనార్దనం. అయోధ్యానగర పట్టాభిషేక విశేషమహోత్సవ నిరంతరదిగంతవిశ్రాంతహారహీరకర్పూర పయఃపారావార పారద పాణీకుందేందు మందాకినీ చందన సురధేను శరదంబుదాళీదర దంభోళి శతధారా ధావళ్య శుభకీర్తిచ్ఛటాంతరపాండురీభూతసభావిభ్రాజమాననిఖిలభువనైక యశస్సాంద్రం, శ్రీఉపేంద్రం. భక్తజనసంరక్షణదీక్షాకటాక్షశుభోదయసముజ్ఝరిం, శ్రీహరిం. కేశవాది చతుర్వింశతినామగర్భసందర్భితనిజకథాంగీకృత మేధావర్ధిష్ణుం, శ్రీకృష్ణం. సర్వసుపర్వ పార్వతీహృదయ కమలతారకబ్రహ్మనామం, సంపూర్ణకామం. భవతరణానుగుణసాంద్రం, భవజనితభయోచ్ఛేదచ్ఛిద్రమచ్ఛిద్రం, భక్తజన మనోరథోన్నిద్రం, భద్రాచల రామభద్రం, రామదాస ప్రసన్నం భజేఽహం భజేఽహం.

వ. ఇవ్విధంబున స్తుతిచేయుచుండ విశ్వాకారుండగు నాభద్రాచల రాముండు దశదిశావకాశాపరిపూర్ణంబగు దివ్యతేజఃపుంజంబును దుర్నిరీక్ష్యంబునునగు తనవిశ్వరూపంబుఁజూడ దాసునియశ్వంబును ఛత్రధారునిహయచోదకునిం దనయం దైక్యంబుఁజేసికొనుచునుండ రామదాసుగారు తనగురుండైన కబీరు తన కొసంగిన బ్రహ్మానందం బిదియకా యని సంకీర్తనముసేయుచు నావిశ్వరూపునియం దైక్యముఁ జెందుచున్నారు.

నాదనామక్రియరాగము - ఆదితాళము.

ఇది గురువాక్యం బిది వేదాంతం బిది తారక మిది బ్రహ్మము
ఇది మొదలిది నడు మిది తుదనాదము వదలక తెలిసినవాఁడే వాఁడౌ ఇది.
నేఁడుచూచినను నీడచందమున తోడైయుండుట నీవేగా
నేఁడై నాఁడై నీడను నీడై నిండినవాఁడవు నీవేగా

ఆడుచు పాడుచుఁ దేటలమాటల నన్నిటికూటము నీవేగా
ఓడకుమని గురు డాడినలక్ష్యము జాడనిలుచుటయు నీవేగా ఇది.

ఆకారంబున యష్టాక్షరియై యాత్మకు ప్రణవము నీవేగా
ఊకారంబున నున్నతోన్నమిత మురుపోషకుఁడవు నీవేగా
మకారంబునను మఱిభవభయముల మడియఁజేయుంటలు నీవేగా
అకలంకతను నఖండరూపమై యలరెడు ప్రణవము నీవేగా. ఇది.

నాయకిగన నానాయకి కావల నాయికత్వంబివేగా
పాయకచీఁకటిబయలఁగలపి భవభయములఁ ద్రుంచుట నీవేగా
కాయంబు నిరాకారంబును ధృతిఁ గలుగఁజేయుంటలు నీవేగా
మాయప్రపంచపు మాయలలోఁబడ వేయుంమాయకుఁడ వీవేగా ఇది.

కామమోహముల కట్టుఁబడకమముఁ గడతేర్చుటకును నీవేగా
తామసగోష్ఠినిఁ దగులనీకనీ తత్త్వము తెలుపుట నీవేగా
పామరత్వమునఁ బడనీయక చేపట్టిబ్రోచుటయుం నీవేగా
రామదాసగురురాయభద్రగిరి ధామసర్వమును నీవేగా ఇది.

వ. ఇవ్విధంబున రామదాసు విరాడ్విగ్రహుండగు రామునియం దైక్యభావంబునొందుచుండ నంతకుమున్న యర్చకులు ప్రాతఃకాలపూజ జరుప గౌతమీనదియందు కృతస్నానులై తిరుమంజనంబునకుఁ దీర్థంబు గొని భద్రశైలం బెక్కుచు నశ్వంబును ఖాసుదారీఛత్రధారునినాయ శ్వారోహకుండగు రామదాసునింగాంచి యత్యంతవ్యథచే నెట్టిపాపకర్ము లైనను స్వామిసాన్నిధ్యంబున కీమెయిఁజేరఁ గలరే అతివృద్ధుఁడగుట నితనిబుద్ధివికలత్వంబుఁజెందెనని యత్యంత కోపంబుతో రామాలయం బున కరుగుదెంచిచూడ తాముకాంచిన యశ్వాదులంగానక యాశ్చర్య మగ్నులైనిలచి, వేసినకవాటంబులు వేసినయటులుండుటయును,ఆలయం బులోపల భూపాలరాగంబున రామదాసుఁడు పాడుచుండుకీర్తనంబులు వినుచుఁ గవాటంబు దెరువంబోవరాకున్న నావర్తమానంబు బురంబు నెల్లెడలందెలియ నందఱుగుమిగూడి భద్రశైలంబెక్కి కోవెలకు నలు ప్రక్కలంజేరి గగ్గోలుసేయుచుండిరంతట శ్రీరామదేవుం డంతర్గతంబున.

గీ. భూసురోత్తము నేలుట భూజనులకుఁ, దెలియ నిది యొకలీలయై వెలయుఁ జగతి
ననుచు తనయందు వేగ సైక్యంబు నొందు, తురగఖురముల నిలిపెను గుఱుతుగాను.

సీ. అంతట నర్చకు లార్భాటములు సేసి తలుపులఁ దెకలింపఁ దలఁప నంత
ఫెళఫెళధ్వని దిశ ల్వీఁటలువారంగ విచ్చెను తలుపు లావింతఁ గాంచి

తిరుమంజనము సేయు తరిదప్పె ననుచును దత్తరంబునను విప్రోత్తములును
గూడి గర్భగృహగోళంబులోఁ జొచ్చి కాంచిరి రాముసాకారమహిమ

తే. చిత్తమున భీతిబొడమఁగఁ జేతులార్చి, భీకరాకారుఁడై చూడ భీతిగలుగఁ
జేయుంతురగఖురంబులచే వెలుంగు, మోముగలవాని మురహరు మోహనాంగు.

వ. ఇట్లున్న శ్రీరామదేవునిం గాంచి యర్చకులు రామదాసుగారి యఖండభక్తింగొనియాడి యిట్టియాకారంబుతో నున్న దేవునిం గాంచి సాష్టాంగనమస్కారంబులం జేసి ముకుళితహస్తులగుచు ఓదయానిధీ దాశరథీ ఈతీరున నే సేవయొసంగఁ దలంచితి రేని పామరులయిన మాబోంట్లు భీతిం జెందుదు మట్లగుటం జేసి శాంతరూపంబుఁ గైకొని మమ్ముద్ధరింపు మోస్వామీ యని స్తుతిసేయుచున్నారు.

శ్లో. అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ,
తస్మాత్కారుణ్యభావేన రక్ష రక్ష జనార్దన.

వ. అని స్తుతియించి శాంతభావం బంగీకరించుటకై యావిశ్వాకారున కర్చకులు కర్పూరనీరాజనంబొసంగుచు మంగళంబులు పాడుచున్నారు

సురటిరాగము - మిశ్రజాతి - ఏకతాళము.

మంగళం మంగళం రఘువీర నీకు మంగళం మంగళం.
అంగజజనక భుజంగశయన నీకు మంగళం శుభమంగళం
మంగళకర భక్తమానసాంతరంగ మంగళం జయమంగళం.
దశరథపుత్ర సీతాకళత్ర నీకు మంగళం శుభమంగళం
దశముఖభంజన తాపసావన నీకు మంగళం శుభమంగళం.
భక్తమానసహంస భవభయహర నీకు మంగళం శుభమంగళం
ముక్తిదాయక సర్వమునిజననుత నీకు మంగళం శుభమంగళం.
భద్రావన రామ భద్రదయానిధే మంగళం శుభమంగళం
అద్రిజవినుత భద్రాద్రివాస నీకు మంగళం శుభమంగళం.

వ. ఇవ్విధంబు మంగళహారతు లొసంగి ప్రార్థించిన సర్వజనంబులు చూచుచుండ రాముని ముఖమంటపంబునఁ దోఁచిన యశ్వఖురంబులు గానరావయ్యె నంతట జనులు రామదాసచరితంబుఁ గొనియాడఁగ శ్రవణపరంపరల వృద్ధిఁజెంది భగవద్భక్తులగు సజ్జనులు కాలక్షేపంబు సేయ నుపయుక్తంబయ్యె నవ్వాలివృత్తాంతం బెట్టులనిన.

సీ. రామచంద్రుండు శ్రీరామదాసునిఁ బిల్చి హయముపై నిడుకొని యరుగుచున్న
తఱి రామదాసుండు తనభార్యఁ బిలిచిన వచ్చెదననియు నావారిజాక్షి
కార్యవర్గంబులు కడువేగఁ గావించి తలవాఁకిటికి వచ్చి తనదువిభుని
గానక యెటఁబోయెఁ గానరే మీ రని పురజనంబుల నడుగఁ బుణ్యవతికి
గీ. వార లని రమ్మ దాసుఁడు వారువంబు, నెక్కి యాభద్రగిరిధాము నెలవుఁజేరి
నిత్యసంతోషపదవిలో నిలిచెనమ్మ, యహహ యేమందు మాతని యెలఘుతపము.
క. ఆమాటలు చెవిసోఁకిన, రామా యని మూర్ఛజెంది రపిం ధరఁ బడి తా
జామునకు తెలివిఁ దెచ్చుక, నేమాయెను బ్రతుకటంచు నిటుచింతించెన్.
సీ. రామ రామాయింత రంతాయె నాబ్రతుకు సంభ్రమమా యిది సహజమేన
ఆశ్రయించినవారి నాదరించకయుంట న్యాయమా కీర్తికి హానిగాద
సార్వకాలము మాయసంసారమున డొల్పి శ్రమల నొందించుటే జాణతనమ
పాపినైతే నేమి పాదాబ్జసేవలు సేయించుకొని చెంతచేర్పరాద
గీ. యింతకార్పణ్యమేలయా యినకులేంద్ర, యింక నెవ్వరివేఁడుదు నెందుఁ జొత్తు
నెవరుదిక్కు దయానిధి యీవెగాక, భద్రపురమున నీపదపద్మములను
భద్రగిరిధామ రఘురామ రామరామా.

వ అనుచు మఱియు నిట్లనుచున్నది.

అసావేరిరాగము - ఆదితాళము.

అయ్యయ్యో నేనేరనైతిని ఆదినారాయణుఁ దెలియనైతినీ
వెయ్యాఱుజన్మాల వెతలఁజెందితిఁగాని చయ్యన సద్గతి సాధించలేనైతి అ.
మోసమేమని తలఁచియుండు దోషవాసనలఁ దగిలి నేనిందు
ఆశాపాశములను అరసిత్రోచితిముందు వాసిగవైరాగ్యవాసనఁగననైతి అ.
మూఁడుమేలని నమ్మియుంటి యిరు మూఁడుశత్రులఁ గూడియుంటి
మూఁటి రెంటిఁగూర్చి మూఁటికెక్కువయైన కూటస్థునిఁగని కూడుండలేనైతి అ.
బంధనములు ద్రుంచివేసి భద్రగిరిరాఘవులలో నేఁగలిసి
సదయుఁడై నెలకొన్న శ్రీరామదాసు సుస్థిరముగఁజేపట్టి పోషించమననైతి అ.

వ ఇవ్విధంబున విచారంబునొంది యొక్కింతసేపు విచారించి మేలు గాంచి భద్రగిరిరాముండు ననుమాత్రం బెటుగాపాడకుండు నట్టిభగవద్భక్తుని చెట్టఁబట్టిననాకుఁ జెట్టలేల కలుగునని ధైర్యం బవలంబించి భద్రశైలం బెక్కి రాముని ముఖమంటపంబునం గూరుచుండి నిరశన [illegible] సాక్షాత్కారుండై పొడచూపి నీవేల

వికారంబులొందెదు. నీవింకం గొన్ని దినంబు లీభువిని నిలిచి నీపుత్త్రుల నీధర్మపాలనంబుసేయునంతటిసమర్థులం జేయుము అంతపర్యంతం బీశ్శైల శిఖరంబున తులసీవనకైంకర్యములు సేయుచు నుండుమని యాజ్ఞాపించి యంతర్హితుండైన రామాజ్ఞాప్రకారంబున నాయమ రామకైంకర్యంబు సేయుచు ఆగామిసంచితప్రారబ్ధంబులు విడనాడి యనంతరంబున యచ్యుతపదంబుం గాంచె.

## మంగళహారతి.

రామచంద్రాయ జనకరాజ మనోహరాయ మామకాభీష్టదాయ మహితమంగళం.
కౌసలేయాయ మందహాసదాసపోషణాయ వాసవాదివినుత సద్వరదమంగళం.
చారుకుంకుమోపేత చందనానుచర్చితాయ హారకటకశోభితాయ భూరిమంగళం.
లలితరత్నకుండలాయ తులసీవనమాలికాయ జలజసదృశదేహాయ చారుమంగళం.
దేవకీసుపుత్త్రాయ దేవదేవోత్తమాయ భావజగురువరాయ భవ్యమంగళం.
పుండరీకాక్షాయ పూర్ణచంద్రాననాయ అండజవాహనాయ యతులమంగళం.
విమలరూపాయ వివిధవేదాంతవేద్యాయ సుముఖచిత్తకామితాయ శుభదమంగళం.
రామదాసమృదులహృదయ తామరసనివాసాయ స్వామిభద్రగిరివరాయ సర్వమంగళం.

## జో ల పా ట.

జోరవికులశుభాంగ జోసన్నుతాంగా కరుణారసాపాంగ కరుణాంతరంగా జో.
శ్రీవెలయు పాలవారిధి పవ్వళించ దేవబృందముళెల్ల దివిసన్నుతించ
భావమెంచినవారి భక్తిపాలించ దైవరాయుండ మకుండ దరమెవర్ణించ జో.
గురుతరంబుగ ధర్మగుణము చేపట్టి దురితదానవకోటి దురములోఁగొట్టి
శరణాగతత్రాణ బిరుదుచేపట్టి కరుణతోఁ గౌసల్యగర్భమునఁ బుట్టి జో.
కమలసంభవవినుత ఘనసుగుణసాంద్రా అమితదుష్టభుజంగ యహితుండికేంద్రా
విమలవైభవముల వెలయదేవేంద్రా రమణతో వెలసితి రఘురామచంద్రా జో.

## హె చ్చ రి క.

హెచ్చరిక శ్రీరామ హెచ్చరిక జయరామ హెచ్చరిక రఘురామ హెచ్చరిక.
బంగారుగిన్నియల పొంగుగిరినపాలు అంగనలు దెచ్చిరనఁగ హెచ్చరిక.
పచ్చకర్పూరపువిడెము హెచ్చుగ సీతయందిచ్చుచున్నది రామదేవ హెచ్చరిక.
తళుకుబంగరు పిల్లగల చామరాలు భక్తవరు లేయుచున్నారు వరద హెచ్చరిక.

పరిమళద్రవ్యములు పన్నీరుఅత్తరు పరమదయఁగొను సార్వభౌమ హెచ్చరిక
బోటులిరువురు వీణెమీటి పాటలుపాడ నీటుగవినునట్టి మేటి హెచ్చరిక
వాసిగ నరసింహదాసపోషక శ్రీనివాస శ్రీభద్రాద్ర్యధీశ హెచ్చరిక

* తిరుకడయూరీ కృష్ణదాసు హరిదివ్యకథారసము
విరచించెను గోపన్న చరితఁగా విబుధులొందఁ ముదము.
ఇక్కథ భువి నెవ్వారలు విన్నఁ బఠించిన వారల కెల్లన్
గ్రక్కున రాముఁడు కరుణనొసంగును కామితార్థములనెల్లన్
మంగళ మంగజజనక మురహరా మంగళ మార్తశరణ్యా
మంగళ మద్రిజవినుత భవహరా మంగళ మురుగుణగణ్యా.
శ్రీకరముగ శ్రీరామనామమును జింతించిన జనులు
ప్రాకటయశుఁడగు రామదాసువలెఁ బరముగందు రానరులు.

క. పుడమిం గోపనచరితము, వెడఁదమనోహరముగా నవీనంబు తిరు
క్కడయూరి కృష్ణదాసుఁడ, నుడివితి నిది కృపను గైకొనుము శ్రీరామా.

క. భద్రాద్రిరామదాసుని, భద్రచరిత్రంబు వినిన భక్తిఁ బఠింపన్
భద్రేభవరదు కృపచే, భద్రాత్ముఁ నగుచుఁ గంద్రు పరమపదంబున్.

శ్రీభద్రాద్రిరామదాసచరిత్రము
సంపూర్ణము.

---

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1936.